శ్రీరస్తు

# సుశ్రుతశారీరస్థానము

## సాంధ్రతాత్పర్యము

శ్రీ సుశ్రుతాచార్యవిరచితము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

1941.

# ప్రకటన

ఇదివఱకు మేము ప్రాచీనతాళప్రతులసహాయమునను నాగరీ ప్రతులసహాయమునను వైద్యసంప్రదాయానుసారముగఁ జక్కఁగఁ బరిష్కరించి చరకసంహిత, వైద్యశతశ్లోకి, అనుపానమంజరి, నాడీజ్ఞానము, లోలంబరాజీయము, గదనిగ్రహము, శార్ఙ్గధరసంహిత, భేషజకల్పము, శార్ఙ్గధరత్రిశతి, అజీర్ణమంజరి, రావణ కుమారతంత్రము, చక్రదత్త, బసవరాజీయము, రసప్రదీపిక, రాజమార్తాండము, ఇలాజుల్ గుర్బా మొదలగుప్రాచీనవైద్యగ్రంథముల సుబోధమగునాంధ్ర తాత్పర్యముతో ముద్రించి ప్రచురించియున్నసంగతి వైద్యశిఖామణు లెల్ల రెఱింగినదియే. ఐనను మనదేశమం దెల్లెడ మిక్కిలి ప్రసిద్ధమైన 'బసవరాజీయము,' అను గ్రంథము పెక్కువైద్యులచేఁ గొనియాడఁబడుచు వాడుకలో నున్నది. ఇదివఱలో ముద్రితములైన ఈగ్రంథములలో ఏకారణమువలననో ప్రాచీన గ్రంథములంబట్టి ప్రయోగాదులలో కొన్ని మాఱుబాటుఁ జెంది మూలముననేగాక వ్యాఖ్యానమునను గొన్నికొన్నియెడల సంబంధము లేక యాయుర్వేదవిరుద్ధములుగ నుండినవి. ఈగ్రంథములన్నిటిని బరిష్కరించి ముద్రింపవలయు ననుకోరిక బహుకాలముగ నుండియున్నను, సరియగు ప్రాచీనతాళపత్రగ్రంథములు లభింపమిచే ఈపని కొంతయాలస్యముగ జరగుచున్నది. ప్రకృతము వైద్యలోకముయొక్క యదృష్టమునఁబోలె విశాఖపట్నముజిల్లా పాలకొండ తహసీల్దారుగారగు వి. శాస్త్రులు, బి. ఏ., గారివద్దనున్న తాళప్రతులు కొన్ని లభించినవి. ఇవి ప్రాచీనములుగను వైద్యసంప్రదాయానుసారములుగ నుండుటం జేసి వీనిం జక్కఁగఁ బరిష్కరింపించి ముద్రించినారము. ఆయుర్వేదాభిమాను లిట్టిసద్గ్రంథముల నాదరించి మఱియు నితరగ్రంథప్రకటనమునం బ్రోత్సహింతురు గాత యని కోరుచున్నాము.



ఇట్లు,

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీరస్తు.

# విషయసూచిక.

## తృతీయాధ్యాయము.

| విషయము. | పుట. |
|---|---|

## నవమాధ్యాయము.



## దశమాధ్యాయము.

శ్రీ ర స్తు.

శ్రీమద్ధన్వన్తరయే నమః.

# సుశ్రుత శారీర స్థానము

## ప్రథమాధ్యాయము.



అవతారిక: సుశ్రుతసంహితాకారుఁ డగు సుశ్రుతాచార్యుఁడు మొదట సూత్రస్థానమును బిదప నిదానస్థానమును వచించినవాఁడై యీరెండు దెలిసినను ఆశ్రయభేదముచే ననేకములగు వ్యాధులు శరీరమునందుఁ గలుగుచుండుటవలన నట్టి వ్యాధుల కాశ్రయమగు నీశరీరతత్త్వమెఱుఁగనిదే చికిత్సచేయుటకు వీలుపడదుగాన. వ్యాధుల కాశ్రయభూతంబులగు నాయాశారీరకభావము (తత్త్వము) లను దెలియఁజేయఁ దలఁచి క్రమప్రాప్తం బగునీశారీరస్థానము నారంభించుచు మొదట గ్రంథము నిర్విఘ్నముగఁ బరిసమాప్తినొందుటకై శిష్టాచారము ననుసరించి గ్రంథాదియందు మంగళాచరణము కర్తవ్యమైనందునఁ దొలుతొలుత "ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా, కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగలికావుభౌ" అనునట్లు మంగళవాచకమగు "నథ" శబ్దమును బ్రయోగించి శారీరస్థానము నారంభించుచున్నాఁడు:—

సూత్రమ్. అథాతస్సర్వభూతచిన్తాశారీరం వ్యాఖ్యాస్యామః. 1

తాత్పర్యము. అథశబ్దమునకుఁ దరువాతయనియు, నారంభమనియుఁ రెండర్థములు గలవు. కావున రోగనిదానముఁ జెప్పినపిదప శరీరతత్త్వము నెఱుఁగఁ జెప్పుచున్నాఁడని యర్థము. వైద్యునకు రోగనిదానము దెలిసినపిదప నాయారోగములకుఁ దగిన చికిత్స సేయుట కవకాశము గలుగుచున్నను జికిత్స శరీరతత్త్వము నెఱుఁగకయొనర్చుట దుర్లభము గావున "అతః" అను హేతువాచకపదముచే శరీరవిశేషమునకు హేతుభూతంబులగు పంచమహాభూతంబులఁ దెలిసికొనుట యత్యావశ్యకమని సూచింపఁబడుచున్నది. సర్వభూతములన సర్వప్రాణిశరీరములని యర్థము. "భూతేభ్యో హి పరం యస్మాన్నాస్తి చింతా చికిత్సితే" చికిత్సావిషయమై ప్రాణులకుఁ దక్క నితరాచేతనులకుఁ బ్రసక్తియుండదు గదా? కావున "శరీరమధికృత్య కృతో గ్రంథశ్శారీరః" అను వ్యుత్పత్తిచే శరీరమును గుఱించి యొనర్చిన గ్రంథము శారీరము. ఇట్టిశరీరము గలుగుటకుఁ గారణములు పంచమహాభూతములుగాన నవి యెట్లుత్పన్నంబులయ్యె? వాని

లక్షణ మెట్టిది? వాని కార్యంబు లెయ్యవి? మున్నగు విషయంబులఁ దెలియఁజేయు "సర్వభూతచింతాశారీరాధ్యాయమును" చక్కఁగ వివరించుచున్నాము.

### మూలప్రకృతిలక్షణము.

సూ. సర్వభూతానాం కారణమకారణం సత్త్వరజస్తమోలక్షణమష్టరూపమఖిలస్య జగతస్సంమ్భవహేతురవ్యక్తం నామ. తదేకం బహూనాం క్షేత్రజ్ఞానామధిష్ఠానం సముద్ర ఇవౌదకానాం భావానామ్. 2

అవ్యక్తము (మూలప్రకృతి) యనునది పృథివ్యాదిసర్వభూతంబులకుఁ గారణంబై, కారణాంతరముచే జనింపనందునఁ గారణరహితంబై, యవికృతస్వతంత్రసత్వరజస్తమోగుణాత్మకంబై, అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచమహాభూతములు, అన నష్టవిధంబై, స్థావరజంగమాత్మకప్రపంచోత్పత్తికిఁ గారణంబై యుండును. ఏక సంఖ్యగల యట్టి యవ్యక్తము అవయవశూన్యంబై సముద్రము సమస్తమైన జలజంతువుల కాధారంబై యుండునటులనే సమస్త కర్మజీవులకు నాధారంబై యుండును.

### మహదుత్పత్తి.

సూ. తస్మాదవ్యక్తాన్మహానుత్పద్యతే తల్లిఙ్గ ఏవ. 3

అట్టి అవ్యక్తమువలన సత్వరజస్తమోగుణాత్మకమహత్తత్త్వము జనించును. దీనిని బుద్ధితత్త్వమనియుఁ జెప్పుదురు.

### అహంకారోత్పత్తి.

సూ. తల్లిఙ్గాచ్చ మహతస్తల్లిఙ్గ ఏవాహఙ్కార ఉత్పద్యతే. 4

అట్టిమహత్తత్త్వమువలన సత్వరజస్తమోగుణాత్మక మగునహంకారము జనించును.

### త్రివిధాహంకారము.

సూ. స చ త్రివిధో వైకారికస్తైజసో భూతాదిరితి. 5

ఆయహంకారము వైకారికము (సాత్వికము), తైజసము (రాజసము), భూతాది (తామసము) అని మూఁడువిధంబులు.

### ఇంద్రియోత్పత్తివివరణము.

సూ. తత్ర వైకారికాదహఙ్కారాత్తైజససహాయాత్తల్లక్షణాన్యేవైకాదశేన్ద్రియాణ్యుత్పద్యన్తే. తద్యథా.— శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాగ్ఘస్తోపస్థపాయుపాదమనాంసీతి. తత్ర పూర్వాణి పఞ్చ బుద్ధీన్ద్రియాణి. ఇతరాణి పఞ్చ కర్మేన్ద్రియాణి. ఉభయాత్మకం మనః. 6

పైఁజెప్పినయాత్రివిధాహంకారములలో రాజససహాయతామసగుణాంశయుక్త సాత్వికాహంకారమువలన సాత్వికాహంకారలక్షణములు గలశ్రోత్రము (చెవులు), త్వక్కు (చర్మము), చక్షుస్సు (నేత్రములు), జిహ్వ (నాలుక), ఘ్రాణము (ముక్కు), వాక్కు (నోరు), హస్తము, ఉపస్థ, పాయు (గుదము), పాదము, మనస్సు, అను పదునొకొండింద్రియములు జనించును. వానిలో మొదటివి యగు శ్రోత్రాదులైదును జ్ఞానేంద్రియంబులు. ఈజ్ఞానేంద్రియంబులు సాత్వికాహంకారమువలన జనించినందున సత్వగుణమువలెనే ప్రకాశించుచుండును. ఇతరము లగువాగాదు లైదును కర్మేంద్రియములు. మనస్సంబంధములేక జ్ఞానకర్మేంద్రియములకుఁ బ్రచారము గలుగకుండుటం జేసి మనస్సు ఉభయాత్మకము.

## పంచతన్మాత్రోత్పత్తి.

సూ. భూతాదేరపి తైజససహాయాత్తల్లక్షణాన్యేవ పఞ్చతన్మాత్రాణ్యుత్పద్యన్తే. తద్యథా.—శబ్దతన్మాత్రం, స్పర్శతన్మాత్రం, రూపతన్మాత్రం, రసతన్మాత్రం, గన్ధతన్మాత్రమితి. 7

రాజససహాయసత్వాంశయుక్తతామసాహంకారమువలనఁ దల్లక్షణములు గల శబ్దతన్మాత్రము, స్పర్శతన్మాత్రము, రూపతన్మాత్రము, రసతన్మాత్రము, గంధతన్మాత్రమునను పంచతన్మాత్రలు జనించును. అవి యతిసూక్ష్మంబులనుటవలన సుఖదుఃఖాద్యనుభవాయోగ్యంబులుగ నుండును.

## తన్మాత్రవిశేషములు.

సూ. తేషాం విశేషాః శబ్దస్పర్శరూపరసగన్ధాః. 8

శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అనునవి పంచతన్మాత్రలయొక్క విశేషంబులు. విశేషమనఁగా; శ్లో. "శబ్దస్పర్శరూపంచ రసగంధావనుక్రమాత్, తన్మాత్రాణాం విశేషాస్స్యుః స్థూలభావముపాగతాః." అనుప్రమాణమునుబట్టి శబ్దస్పర్శాదులు స్థూలభావమును జెంది సుఖదుఃఖమోహానుభవమునకుఁ గారణములుగ నుండునని యర్థము.

## పంచమహాభూతోత్పత్తిక్రమము.

సూ. తేభ్యో భూతాని వ్యోమానిలానలజలోర్వ్యః. ఏవమేషా తత్త్వచతుర్వింశతిర్వ్యాఖ్యాతా. 9

ఆశబ్దాది పంచతన్మాత్రల విశేషములైన శబ్దాదులవలన నాకాశాదిపంచమహాభూతములు క్రమముగ జనించును. అయినను, శబ్దతన్మాత్రమువలన ఆకాశము, ఆకాశమువలన శబ్దస్పర్శగుణములుగలవాయువు, వాయువువలన శబ్దస్పర్శరూపగుణములుగల తేజస్సు, తేజస్సువలన శబ్దస్పర్శరూపరసగుణములుగల ఉదకము, ఉదకమువలన శబ్ద

స్పర్శరూపరసగంధగుణములుగల పృథ్వి, అనుపంచమహాభూతములు జనించునని మఱికొందఱు వచించుచున్నారు. ఈప్రకారము అవ్యక్తము, మహత్తు, అహంకారము, శబ్దతన్మాత్రము, స్పర్శతన్మాత్రము, రూపతన్మాత్రము, రసతన్మాత్రము, గంధతన్మాత్రము, శ్రోత్రము, త్వక్కు, చక్షుస్సు, ఘ్రాణము, రసనము, వాక్కు, హస్తము, పాదము, ఉపస్థ, పాయువు, మనస్సు, పృథివి, ఉదకము, తేజస్సు, వాయువు, ఆకాశము అను నిరువదినాలుగు తత్త్వములు వివరింపఁబడియె.

## జ్ఞానేంద్రియవిషయవివరణము.

సూ. తత్ర బుద్ధీన్ద్రియాణాం శబ్దాదయో విషయాః. 10

పైనఁజెప్పిన యిరువదినాలుగు తత్త్వములలో జ్ఞానేంద్రియము లగుశ్రోత్రాదులకు శబ్దాదులు క్రమముగ (శ్రోత్రమునకు శబ్దము, త్వక్కునకు స్పర్శము, చక్షుస్సునకు రూపము, జిహ్వకు రసము, ఘ్రాణమునకు గంధము) విషయంబులు.

## కర్మేంద్రియవిషయవివరణము.

సూ. కర్మేన్ద్రియాణాం యథాసఙ్ఖ్యం వచనాదానానన్దవిసర్గవిహారణాని. 11

వాగాదులు కర్మేంద్రియంబులు గాన, వానికి వచనాదులు క్రమముగ (వాక్కునకు సంభాషణము, హస్తమునకు గ్రహణము, ఉపస్థకు ఆనందము, గుదమునకు మలోత్సర్జనము, పాదమునకు గమనము) విషయంబులు.

## ప్రకృతివికృతివివరణము.

సూ. అవ్యక్తం మహానహఙ్కారః పఞ్చతన్మాత్రాణి చేత్యష్టౌ ప్రకృతయశ్శేషాష్షోడశవికారాః. 12

అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, అను నెనిమిదియుఁ బ్రకృతు (ఇతరములకుఁ గారణము) లని పరఁగు. తక్కిన పంచమహాభూతములు పదునొకొండింద్రియములు కలసి పదియాఱును వికృతు (వికారము) లని చెప్పంబడును. అవ్యక్తాపేక్షచే మహత్తత్త్వము మున్నగునవి వికృతులైనను, మహత్తత్త్వమహంకారమునకును, నహంకార మేకాదశేంద్రియములకుఁ బంచతన్మాత్రలకును, పంచతన్మాత్రలు పంచమహాభూతములకును బ్రకృతులగుటవలన "మూలప్రకృతిరవికృతిర్మహదాద్యాః ప్రకృతివికృతయస్సప్త, షోడశకశ్చ వికారోనప్రకృతిర్నవికృతిః పురుషః" అను కాపిలవచనానుసారముగ నెనిమిది ప్రకృతులని యేర్పడుచున్నది. అయితే పృథివ్యాదిభూతములు ఘటాదులకుఁ గారణములగుటవలన నవియుఁ బ్రకృతిరూపములుగావో? యనినఁ గానేరవు. పదార్థవిభాజక మగుసుపాధితోఁగూడిన తత్త్వాంతరమున కుపాదానకారణ మగునదియే ప్రకృతి యనఁబడును. ఘటాదులు స్థూలత్వాదిపరిమాణమునను, చక్షురింద్రియగ్రాహ్య

త్వమునను సమానధర్మములు గలవగుటచే నివి తత్త్వాంతరములు గానందున వీని కుపాదానములయినను బంచభూతములు ప్రకృతు లనుట సమంజసముకాదు.

—అధిభూత-అధ్యాత్మ-అధిదైవత వివరణము.—

సూ. స్వస్వ్వశ్చైషాం విషయోఽధిభూతమ్. స్వయమధ్యాత్మమధి దైవతం చ. 13

పైనఁజెప్పిన బుద్ధి, అహంకారము, మనస్సు, శ్రోత్రాదిజ్ఞానేంద్రియములు, వాగాదికర్మేంద్రియములు అనువానికి క్రమముగ (బుద్ధికి నిశ్చయము, అహంకారమున కభిమానము, మనస్సునకు సంకల్పవికల్పములు, శ్రోత్రాదిజ్ఞానేంద్రియములకు శబ్దాదులు, వాగాదికర్మేంద్రియములకు వచనాదులు) స్వస్వవిషయంబులు. ఇయ్యవి పంచభూతములయందు స్వరూపసంబంధముచే సంబంధించి భోగసాధనంబులై యుండుటం జేసి యధిభూతములనంబడును. మఱియుఁ బైఁజెప్పినబుద్ధ్యాదులు శరీరము నాశ్రయించి యుండుటవలన నధ్యాత్మమనియు, దేవతాసంబంధముచేతనే స్వకీయ వ్యాపారముల జరిగించుచుండుటవలన నధిదైవతమనియుఁ జెప్పంబడును.

—బుద్ధ్యాద్యధిష్ఠానదేవతలు.—

సూ. అథ బుద్ధేర్బ్రహ్మా, అహఙ్కారస్యేశ్వరః, మనసశ్చన్ద్రమాః, దిశశ్శ్రోత్రస్య, త్వచో వాయుః, చక్షుషస్సూర్యః, రసనస్యాపః, పృథ్వీ ఘ్రాణస్య, వచసోఽగ్నిః, హస్తయోరిన్ద్రః, పాదయోర్విష్ణుః, పాయోర్మిత్రమ్, ప్రజాపతిరుపస్థస్యేతి. 14

బుద్ధికి బ్రహ్మ, అహంకారమున కీశ్వరుఁడు, మనస్సునకుఁ జంద్రుఁడు, శ్రోత్రమునకు దిక్కులు, త్వగింద్రియమునకు వాయువు, నేత్రములకు సూర్యుఁడు, జిహ్వకు నుదకము, ఘ్రాణమునకుఁ బృథ్వి, వాక్కున కగ్ని, హస్తముల కింద్రుఁడు, పాదములకు విష్ణువు, గుదమునకు మిత్రుఁడు, ఉపస్థ (యోనిమేహనముల)కుఁ బ్రజాపతి యధిష్ఠాన దేవతలు.

[పైఁజెప్పిన అధ్యాత్మ, అధిభూత, అధిదైవత క్రమంబెట్లన:—కర్ణరంధ్రముల నాశ్రయించియుండు నాకాశరూపశ్రోత్రేంద్రియ మధ్యాత్మము. ఆశ్రోత్రేంద్రియమునకు విషయమైన శబ్దము అధిభూతము. ఆశ్రోత్రేంద్రియమున కధిష్ఠానదేవత దిక్కులు. త్వక్కునాశ్రయించియుండు త్వగింద్రియము అధ్యాత్మము. ఆత్వగింద్రియమునకు విషయమైన స్పర్శము అధిభూతము. ఆత్వగింద్రియమునకు వాయు వధిష్ఠానదేవత. మాంసగోళరూపమైన నేత్రము నాశ్రయించియుండు చక్షురింద్రియమధ్యాత్మము. ఆచక్షురింద్రియమునకు విషయమైనరూపమధిభూతము. ఆచక్షురింద్రియమునకు సూర్యుఁడధిష్ఠానదేవత. నాలుక నాశ్రయించియుండు రసనేంద్రియ మధ్యాత్మము. ఆరస

సేంద్రియమునకు విషయమైన రసముధిభూతము. ఆ రసనేంద్రియమున కుదకమధిష్ఠాన దేవత. నాసికము నాశ్రయించియుండు ఘ్రాణేంద్రియ మధ్యాత్మము. ఆఘ్రాణేంద్రియమునకు విషయమైన గంధమధిభూతము. ఆఘ్రాణేంద్రియమునకుఁ బృథ్వియధిష్ఠానదేవత. వాక్కు నాశ్రయించియుండు వాగింద్రియ మధ్యాత్మము. ఆవాగింద్రియమునకు విషయమైనభాషణ మధిభూతము. ఆవాగింద్రియమునకు నగ్ని యధిష్ఠాన దేవత. హస్తము నాశ్రయించియుండు హస్తేంద్రియమధ్యాత్మము. ఆ హస్తేంద్రియమునకు విషయ మగు నాదానము (గ్రహించుట) అధిభూతము. ఆహస్తమునకింద్రుఁ డధిష్ఠాన దేవత. మేఢ్రముల నాశ్రయించియుండునుపస్థేంద్రియ మధ్యాత్మము. ఆయుపస్థేంద్రియమునకు విషయమైన యానంద మధిభూతము. ఆయుపస్థేంద్రియమునకుఁ బ్రజాపతి యధిష్ఠాన దేవత. గుదమునాశ్రయించియుండు పాయ్వింద్రియ మధ్యాత్మము. ఆ పాయ్వింద్రియమునకు విషయమైన మలోత్సర్జన మధిభూతము. ఆ పాయ్వింద్రియమునకు మిత్రుఁ డధిష్ఠానదేవత. పాదము నాశ్రయించియుండు పాదేంద్రియ మధ్యాత్మము. ఆపాదేంద్రియమునకు విషయమైనగమనము (నడచుట) అధిభూతము. ఆ పాదేంద్రియమునకు విష్ణు వధిష్ఠాన దేవత. మనఇంద్రియ మధ్యాత్మము. ఆ మన ఇంద్రియమునకు విషయమైన మననము (యోచన) అధిభూతము. ఆ మన ఇంద్రియమునకుఁ జంద్రుఁ డధిష్ఠాన దేవత. మహత్తత్వరూపమైన బుద్ధి యధ్యాత్మము. ఆబుద్ధికి విషయమైన నిశ్చయజ్ఞాన మధిభూతము. ఆ బుద్ధికి బ్రహ్మ అధిష్ఠాన దేవత. అహంకార మధ్యాత్మము. ఆ యహంకారమునకు విషయమైన యభిమాన మధిభూతము. ఆ యహంకారమున కీశ్వరుఁ డధిష్ఠానదేవత అని తెలియఁదగు.]

## చతుర్వింశతితత్త్వస్వరూపము.

సూ. తత్ర సర్వ ఏవాచేతన ఏష వర్గః. 15

అచేతన మైనసువర్ణమువలన జనించినకటకాద్యాభరణములచందంబున, అచేతన మగు నవ్యక్తమునుండి జనించిన మహదాదిచతుర్వింశతితత్త్వవర్గంబు నచేతనంబు.

## పురుషస్వరూపము.

సూ. పురుషః పఞ్చవింశతితమ, స్సచ కార్యకారణసంయుక్తశ్చేతయితా భవతి, సత్యప్యచైతన్యే ప్రధానస్య పురుషకైవల్యార్థం ప్రవృత్తిముపదిశన్తి, క్షీరాదీంశ్చాత్ర హేతూనుదాహరన్తి. 16

ఇరువదియైదవతత్త్వ మగుపురుషుఁడు కార్యమగుశరీరముతోఁ దనుకారణము లగుసింద్రియాదులతోడను గూడినవాఁడై చైతన్యాశ్రయుఁ డగుచున్నాఁడు. మూలప్రకృతి యచేతనం బైనను జీవునికి సంసారబంధరహితమైన మోక్షముకొఱకు మూలప్రకృతికి కార్యపరిణామమును జెప్పుచున్నారు. ఇచ్చట నచేతనంబగు మూలప్రకృతికి

కార్యపరిణామం బెట్లన:—నచేతన మైనపాలు దూడయొక్క వృద్ధికొఱకగునటుల జీవునికిఁ గైవల్యార్థ మచేతన మైన ప్రకృతి ప్రవృత్తిని గలుగఁజేయును. ఈ విషయమున కాపిలమతము—'వత్సవివృద్ధినిమిత్తం క్షీరస్య యథా ప్రవృత్తిరజ్ఞస్య పురుషస్య విమోక్షార్థం ప్రవర్తతే తదవ్యక్తమ్.'

సూ. అత ఊర్ధ్వం ప్రకృతిపురుషయోస్సాధర్మ్యవైధర్మ్యే వ్యాఖ్యాస్యామః. తద్యథా.— 17

చతుర్వింశతి తత్త్వనిరూపణానంతరము మూలప్రకృతి జీవుఁడు వీరలయొక్క సాధర్మ్యము (సమానధర్మము) ను, వైధర్మ్యము (విరుద్ధధర్మము) ను వివరించెదము.

### ప్రకృతిపురుషులకు సాధర్మ్యము.

సూ. ఉభావప్యనాదీ ఉభావప్యనన్తౌ ఉభావప్యలిఙ్గౌ ఉభావపి నిత్యౌ ఉభావప్యపరౌ ఉభౌ చ సర్వగతావితి. 18

మూలప్రకృతి, పురుషుఁడు; వీ రిరువురు కారణము, నాశము, ఆకారము లేనివారును, నిత్యులు (భూతభవిష్యద్వర్తమానకాలములయం దుండువారలు) ను, వీరికంటె శ్రేష్ఠము మఱియొకటి లేనివారును, అంతట వ్యాపించి యుండువారలును నగుటచే ప్రకృతిపురుషు లిరువురికిని యనాదిత్వాదిధర్మములు సమానంబులు గావున సాధర్మ్యమనఁబడును.

### ప్రకృతికి వైధర్మ్యము.

సూ. ఏకా తు ప్రకృతిరచేతనా త్రిగుణా బీజధర్మిణీ ప్రసవధర్మిణ్యమధ్యస్థధర్మిణీ చేతి. 19

మూలప్రకృతి యేకసంఖ్యగలది (వీనికంటె వేఱొక టెట్టిది లేనిదీ) చైతన్యము లేనిది (జడత్వముగలది) సుఖము, దుఃఖము, మోహము అను మూఁడు గుణములు గలది. [ఇచ్చట విరుద్ధము లగునీమూఁడు గుణములకు సామ్యావస్థ గలుగదు గదా! యనిన:—విరుద్ధములగు వాతపిత్త శ్లేష్మము లొక్కచోఁ జేరి సన్నిపాతమును గలిగించు చందంబునఁ ద్రిగుణములకు సామ్యావస్థయొప్పును. మహదాదులకుఁ గారణంబగుటవలన బీజధర్మము గలది, మహదహంకారాది క్రమముగ చరాచరప్రపంచముగఁ బరిణమించి నందునఁ బ్రసవధర్మము గలది సుఖదుఃఖముల ననుభవించుచుండుటవలన నమధ్యస్థ ధర్మము గలది యగుటం జేసి పైఁ జెప్పినయేకత్వ చేతనత్వాదిధర్మములు పురుషులకు (జీవులకు) విరుద్ధధర్మంబులు కావున ప్రకృతికి వైధర్మ్యమనంబడును. ఈయర్థమునే "శ్లో. త్రిగుణమవివేకివిషయస్సామాన్యమచేతనం ప్రసవధర్మి, వ్యక్తం తథా ప్రధానం తద్విపరీతస్తథా చ పుమాన్." అను సాంఖ్యసిద్ధాంతవాక్యముఁ గూడ బోధించుచున్నది.]

## పురుషులకు వైధర్మ్యము.

సూ. బహుత్వన్తుపురుషాశ్చేతనావన్తో ఒగుణా అబీజధర్మిణోఽప్ర 20
సవధర్మిణో మధ్యస్థధర్మిణశ్చేతి.

పురుషులు అనఁగా "పురి లింగే శేతే ఇతి పురుషః" అనువ్యుత్పత్తిచే మహదాదులచే సృజియింపఁబడి యతిసూక్ష్మంబై యోగులకే దృశ్యం బగులింగశరీరమందు వసించుచుండు జీవులు. వారిలో నొకపురుషుఁడు మృతుఁ డగుచుండ మఱియొకఁడు మృతిఁ జెందక జీవించియుండుటవలనను, ఒకఁడు జనించుచుండఁగ నందఱు జనింపకుండుటవలనను, ఒకనికి నింద్రియవైకల్యము గలిగియుండఁగ నందఱకుఁ దద్వైకల్యము గలుగకుండుటవలనను అట్టిపురుషు లనేకసంఖ్యగలవారు; చైతన్యము గలవారు, గుణరహితులు, మహాప్రళయమునందు మహదాదులు బీజావస్థనుజెంది ప్రకృతియందు వసించుచుండునటుల పురుషునియందు వసింపకుండుటవలనను బీజధర్మరహితులు, సృష్ట్యాదియందు మూలప్రకృతిమహదాదిరూపముగఁ బరిణమించినటులఁ బరిణామమును జెందకుండుటవలనఁ బ్రసవధర్మములేనివారు, ప్రకృతికార్యములైన ప్రీత్యాదులు పురుషులకుఁ గలుగకుండుటవలన మధ్యస్థధర్మముకలవారు, దానంజేసి బహుత్వచేతనావత్త్వాదిధర్మములు మూలప్రకృతికి విరుద్ధధర్మంబులు కావున, పురుషులకు వైధర్మ్య మనఁబడును.

## మహదాదులకుఁ ద్రిగుణాత్మకత్వము.

సూ తత్ర కారణానురూపం కార్యమితి కృత్వా సర్వ ఏవైతే
విశేషాస్సత్వరజస్తమోమయా భవన్తి. తదఞ్జనత్వాత్తన్మయ
త్వాచ్చ తద్గుణా ఏవ పురుషా భవన్తీత్యేకే భాషన్తే. 21

కారణముయొక్క గుణములు కార్యమునందు నియమముగ సంభవించుననున్యాయమునుబట్టి కారణమైన తంతుగతనైల్యాదిరూపము కార్యమైనపటమునందుఁ బ్రత్యక్షముగ సంభవించియుండు నటుల మూలప్రకృతికార్యము లగుమహదాదులయందును మూలప్రకృతిధర్మము లగుసత్వరజస్తమోగుణములు సంబంధించి యుండును. మూలప్రకృతియందును దత్కార్యభూతములైన మహదాదులయందును బ్రతిబింబితుఁడై సంబంధించి యుండు నిరువదియైదవతత్త్వస్వరూపుఁ డగుపురుషునికి సత్వాదిగుణప్రకాశకత్వము, ప్రకృత్యాదులతో తాదాత్మ్యముఁ గలిగి యుండుటవలన ప్రకృతిగుణములైన సత్వాదిగుణములును, సత్వాదిగుణకార్యములైన సుఖదుఃఖమోహాదులును ఆపురుషునికిఁ గూడ గలవని కొందఱాచార్యులు వచించెదరు. అయినను స్వచ్ఛమైన స్ఫటికము జపాకుసుమసంబంధమువలన నెఱ్ఱగను, గాజుపాత్రలోనుండు స్వచ్ఛమైన దీపము గాజుసంబంధమువలన గాజురంగుగ బాహ్యదృష్టికిఁ గనబడు చందంబున నిర్వికారుఁడగు పురుషుఁడును మహదాదులయందుఁ బ్రతిబింబితుఁడై సత్వాదిగుణములఁ

ప్రకాశింపఁజేయుటవలన సత్త్వాదిగుణయుక్తుఁడుగఁ గనఁబడుచుండును. విచారింపఁగా సత్త్వాదిమయత్వము ఉదాసీనుఁ డగు పురుషునియందు లేకుండుట స్పష్టము. ఈయర్థమునే— శ్లో. 'గుణకర్తృత్వే చ తథా కర్తేవ భవత్యుదాసీనః' అను సాంఖ్యసిద్ధాంత వచనము కూడ బోధింపుచున్నది.

## జగత్కారణవిషయమైన వైద్యకమతము.

వైద్యకే తు:—

శ్లో. స్వభావమీశ్వరం కాలం యదృచ్ఛాం నియతం తథా,
పరిణామం చ మన్యన్తే ప్రకృతిం పృథుదర్శినః. 22

సర్వజగదుత్పత్తికి మూలప్రకృతియే కారణ మని యిదివఱకుఁ జెప్పంబడియె. ఐనను, సర్వజగదుత్పత్తికి స్వభావము, ఈశ్వరుఁడు, కాలము, యదృచ్ఛ, నియతి, పరిణామము, అనునాఱును ప్రత్యేకప్రత్యేకముగఁ గారణమని కొందఱిమతము. వానిలో స్వభావవాది—"సుకణ్టకానాం ప్రకరోతి తైక్ష్ణ్యం విచిత్రచిత్రం మృగపక్షిణాం వా, మాధుర్యమిక్షౌ కటుతా మరీచేస్స్వభావతస్సర్వమిదం ప్రవృత్తమ్. కేన శుక్లీకృతా హంసా మయూరాః కేన చిత్రితాః, స్వభావేనైవ జాయన్తే" అను వచనముల ప్రకారము ముండ్లయందు తీక్ష్ణత్వము, మృగములు, పక్షులు - వీనియందుఁ జిత్రవిచిత్రవర్ణములు, చెఱకునందుఁ దీపిదనము, మిఱియములయందుఁ గారము ఇవి మొదలగు ననేకధర్మములు, హంసలయందుఁ దెలుపువర్ణమును, నెమలియందుఁ జిత్రవర్ణమును, స్వభావసిద్ధంబగుటవలన సర్వజగదుత్పత్తికి స్వభావమే కారణమనియు, ఈశ్వరవాది—"ఈశ్వరస్సర్వమేవేదం సృజత్యవతి హంతి చ, ఈశ్వరప్రేరితో గచ్ఛేత్స్వర్గం నరకమేవ వా" అనువచనప్రకారము స్థావరజంగమాత్మక ప్రపంచసృష్ట్యాదికిని, జంతువులయొక్క పుణ్యపాపానురూపమైన స్వర్గనరకాదిప్రాప్తికిని ఈశ్వరుఁడే కారణమగుటవలన సర్వజగదుత్పత్తికి నీశ్వరుఁడే కారణమనియు, కాలవాది—"ప్రభవవిరతిమధ్యజ్ఞానవంధ్యా నితాంతం విదితపరమతత్త్వా యత్ర తే యోగినోఽపి, తమహమిహ నిమిత్తం విశ్వజన్మాత్యయానామనుమితమిహ వన్దే భగ్రహైః కాలమీశమ్" అను జ్యోతిశ్శాస్త్ర వచనప్రకారము పరమతత్త్వవేత్త లగుయోగులు కూడ నీశ్వరస్వరూపమైన యేకాలముయొక్క ఆదిమధ్యాంతముల నెఱుఁగ నశక్తులుగ నుండెదరో, ప్రపంచముయొక్క సృష్టిస్థితిసంహారముల కేది నిమిత్తకారణంబై యుండెడినో, అశ్విన్యాదినక్షత్రములు, సూర్యాదిగ్రహచారాదులు - వీనివలన నేది యూహింపఁబడుచుండెడినో, అట్టి యీశ్వరస్వరూపమైన కాలమునకు నమస్కరించెదమని జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెప్పియుండుటవలన సర్వజగదుత్పత్తికి కాలమే కారణమనియు, యదృచ్ఛావాది—తృణములు, అరణి - అనువానియందగ్ని జనించి వానినే కాల్చుచుండునటుల యేవస్తువు జనించుస్థలమునందే దానికి కారణముండుటవలన సర్వజగదుత్పత్తికి యదృచ్ఛయే కారణమనియు, నియతవాది—జన్మాంతరార్జితపుణ్యపాపములే సర్వజగదుత్పత్తికిఁ గారణమగుట

వలన నియతియే కారణమనియు, పరిణామవాది—మూలప్రకృతియే మహదహంకారాది రూపముగాఁ బరిణమించుటవలన సర్వజగదుత్పత్తికిఁ బరిణామమే కారణమనియు, నీ ప్రకారము భిన్నభిన్నంబులుగ వచింపుచుండెదరు. వైద్యకశాస్త్రమునందు—"అంగప్రత్యంగనిర్వృతిస్స్వభావాదేవ జాయతే, సన్నివేశశ్శరీరాణాం దంతానాం పతనోద్గమౌ, తలేష్వసంభవో యశ్చ రోమ్ణామేతత్స్వభావతః, ధాతుషు క్షీయమాణేషు వర్ధతే ద్వావిమౌ తథా, స్వభావం ప్రకృతిం కృత్వా నఖకేశావితి స్థితిః. నిద్రాహేతుస్తమస్సత్త్వం బోధనే హేతురుచ్యతే, స్వభావ ఏవ వా హేతుర్గరీయాన్పరికీర్తితః, స్వభావాల్లావకాముద్గాస్తథాలావకపింజలాః, స్వభావాద్గురవో మాషా వరాహమహిషాదయః"అను వచనముల ప్రకారము అంగప్రత్యంగములయొక్క ఆవిర్భావము, సర్వశరీరావయవముల యొక్క రచన, దంతములూడుట, మరల దంతములు జనించుట, అరచేతులు, అరకాళ్లు వీనియందు వెండ్రుకలు మొలవకుండుట, ధాతువులు క్షీణించుచుండ గోళ్లు, వెండ్రుకలు నెల్లప్పుడు పెరుగుచుండుట, ఇవియన్నియు స్వాభావికం బగుటవలనను, నిద్రకుఁ దమోగుణము, జాగ్రదవస్థకు సత్త్వగుణము, ఈరెండవస్థలకు స్వభావము కారణమగుటవలనను, పెసలు, లావుకపిట్ట, తిత్తిరిపక్షి అనువానియందు లఘుత్వము, మినుములు, పంది, దున్నపోతు మొదలగువానియందు గురుగుణము, గలిగియుండుటకు స్వభావము కారణం బగుటవలనను, సర్వజగదుత్పత్తికి స్వభావమును, "జాఠరో భగవానగ్నిరీశ్వరోఽన్నస్య పాచకః, సౌక్ష్మ్యాద్రసానాదదానో వివేక్తుం నైవ శక్యతే, అగ్నిమూలం బలం పుంసాం బలమూలం చ జీవితమ్" అనువచనముల ప్రకారము స్వాతంత్ర్యషడ్గుణైశ్వర్యసంపన్నుఁ డగు నీశ్వరుఁడే జాఠరాగ్నిస్వరూపుఁ డై యదృశ్యుఁడై భుజింపఁబడిన యన్నమును పచనముఁ జేసి రసమును గ్రహింపుచుండును. కావున నట్టి యీశ్వరస్వరూపుఁ డగు నగ్నియే శరీరబలమునకు,బలమూలకమైనజీవితమునకుఁ గారణము. అటులగుటచే సర్వజగదుత్పత్తికి నీశ్వరుఁడును "మహాభూతవిశేషాంస్తు శీతోష్ణద్వయభేదతః, కాల ఇత్యధ్యవస్యన్తి న్యాయమార్గానుసారిణః" అనువచన ప్రకారము ఆకాశాదిమహాభూతములు, వానివిశేషములు, శీతోష్ణభేదములుగ నుండుటవలన, కాలమే వాతాదిదోషసంచయప్రకోపోపశమనములకు కారణమగుటవలన, సర్వజగదుత్పత్తికి కాలమును; "యదృచ్ఛయోపగతాని పాకం పాకక్రమేణోపచరేద్విధిజ్ఞః"అనువచన ప్రకారము సర్వపదార్థంబు లదృశ్యంబులై యాకస్మికముగ నావిర్భవించుటవలనను, ఆకస్మికముగ పాకమును జెందుచుండు సర్వపదార్థముల శాస్త్రజ్ఞుఁడు క్రమముగ నెఱుంగవలయునని చెప్పియుండుట వలనను సర్వజగదుత్పత్తికి యదృచ్ఛయును, "బ్రహ్మస్త్రీసజ్జనవధపరస్వహరణాదిభిః, కర్మభిః పాపరోగస్య ప్రాహుః కుష్ఠస్య సంభవమ్" అను వచన ప్రకారము బ్రాహ్మణస్త్రీగమనము, సజ్జనవధ, పరద్రవ్యాపహరణము, మొదలగు పాపకర్మములవలన కుష్ఠరోగము మొదలగు వ్యాధులు జనించుటచే సర్వజగదుత్పత్తికి నియతియును, "జాఠరాగ్నేస్తు సంయోగాద్యదుదేతి రసాంతరమ్, రసానాం పరిణామాంతే సవిపాక ఇతి స్మృతః" అను వచన ప్రకారము జాఠరాగ్నిసంయోగమువలన బాగుగ పరిణామ

మును జెందిన మధురాదిషడ్రసయుక్త మగునన్నాదులసారాంశమే విపాకమని చెప్పంబడియుండుటవలనను, హేమంతఋతువునందు నోషధులు, ఉదకము అనునవి కాలపరిణామమువలన సంపూర్ణవీర్యముగలవిగ నగుటవలనను, బాలురకు వయఃపరిణామముచే శుక్రము జనించుటవలనను, సర్వజగదుత్పత్తికిఁ బరిణామమును; ఈ యాఱును సముచ్చయముగాఁ బ్రపంచోత్పత్తికిఁ గారణమని పెద్దలు వచించియున్నారు. అయినను, యథార్థముగఁ దత్త్వవిచారముం జేసినఁ బూర్వోక్తస్వభావము సత్వరజస్తమోగుణ తద్వికార పృథివ్యాది పంచమహాభూతవిశేషంబగుటవలనను, కాలము—శ్లో. "మహాభూతవిశేషాంస్తు శీతోష్ణద్వయభేదతః, కాల ఇత్యభ్యవస్యన్తి న్యాయమార్గానుసారిణః." అను వచనప్రకారము సూర్యచంద్రాదిగ్రహగతివలనఁ బరిచ్ఛిన్నమై శీతోష్ణరూపమహాభూతవిశేషంబగుటవలనను, రజోగుణపరిణామరూపమైన క్రియాస్వరూపంబగుటవలనను, నియతి—జన్మాంతరకృతశుభాశుభకర్మస్వరూపం బై రజోగుణపరిణామం బగుటవలనను, యదృచ్ఛ—ఆకాశాదిభూతములయొక్క పరిణామవిశేషంబగుటవలనను, స్వభావము, కాలము, నియతి, యదృచ్ఛ అనునవి మూలప్రకృతికంటె భిన్నములుకావు. ఇరువదియైదవ తత్వస్వరూపుఁడగు పురుషుఁడె యీశ్వరుఁడు. వాఁడు ప్రకృతికి క్షోభకరుఁడు. అట్లగుటవలన సర్వజగత్తుకు వాఁడే కారణమనియెదరు. కాని, తత్త్వవిచారముం జేసిన వాఁడు సర్వజగదుత్పత్తికి కారణముకాదు. కనుక సర్వప్రపంచము ప్రకృతిపరిణామాత్మక మగుటవలనఁ బ్రకృతిపరిణామ ముపాదానకారణ మనియు అన్యోన్యముగ కలసి జగదుత్పత్తికిఁ గారణమైన స్వభావాదులు నిమిత్తకారణ మనియు స్పష్టమగుచున్నది.

### పంచమహాభూతస్వరూపము.

శ్లో. తన్మయాన్యేన భూతాని తద్గుణాన్యేవ చాదిశేత్. 23

ఆకాశాది పంచమహాభూతములు * తన్మయంబుగ, మూలప్రకృతిపరిణామముయొక్క సత్త్వాదిగుణములుగలవిగ నుండును. (పైసూత్రమునకు "తతో జాతాని భూతాని తద్గుణాన్యేవ చాదిశేత్" అనియు పాఠాంతరము కలదు. ఆ పాఠాంతరమునుబట్టి యాకాశాది పంచమహాభూతములు ప్రకృతిపరిణామోపాదానకారణమువలనను స్వభావాది నిమిత్తకారణమువలనను జనించినందునఁ గారణమైన ప్రకృతిగుణములు గలవిగ నుండునని కొందఱు వ్యాఖ్యానముఁ జేయుచున్నారు.)

### చికిత్సోపయోగవిచారము.

శ్లో. తైశ్చ తల్లక్షణైః కృత్స్నో భూతగ్రామో వ్యజన్యత,
తస్యోపయోగోఽభిహితశ్చికిత్సాం ప్రతి సర్వదా. 24
భూతేభ్యో హి పరం యస్మాన్నాస్తి చిన్తా చికిత్సితే,

---

* తన్మయమనఁగా—అవకాశము, ఘనత్వము, ఉష్ణత్వము, ద్రవత్వము, మొదలగు స్వభావాదిధర్మవిశేషములతోఁ గూడి యుండు ప్రకృతిపరిణామ మని యర్థము.

సూ. యతోఽభిహితం తత్సమ్భవద్రవ్యసమూహో భూతాదిరుక్తః. 25

ప్రకృతిపరిణామరూపమైన యా యాకాశాది పంచమహాభూతంబులే పృథివ్యాది గుణములైన స్థిరత్వకఠినత్వగురుత్వాదిధర్మయుక్తముగ మనుష్య, పక్షి, తరు, గుల్మ, క్రిమి, దంశాదిస్వరూపమైన చతుర్విధస్థావరజంగమాత్మకప్రపంచస్వరూపముగ నుండునట్టి భూతగ్రామముగఁ బరిణమించె. అట్టి భూతగ్రామమునకంటె నధికమగు విచారము చికిత్సావిషయంబున లేమింజేసి యా భూతగ్రామమే సర్వకాలమునందుఁ జికిత్సోపయోగంబుగాఁ జెప్పంబడియె. "అస్మిన్ శాస్త్రే పంచమహాభూత శారీరసమవాయః పురుష ఇత్యుచ్యతే, తస్మిన్ క్రియా సోఽధిష్ఠానం చతుర్విధో భూతగ్రామ స్స్వేదజాణ్డజోద్భిజ్జజరాయుజసఞ్జ్ఞః తత్ర పురుషః ప్రధానం తస్యోపకరణమన్యదితి" పంచమహాభూతసంబంధమగు శుక్రశోణితసంయోగవిశేషమే పురుషుఁడనఁబడియె. అట్టి పురుషునియందే చికిత్సను జేయవలయు. ఆ పురుషుఁడె చికిత్సాస్థానంబుగ నుండును. పైఁజెప్పిన ప్రకారము భూతగ్రామము స్వేదజ, అండజ, ఉద్భిజ్జ, జరాయుజము లన నాలుగువిధంబులు. వానిలో పురుషుఁడు ప్రకృతియే సాధనముగఁ గలశరీరము గలవాఁడగుటవలన ముఖ్యముగఁ జికిత్సార్హుఁ డగుచున్నాఁడు. వానికంటె నితరములగునవి యన్నియు వానికి సామగ్రిస్థానంబుగ నగుచున్నవి. అని సుశ్రుతసూత్రస్థానముయొక్క ప్రథమాధ్యాయమునందుఁ జెప్పఁబడియుండుటవలన శుక్రశోణితసంయోగమువలన పంచభూతములే ప్రధానంబులుగ నై జనించిన స్థూలశరీరమును తదంగప్రత్యంగములును, చర్మము, మాంసము, సిరలు, స్నాయువులు మొదలగునవియును జికిత్సార్హంబు లని కరతలామలకంబగుచున్నయది.

## ఇంద్రియార్థనిరూపణము.

సూ. భౌతికాని చేన్ద్రియాణ్యాయుర్వేదే వర్ణ్యన్తే తథేన్ద్రియార్థాః.

శ్రోత్రము, త్వక్కు, చక్షుస్సు, జిహ్వ, ఘ్రాణము, అను నీయైదింద్రియములును, ఇంద్రియార్థములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములును, * భౌతికములని యాయుర్వేదమునందుఁ జెప్పంబడియె. శ్లో. ("శ్రోత్రేణ స్పర్శనే వాయుర్దర్శనే తేజ ఉత్కటం, సలిలం రసనే భూమిః ఘ్రాణే తద్జ్ఞైర్నిరూపితా. శబ్దో వైహాయసస్పర్శో వాయవీయః ప్రకీర్తితః, రూపమాగ్నేయమాప్యస్తు రసో గంధస్తు పార్థివః."అను వచనముల ప్రకారము పూర్వోక్తశ్రోత్రాదిపంచేంద్రియములు పంచభూతాత్మకంబులైనను శ్రోత్రమునం దాకాశభాగము, త్వగింద్రియమునందు వాయుభాగము, చక్షురింద్రియమునందుఁ దేజోభాగము. రసనేంద్రియమునం దుదకభాగము, ఘ్రాణేంద్రియమునందుఁ బృథివీభాగము, అధికముగనుండుటవలన శబ్దము ఆకాశసంబంధము, స్పర్శము వాయుసంబంధము, రూపము తేజస్సంబంధము, రసము ఉదకసంబంధము, గంధము

* భౌతికము లనఁగా—పృథివ్యాది పంచభూతసంబంధముగలవి యనుట.

పృథివీసంబంధము, గలదియని ఆయుర్వేదవేత్తలు వచించియున్నారు). ఈవిషయమునం దనువాదకవచనము.—

## ఇంద్రియములకు స్వస్వవిషయగ్రాహకత్వము.

భవతి చాత్ర:—

శ్లో. ఇన్ద్రియేణేన్ద్రియార్థం తు స్వం స్వం గృహ్ణాతి మానవః,
నియతం తుల్యయోనిత్వాన్నాన్యేనాన్యమితి స్థితిః. 27

జలము జలప్రాంతమును జెందునటుల భూతములు తమతమయోనిప్రాంతములఁ జెందుటవలన మానవుఁడు శ్రోత్రాదీంద్రియములచేఁ దమతమశబ్దాదివిషయముల నియతముగ (చక్షుస్సు తేజోధిక్యము గలదగుటచేఁ దేజస్సంబంధమగురూపమును, శ్రోత్రమాకాశాధిక్యముగలదగుటచే నాకాశసంబంధమగు శబ్దమును, త్వగింద్రియము వాతాధిక్యము గలదగుటచే వాయుసంబంధమగుస్పర్శమును, రసము ఉదకాధిక్యము గలదియగుటచే నుదకసంబంధమగు రసమును, ఘ్రాణము పృథివ్యాధిక్యము గలదగుటచేఁ బృథివీసంబంధమగు గంధమును) గ్రహించుచుండును. కావున, నపుడాయాయింద్రియములవలన నాయాయింద్రియవిషయములనే గ్రహించుచుండును; కాని ఒకయింద్రియమువలన మఱియొక యింద్రియవిషయమును గ్రహింప నసమర్థుఁడగును.

## క్షేత్రజ్ఞవిషయకాయుర్వేదమతము.

సూ. న చాయుర్వేదశాస్త్రేషూపదిశ్యన్తే సర్వగతాః క్షేత్రజ్ఞా నిత్యాశ్చ. అసర్వగతేషు చ క్షేత్రజ్ఞేషు నిత్యపురుషఖ్యాపకాన్హేతూనుదాహరన్తి. ఆయుర్వేదశాస్త్రేష్వసర్వగతాః క్షేత్రజ్ఞా నిత్యాశ్చ. 28

క్షేత్రజ్ఞుఁడు సర్వగతుఁడని యితరము లైనసాంఖ్యాదిశాస్త్రములయం దంగీకరింపఁబడి యుండునటుల నాయుర్వేదమునం దంగీకరింపఁబడియుండలేదు. అయినను క్షేత్రజ్ఞుఁడు అసర్వగతుఁడగుటవలన వానియందు అనిత్యత్వము ప్రాప్తించుచున్నయది. అయినప్పటికిని నేను సుఖవంతుఁడు, నేను దుఃఖవంతుఁడు అను సుఖదుఃఖాదిలింగజ్ఞానమువలన జీవుఁడు భూతభవిష్యద్వర్తమానకాలములయం దుండునట్టివాఁడని యసర్వగతుఁడగుక్షేత్రజ్ఞునియందు నిత్యత్వమును దెలియఁజేయు సత్కారణత్వాదిహేతువుల నాయుర్వేదవేత్త లుదహరించి క్షేత్రజ్ఞుఁడు అసర్వగతుఁడు, నిత్యుఁడు అని కూడ నిరూపించియున్నారు. మఱియును "శుభాశుభాభ్యాం కర్మభ్యాం ప్రేరణాన్మనసో గతేః, దేహాద్దేహాన్తరం యాతి కృమివచ్ఛాశ్వతోఽవ్యయః. నిత్య ఇత్యుచ్యతే సద్భిస్సన్నకారణవాన్యతః" అను వచనములప్రకారము జలగ మఱియొక తృణమును బట్టుకొని ముందు పట్టుకొనియుండిన తృణమును విడుచునటుల శుభాశుభకర్మప్రేరితమై మనోగతివలన క్షేత్రజ్ఞులు ఒకదేహమును బట్టుకొని పూర్వదేహమును విడుచుచుందెదరు. కావున,

వాయుర్వేదశాస్త్రమునందు క్షేత్రజ్ఞులు అసర్వగతులనియు, నిత్యులనియుఁ జెప్పంబడెను. (ఇటులనే క్షేత్రజ్ఞులు శాశ్వతులు, నాశములేనివారలు, కారణరహితులు, త్రికాలములయందుండునట్టివారలు, అని భోజుఁడు కూడ వచించియున్నాఁడు.)

### జీవులకు మనుష్యాదిజన్మకారణము.

సూ. తిర్యగ్యోనిమానుషదేవేషు సఞ్చరన్తి ధర్మాధర్మనిమిత్తమ్. 29

జీవులు పాపవిశేషమువలనఁ బశుపక్ష్యాదితిర్యగ్యోనులయందును, పుణ్యపాపసమత్వమువలన మానవులయందును, పుణ్యాధిక్యమువలన దేవతలయందును జన్మమును జెందుచుండెదరు.

### క్షేత్రజ్ఞనిరూపణము.

సూ. త ఏతేఽనుమానగ్రాహ్యాః పరమసూక్ష్మాశ్చేతనావన్తశ్శాశ్వతా లోహితరేతసోస్సన్నిపాతేష్వభివ్యజ్యన్తే, యతోఽభిహితం పఞ్చమహాభూతశరీరసమవాయః పురుష ఇతి, స ఏవ కర్మపురుషశ్చికిత్సాధికృతః. 30

క్షేత్రజ్ఞుల ననుమానప్రమాణమువలనఁ దెలియందగు. ఎటులన:—అవ్యభిచరితమైన ధూమముచే నగ్నిని నిశ్చయించుచందంబున నవ్యభిచరితమైన సుఖదుఃఖాదిలింగముచే క్షేత్రజ్ఞుల నిశ్చయింపవలయుఁ. మఱియు, క్షేత్రజ్ఞులు, పరమాణువువలె నతిసూక్ష్ములు, చేతనావంతులు, నిత్యులు. అట్లగుటచే నతిసూక్ష్మమగు త్రసరేణువు స్థలాంతరమునం దగుపడక జాలాంతరమునం దగుపడుచందంబునఁ బంచమహాభూతాత్మకశరీరసమవాయరూపము లైన క్షేత్రజ్ఞులు పంచభూతాత్మకమైన శుక్రశోణితసంయోగమునందు కనుబడుచున్నారు. (ఈక్షేత్రజ్ఞులే సూక్ష్మరూపములైన పంచమహాభూతముల యొక్క సంయోగస్వరూపులగు షడ్ధాతుకపురుషులని వైద్యకశాస్త్రమునందుఁ జెప్పంబడియున్నది.) అట్టిక్షేత్రజ్ఞులే కర్మఫలభోక్త లగుటవలనఁ జికిత్సార్హు లగుచున్నారు.

### క్షేత్రజ్ఞగుణనిరూపణము.

సూ. తస్య సుఖదుఃఖే ఇచ్ఛాద్వేషౌ ప్రయత్నః ప్రాణాపానావున్మేషనిమేషౌ బుద్ధిర్మనస్సఙ్కల్పో విచారణా స్మృతిర్విజ్ఞానమధ్యవసాయో విషయోపలబ్ధిశ్చ గుణాః. 31

ఆక్షేత్రజ్ఞునికి సుఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము (కార్యారంభకోత్సాహము), ప్రాణము, అపానము, ఉన్మేషనిమేషములు, బుద్ధి, మనస్సు, సంకల్పము, విచారణ (ఊహాపోహ), స్మృతి (అనుభవింపఁబడిన పదార్థజ్ఞానము, విజ్ఞానము,) (శిల్పశాస్త్రజ్ఞానము) అధ్యవసాయము, (శాస్త్రాదిజ్ఞానము), విషయోపలబ్ధి (శబ్దాదివిషయజ్ఞానము) అను పదియేడుగుణంబులుఁ గలవు. వీనిని కలలని కూడ వచించెదరు.

### సాత్త్వికగుణములు.

సూ. సాత్త్వికాస్తు.—ఆనృశంస్యం సంవిభాగరుచితా తితిక్షా సత్యం ధర్మ ఆస్తిక్యం జ్ఞానం బుద్ధిర్మేధా స్మృతిర్ధృతిరనభిషఙ్గశ్చ. 32

ఆనృశంస్యము (క్రూరకర్మయందుఁ బ్రవర్తింపకుండుట), సంవిభాగరుచిత (అన్నవిభాగభోజనేచ్ఛ), తితిక్ష (ఓర్పు), సత్యము (భూతహితకృత్యము), ధర్మము (మనోవాక్కాయములచే సత్కార్యములఁ జేయుట), ఆస్తిక్యము (పరలోకమోక్షాదులయందు విశ్వాసము), జ్ఞానము (ఆత్మజ్ఞానము), బుద్ధి(గ్రంథాకర్షణశక్తి), మేధ (ధారణశక్తి), స్మృతి, ధృతి (ధైర్యము), అనభిషంగము (ప్రయోజనము నపేక్షింపకుండుట), అను పండ్రెండును సాత్త్వికగుణంబులు. ఇవి సత్త్వగుణములతోఁ గూడియుండు మనోమూలముగ క్షేత్రజ్ఞునియందు సంబంధించి యుండును.

### రాజసగుణములు.

సూ. రాజసాస్తు.—దుఃఖబహుళతాఽటనశీలతాఽధృతిరహఙ్కార ఆనృతికత్వమకారుణ్యం దమ్భో మానోఽహర్షః కామః క్రోధశ్చ. 33

దుఃఖబాహుళ్యము (దుఃఖాధిక్యము), అటనశీలత్వము (సంచరించునట్టి స్వభావము), అధృతి (ధైర్యములేకుండుట), అహంకారము, ఆనృతికత్వము (అబద్ధమాడు స్వభావము), అకారుణ్యము (నిర్దయ), డంభము (కపటవృత్తి), మానము (తనయందుత్కర్షబుద్ధి), అహర్షము (సంతోషము లేకుండుట), కామము, క్రోధము, అనుపదునొకండును రాజసగుణంబులు. ఇవి రజోగుణయుక్తమైన మనోమూలముగ క్షేత్రజ్ఞునియందు సంబంధించి యుండును.

### తామసగుణములు.

సూ. తామసాస్తు.—విషాదిత్వం నాస్తిక్యమధర్మశీలతా బుద్ధేర్నిరోధో ఽజ్ఞానం దుర్మేధస్త్వమకర్మశీలతా నిద్రాళుత్వం చేతి. 34

విషాదిత్వము (సదాదుఃఖించుట), నాస్తిక్యము (ధర్మమోక్షాదులయందు అప్రామాణ్యబుద్ధి), అధర్మశీలత్వము (ఎల్లప్పుడు, నధర్మబుద్ధి), బుద్ధినిరోధము (బుద్ధిమాంద్యము), అజ్ఞానము (ఆత్మజ్ఞానము లేకుండుట), దుర్మేధస్త్వము (దుర్బుద్ధి), అకర్మశీలత్వము (కర్మానుష్ఠానమునందిచ్ఛలేకుండుట), నిద్రాళుత్వము (ఎల్లప్పుడు నిద్రించుట), అను నెనిమిదియు తామసగుణములు. ఇవి తమోగుణయుక్తమైన మనోమూలముగ క్షేత్రజ్ఞునియందు సంబంధించి యుండును.

### ఆకాశగుణములు.

సూ. ఆన్తరిక్షాస్తు.—శబ్దశ్శబ్దేన్ద్రియం సర్వచ్ఛిద్రసమూహో వివిక్తతా చ. 35

శబ్దము, శ్రోత్రేంద్రియము, సర్వచ్ఛిద్రసమూహము, వివిక్తత (సర్వశరీరసంబంధముగల సిర, స్నాయువు, అస్థి, పేశి, మొదలగువానిని విభాగించుట) అనునవి యాకాశగుణంబులు.

## వాయుగుణములు.

సూ. వాయవ్యాస్తు.— స్పర్శస్స్పర్శేన్ద్రియం సర్వచేష్టాసమూహః సర్వశరీరస్పన్దనం లఘుతా చ. 36

స్పర్శము, త్వగింద్రియము, సర్వచేష్టాసమూహము, సర్వశరీరచలనము, లఘుత్వము అనునవి వాయుగుణంబులు.

## తేజోగుణములు.

సూ. తైజసాస్తు.—రూపం రూపేన్ద్రియం వర్ణస్సన్తాపో భ్రాజిష్ణుతా పక్తిరమర్షస్తైక్ష్ణ్యం శౌర్యం చ. 37

రూపము, చక్షురింద్రియము, శుక్లాదివర్ణము, తాపము, ప్రకాశము, పాకోత్పాదనసమర్థత, కోపము, తీక్ష్ణత్వము (స్వకర్మలయందు త్వర) శౌర్యము అనునవి తేజోగుణంబులు.

## ఉదకగుణములు.

సూ. ఆప్యాస్తు.—రసో రసనేన్ద్రియం సర్వద్రవసమూహో గురుతా శైత్యం స్నేహో రేతశ్చ. 38

రసము, రసనేంద్రియము, సర్వద్రవసమూహము, గురుత్వము, శైత్యము, స్నేహము, (జిడ్డు) రేతస్సు, అనునవి యుదకగుణంబులు.

## పృథ్వీగుణములు.

సూ. పార్థివాస్తు.— గన్ధో గన్ధేన్ద్రియం సర్వమూర్తిసమూహో గురుతా చేతి. 39

గంధము, ఘ్రాణేంద్రియము, సర్వమూర్తిసమూహము, గురుత్వము, అనునవి పృథివీగుణంబులు.

## పంచమహాభూతస్వరూపము.

సూ. తత్ర సత్త్వబహుళమాకాశమ్, రజోబహుళో వాయుః, సత్త్వరజోబహుళోఽగ్నిః, సత్త్వతమోబహుళా ఆపః, తమోబహుళా పృథివీతి. 40

ఈపంచమహాభూతములయందు ఆకాశము సత్త్వగుణాధిక్యముకలది; అట్లగుటచే నది సర్వపదార్థములఁ బ్రకాశింపఁ జేయుచుండును. వాయువు రజోగుణాధిక్యముకలది గాన నది చంచలస్వభావము కలదైయుండును. అగ్ని సత్త్వరజోగుణాధిక్యముగలది గాన

ప్రకాశకత్వము, చాంచల్యము గలదై యుండును. ఉదకము సత్త్వతమోగుణాధిక్యము గలదిగాన నది నైర్మల్యము, ప్రకాశత్వము, గురుత్వము గలదై యుండును. పృథివి తమోగుణాధిక్యముకలదిగాన నది సర్వపదార్థములను మఱుగుచేయుచుండును.

## పంచమహాభూతపరస్పరానుప్రవేశము.

శ్లోకౌ చాత్ర భవతః.—

శ్లో. అన్యోన్యానుప్రవిష్టాని సర్వాణ్యేతాని నిర్దిశేత్,
స్వేస్వే ద్రవ్యే తు సర్వేషాం వ్యక్తం లక్షణమిష్యతే. 41

శబ్దము, స్పర్శము, అనునీరెండుగుణములు వాయువునందుండుటవలన శబ్దగుణము గలయాకాశము స్వకార్యమైనవాయువునందును; శబ్దము, స్పర్శము, రూపము, అను నీ మూఁడుగుణములు తేజస్సునందుండుటవలన శబ్దగుణము గలయాకాశము, స్పర్శగుణము గలవాయువు, అను నీరెండుభూతములు తేజస్సునందును; శబ్దము, స్పర్శము, రూపము, రసము, అనునీనాలుగుగుణములు నుదకమునం దుండుటవలన శబ్దగుణము గలయాకాశము, స్పర్శగుణము గలవాయువు, రూపగుణము గలతేజస్సు, అను నీ మూఁడుభూతములు ఉదకమునందును; శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, అను నీయైదు గుణములు పృథివియందుండుటవలన శబ్దగుణము గలయాకాశము, స్పర్శగుణముగల వాయావు, రూపగుణము గలతేజస్సు, రసగుణము గలయుదకము, అను నీనాలుగుభూతములు పృథివియందును; మిళితంబులుగనున్నవని పెద్దలు వచించియున్నారు. కావున నాకాశము, వాయువు, తేజస్సు, ఉదకము, పృథివి, అను నీపంచమహాభూతములు పరస్పరానుప్రవిష్టములై యున్నవని తెలియుచున్నది. అయినను వాయువు సూక్ష్మరూపియై యుదకము, తేజస్సు అనువానితోఁ గలసి ఆకాశమునందు సంచరించుచుండుటవలన వాయువు, తేజస్సు, ఉదకము, అను నీమూఁడుభూతములు ఆకాశమునందంతర్గతములై యున్నవనియు "అనుష్ణాశీతస్పర్శోఽయం ద్రవ్యజ్ఞైర్వాయురిష్యతే, దాహకృత్తేజసా యుక్తః శీతకృత్సోమసంశ్రయాత్" అను వచనప్రకారము వాయువు అనుష్ణాశీతస్పర్శ గుణము గలవాఁడు, తేజస్సుతోఁ గూడి తాపమునిచ్చుచుండువాఁడు, ఉదకముతోఁ గూడి శైత్యమునిచ్చుచుండువాఁడు, అని నైయాయికులు చెప్పియుండుటవలన తేజస్సు, ఉదకము, అను నీ రెండుభూతములు వాయువునందంతర్గతములై యున్నవనియు, వాయువు తేజస్సుకు ప్రేరకుఁడగుటచే తేజస్సునందంతర్గతుఁడై యున్నాఁడనియు, వాయువు తరంగబుద్బుదములకు కారణమగుటవలన వాయువు నుదకమునందంతర్గతుఁడై యున్నాఁడనియు; ఉదకమున కగ్ని కారణమగుటవలన నుదకమునం దగ్ని యంతర్గతుఁడై యున్నాఁడనియు, పృథివి ధూమరూపమై యగ్నియం దంతర్గతయై యున్నదనియు;

ఆకాశము సర్వవ్యాపకమగుటంజేసి వాయువు, తేజస్సు, ఉదకము, అను నీమూఁడు భూతములయందు నాకాశమంతర్గతమై యున్నదనియు; ఆకాశము, వాయువు, ఉదకము, అను నీమూఁడు భూతములయందు పృథ్వి యణురూపముచే సంతర్గతమై యున్నదనియు; పృథ్వి స్వగుణభూయిష్ఠము, అంబుగుణభూయిష్ఠము, తేజోగుణభూయిష్ఠము, వాయుగుణభూయిష్ఠము, ఆకాశగుణభూయిష్ఠము, అని యైదువిధములుగ భూమి ప్రవిభాగాధ్యాయమునందుఁ జెప్పఁబడియుండుటవలన పృథ్వియందాకాశాదిపంచమహాభూతము లంతర్గతములై యున్నవనియు, మఱికొందఱాచార్యులు వచించుచు పంచమహాభూతములకుఁ బరస్పరానుప్రవిష్టత్వము నీప్రకారము తెలియఁజేయుచున్నారు. మఱియు, నాకాశాదిపంచమహాభూతలక్షణములైనశబ్దాదు లాయాభూతసంబంధములైనద్రవ్యములయందు స్పష్టముగఁ గానఁబడును.

అధ్యాయోపసంహారము.

శ్లో. అష్టౌ ప్రకృతయః ప్రోక్తా వికారాష్షోడశైవ తు,
క్షేత్రజ్ఞశ్చ సమాసేన స్వతన్త్రపరతన్త్రయోః. 42

ఇతి శ్రీసుశ్రుతాచార్యవిరచితే ఆయుర్వేదశాస్త్రే సుశ్రుతే
తృతీయే శారీరస్థానే ప్రథమోఽధ్యాయః.

శల్యసాంఖ్యతంత్రములయందుఁ జెప్పియుండు పంచవింశతితత్త్వములైన అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, అను నెనిమిది ప్రకృతులు, శ్రోత్రము, చర్మము, చక్షుస్సు, జిహ్వ, ఘ్రాణము, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ, మనస్సు, పృథివ్యాది పంచభూతములు, అను పదునాఱువికారములు, స్థూలసూక్ష్మశరీరముఁ దెలిసికొనునట్టిక్షేత్రజ్ఞుఁడు, అనునవి యిచ్చట సంక్షేపముగఁ జెప్పఁబడియె.

# ద్వితీయాధ్యాయము.

సూ. అథాతశ్శుక్రశోణితశుద్ధి నామ శారీరం వ్యాఖ్యాస్యామః. 1

ప్రథమాధ్యాయమున శుద్ధమగుశుక్రశోణితములయొక్క సంయోగముచేతనే జీవులు వ్యక్తులగుచున్నారని చెప్పినందున పంచవింశతితత్త్వనిరూపణానంతరము అవిశుద్ధమగు శుక్రశోణితములు సంతానోత్పత్తికి కారణంబగుట లేదు గాన వానికి ప్రతిక్రియఁ జేసికొనుటకు శుక్రశోణితశుద్ధి యను పేరుగల యీ యధ్యాయమును వివరించెదము.

## ప్రజోత్పాదనాసమర్థశుక్రలక్షణము.

సూ. వాతపిత్తశ్లేష్మకుణపగ్రన్థిపూతిపూయక్షీణమూత్రపురీషరేతసః ప్రజోత్పాదనే న సమర్థా భవన్తి. 2

మొదట వికృతివిశేషమును దెలిసికొనక రోగిని ఆరోగ్యవంతునిఁ జేయుటకు వైద్యశాస్త్రమునకైనను సామర్థ్యము కలుగదు. ఏలనన 'రోగమాదౌ పరీక్షేత' అని యున్నందున మొదట వ్యాధిని కనుఁగొనుట ముఖ్యావశ్యకము గనుక ముందుగ వాతాది దుష్టశుక్రములఁ జెప్పెను. వాతపిత్తశ్లేష్మములచే దుష్టమైన శవగంధముగలది, గ్రంథులతోఁ గూడినది, దుర్గంధముతోఁ గూడి చీముపలె నుండునది, క్షీణమైనది, మూత్రపురీషములగంధము గలదియు నగు శుక్రముగలపురుషులు సంతానమును గలిగించుట యందు సమర్థులు కానేరరు.

## వాతాదిదుష్టశుక్రలక్షణము.

సూ. తేషు వాతవర్ణవేదనం వాతేన, పిత్తవర్ణవేదనం పిత్తేన, శ్లేష్మవర్ణవేదనం శ్లేష్మణా, శోణితవర్ణవేదనం కుణపగన్ధ్యనల్పం రక్తేన, గ్రన్థిభూతం శ్లేష్మవాతాభ్యామ్, పూతిపూయనిభం పిత్తశ్లేష్మభ్యామ్, క్షీణం ప్రాగుక్తం పిత్తమారుతాభ్యామ్, మూత్రపురీషగన్ధి సన్నిపాతేనేతి. 3

పైఁజెప్పిన వాతాది దుష్టశుక్రములలో వాతముచే దుష్టమైన శుక్రము ఎఱుపు నలుపురంగులు గలదిగను, నురుఁగుతోఁ గూడినదిగను, రూక్షముగను, కృఛ్రముగ కొంచెము వెడలునదిగను, పలచగను, వేదన మొదలగునవి గలిగి ఉండును. మఱియు నీ విషయమునందు ఆత్రేయుఁడు—"ఫేనిలం తనురూక్షఞ్చ కృఛ్రేణాల్పఞ్చ మారుతాత్, భవత్యుపహతం శుక్రం న తద్గర్భాయ కల్పతే" పిత్తముచే దుష్టమైన శుక్రము ఊష్మము, తాపము, పీతవర్ణము లేక నీలవర్ణము కలిగి, దుర్గంధయుక్తమై, శుక్రము వెడలునపుడు లింగమునం దతితీవ్రమగు మంట కలదిగ నుండును. ఆత్రేయవచనము— "సనీలమథవా పీతమత్యుష్ణం పూతిగన్ధివా, దహల్లింగం వినిర్యాతి శుక్రం పిత్తేన దూషితమ్". కఫముచే దుష్టమైన శుక్రము కఫవర్ణము గలిగి శ్లేష్మచే నడ్డగింపఁబడిన మార్గము గలదై మిగుల పిచ్ఛిలము (జిగురు) గ నుండును. ఆత్రేయవాక్యము—"శ్లేష్మణా రుద్ధమార్గన్తు భవత్యత్యర్థపిచ్ఛిలం, ఇతి దోషాస్సమాఖ్యాతాశ్శుక్రస్య తు విశేషతః." రక్తముచే దుష్టమైన శుక్రము శవగంధము గలిగి రక్తవర్ణముగను పిత్తవికారముగలదై యధికముగ నుండును. కొందఱు—"అగ్నిచేఁ దపింపఁబడిన ఘృతాదులు ఘృతాదులం దుండు భక్ష్యాదులఁ దపింపఁజేయునటుల వాతాదిదోషములచే దుష్టమగురక్తము శుక్రమును దోషయుక్తముగఁ జేయుచున్నది" అనుచున్నారు. శ్లేష్మవాతములచే దుష్టమైన

శుక్రము గ్రంథిరూపముగ నుండును. పిత్తశ్లేష్మములచే దుష్టమైన శుక్రము దుర్గంధయుక్తమై చీమువలె నుండును. పిత్తవాతములచే దుష్టమైన శుక్రము క్షీణమై వేదనతోఁ గూడియుండును. శుక్రము క్షైణ్యము నొందినప్పుడు మేఢ్రవృషణములయందు వేదన, మైథునమం దశక్తి, చిరకాలమునకు శుక్రము స్రవించుట, ఒకప్పుడు స్వల్పరక్తము స్రవించుట, అనునీలక్షణములు కలిగియుండును. త్రిదోషములచే దుష్టమైన శుక్రము మూత్రపురీషగంధము గలదిగను, ముందు చెప్పఁబడిన వాతపిత్తశ్లేష్మదోషలక్షణములు కలదిగ నుండును.

### శుక్రదోషసాధ్యాసాధ్యవివరణము.

సూ. తేషు కుణపగ్రన్థిపూతిపూయక్షీణరేతసః కృచ్ఛ్రసాధ్యాః
మూత్రపురీషరేతస స్త్వసాధ్యాః. సాధ్యమన్యచ్చేతి. 4

పైఁజెప్పిన శుక్రదోషములలో శవగంధముగలది, గ్రంథిరూపముగ నుండునది, దుర్గంధము గలిగి చీమువలెనుండునది, క్షీణమైనది, అను నాలుగు శుక్రదోషములు కష్టసాధ్యములు. మూత్రపురీషగంధముగల శుక్రదోషంబు లసాధ్యంబులు. ఇతరములగు శుక్రదోషములు సాధ్యంబులుగ నుండును.

### ఆర్తవదోషవివరణము.

సూ. ఆర్తవమపి త్రిభిర్దోషైశ్శోణితచతుర్థైః పృథగ్ద్వన్ద్వైస్సమస్తై
శ్చోపసృష్టమబీజం భవతి. 5

ఆర్తవము కూడ వాతపిత్తశ్లేష్మరక్తదోషములచేఁ బ్రత్యేకముగఁ గాని రెండు దోషములచేఁ గాని మూఁడుదోషములచేఁ గాని దుష్టంబై గర్భధారణంబున కసమర్థముగ నుండును.

### దుష్టశోణితవర్ణాదివివరణము.

సూ. తదపి దోషవర్ణవేదనాదిభిర్విజ్ఞేయమ్. 6

శుక్రదోషమునందుఁ జెప్పఁబడిన వాతాదిదోషవర్ణవేదనాది వికారలక్షణంబు లన్నియు వాతాదిదుష్టార్తవమునందును కలిగి యుండునని తెలియవలయును.

### ఆర్తవదోషసాధ్యాసాధ్యవివరణము.

సూ. తేషు కుణపగ్రన్థిపూతిపూయక్షీణమూత్రపురీషప్రకాశమసా
ధ్యం. సాధ్యమన్యద్భవతి. 7

పైఁజెప్పిన యార్తవదోషంబులలో శవగంధమువంటి గంధముకలది, గ్రంథిగ నుండునది, దుర్గంధమగు చీమువలెనుండునది, క్షీణమైనది, మూత్రపురీష ప్రకాశము గలది, యను ఆర్తవదోషంబు లసాధ్యంబులు. ఇతరము లగు నార్తవదోషంబులు చికిత్సాసాధ్యంబులుగ నుండును.

### శుక్రదోషచికిత్స.

భవన్తి చాత్ర.—

తేష్వాద్యాఞ్ఛుక్రదోషాంస్త్రీన్ స్నేహస్వేదాదిభిర్జయేత్,
క్రియావిశేషైర్మతిమాంస్తథా చోత్తరవస్తిభిః. 8

పైఁజెప్పిన శుక్రదోషములలో వాతపిత్తకఫములచే దుష్టమగు మొదటి మూఁడు శుక్రదోషములను ఘృతాదిస్నేహపానము, స్వేదము, వమనము, విరేచనము, ఉత్తర †వస్తి, నిరూహవస్తి, అనువాసనవస్తి, చరకోక్తబ్రాహ్మ్యాదిరసాయనసేవనము మొదలగు చికిత్సావిశేషములచే నశింపఁజేయవలయును. ఇచ్చట మూలమునందుఁ బ్రత్యేకముగ "తథా చోత్తరవస్తిభిః" అని చెప్పంబడియుండుటవలన నుత్తరవస్తి ప్రాధాన్యంబని తెలియుచున్నది.

### కుణపగంధిశుక్రదోషచికిత్స.

శ్లో. పాయయేత్తం నరం సర్పిర్భిషక్కుణపరేతసి
ధాతకీపుష్పఖదిరదాడిమార్జునసాధితమ్,
పాయయేదథవా సర్పిశ్శాలసారాదిసాధితమ్. 9

ఆరెపువ్వు, చండ్ర, దానిమ్మబెరడు, మద్దిచెక్క అనువానికల్కమునందుఁగాని కషాయమునందుఁగాని గోఘృతముగలిపి ఘృతపక్వముగఁ గాఁచి పానము చేయించినను, లేక గుగ్గిలపుకల్కములోఁగాని కషాయమునందుఁగాని ఘృతమును గలిపి ఘృతపక్వముగ కాచి పానముఁజేయించినను శవగంధము గలరేతోదోషము నశించును.



### గ్రంథిరూపశుక్రదోషచికిత్స.

శ్లో. గ్రన్థిభూతే శఠీసిద్ధం పాలాశే వాపి భస్మని. 10

కచోరములకల్కమునందుఁ గాని కషాయమునందుఁ గాని గోఘృతమును గలిపి ఘృతపక్వముగఁగాచి పానము చేయించినను, లేక మోదుగక్షారమునందు గోఘృతమును గలిపి ఘృతపక్వముగఁగాచి పానముఁజేయించినను గ్రంథిరూపశుక్రదోషము నశించును.

### పూతిపూయశుక్రదోషచికిత్స.

శ్లో. పరూషకవటాదిభ్యాం పూయప్రఖ్యే చ సాధితమ్. 11

చిట్టీత, ద్రాక్ష, కాయఫలము, దానిమ్మబెరడు, మొగలి, చిల్లగింజ, శాకఫలము, కరకతాండ్రయుసిరికలు, మఱ్ఱి, అత్తి, రావి, జువ్వి, కలుజువ్వి, ఇప్ప, అంబాళము, మద్ది, పుల్లమామిడి, తుమ్మెదమామిడి, చోరకపత్రము, నేరేడు, కాకినేరేడు, ప్రేంకణము, అతిమధురము, కటుకరోహిణి, అశోకము, కడప, రేగు, నల్లతుమికి, అందుగు, లొద్దుగు,

† వస్తియనఁగా—మలమూత్రద్వారములయందు స్నేహమిశ్రితకషాయాదులచే చిమ్మనగ్రోవితోఁ గొట్టుట.

తెల్లలొద్దుగు, జీడి, మోదుగ, నందివృక్షము అను వానికల్కములోఁగాని, కషాయములోఁగాని గోఘృతమును గలిపి ఘృతపక్వముగఁ గాచి పానముఁజేయించిన దుర్గంధముతోఁ గూడి చీముపలెనుండు రేతోదోషము నశించును.

### క్షీణశుక్రదోషచికిత్స.

శ్లో. ప్రాగుక్తం వక్ష్యతే యచ్చ తత్కార్యం క్షీణరేతసి. 12

పైఁ జెప్పిన శుక్రదోషములం దుపయోగించు శుక్రకరౌషధములును, ఇఁకఁ జెప్పఁబోవు వాజీకరణౌషధములును, క్షీణశుక్రము కలవానికొసఁగినచో క్షీణశుక్రదోషము నశించును. క్షీణబలము క్షీణశుక్రముగలవారికి చికిత్సావిషయమున నాత్రేయుఁడు విస్తరించి యిట్లు చెప్పెను.— 'వాజీకరణయోగైస్తైరుపయుక్తైశ్శుభైర్హితం, రక్తపిత్తహరైర్యోగైర్యోనివ్యాపాదికైస్తథా. దుష్టం యావత్తదా శుక్రం తదా తత్సముపాచరేత్, ఘృతం యజ్జీవనీయోక్తం చ్యవనప్రాశఏవచ. గిరిజస్య ప్రయోగశ్చ రేతోదోషాన్వ్యపోహతి.' వాజీకరణౌషధములు, రక్తపిత్తహరౌషధములు, యోన్యాపత్తునం దుపయోగించును. జీవనీయఘృతము, చ్యవనప్రాశము, శిలాజతుప్రయోగము, అను నివి శుక్రదోషములఁ బోగొట్టును.

### మలగంధశుక్రదోషశమనోపాయము.

శ్లో. విట్ప్రభే పాయయేత్సిద్ధం చిత్రకోశీరహిఙ్గుభిః. 13

చిత్రమూలము, వట్టివేరు, ఇంగువ, అనువానికల్కమునందు గోఘృతమును గలిపి సిద్ధపఱచి పానము చేయించిన మలగంధముగలశుక్రదోషము నశించును. ఈ శుక్రదోషం బసాధ్యంబు గాన యాప్యము.

### శుక్రదోషసామాన్యచికిత్స.

శ్లో. స్నిగ్ధం వాన్తం విరిక్తం చ నిరూఢమనువాసితమ్,
యోజయేచ్ఛుక్రదోషార్తం సమ్యగుత్తరవస్తినా. 14

స్నేహపానము, వమనము, విరేచనము, నిరూహవస్తి, అనువాసనవస్తి, ఉత్తరవస్తి, అను నుపచారములచే శుక్రదోషములన్నిటిని నశింపఁజేయవలయును.

### ఆర్తవదోషచికిత్స.

శ్లో. విధిముత్తరవస్త్యన్తం కుర్యాదార్తవశుద్ధయే,
స్త్రీణాం స్నేహాదియుక్తానాం చతస్ృష్వార్తవార్తిషు,
కుర్యాత్కల్కాన్పిచూంశ్చాపి పథ్యాన్యాచమనాని చ. 15

స్నేహపానము, వమనము, రేచనము, నిరూహవస్తి, అనువాసనవస్తి, ఉత్తరవస్తి అను నీయుపచారములచే వాతాదిదోషతారతమ్యానుగుణముగ నుపచరించిన వాతపిత్తకఫరక్తదోషములతోఁ గూడిన యార్తవదోషము శమించును. మఱియు వాతాదిదోష

హరద్రవ్యములను కల్కాదిరూపముగను, త్రిఫలాదిక్వాథమును యోనిప్రక్షాళనార్థముగను, వాతాదిహరద్రవ్యకషాయము, ఘృతము, తైలము, అనువానిని నిరూహవస్తి, అనువాసనవస్తి, ఉత్తరవస్తి అనువానియందు ఉపయోగించవలెను. యోనిముఖమున పిచువును(తైలము,కల్కము,కషాయము మొదలగువానియందు ప్రత్తిని దడిపి) వేయవలయును.

### గ్రంథిభూతార్తవదోషచికిత్స.

శ్లో. గ్రన్థిభూతే పిబేత్పాఠాం త్ర్యూషణం వృక్షకాణి చ. 16

విషబొద్ది, సొంటి, పిప్పలి, మిరియాలు, చింతబెరడు, అను వానిని కషాయము కాచి పానము చేయించిన గ్రంథిరూప మగునార్తవదోషము శమించును.

### దుర్గంధాద్యార్తవదోషచికిత్స.

శ్లో. దుర్గన్ధే పూయసంకాశే మజ్జతుల్యే తథాఽఽర్తవే,
పిబేద్భద్రశ్రియః క్వాథం చన్దనక్వాథమేవ చ. 17

హరిచందనము, చందనము, అనువానిని కషాయము కాచి పానము చేయించిన మూత్రపురీషగంధము గలయార్తవదోషము, మజ్జతుల్యముగ నుండునార్తవదోషము నశించును. ఆర్తవము కఫపిత్తములచే దుష్టంబగుటవలన దుర్గంధముగను త్రిదోషములచే దుష్టంబగుటచే మజ్జతుల్యముగను ఉండును.

### ఆర్తవదోషశమనవిధి.

శ్లో. శుక్రదోషహరాణాం చ యథాస్వముపచారణమ్,
దోషాణాం శుద్ధికరణం శేషాస్వప్యార్తవార్తిషు. 18

కుణపగంధి మొదలగు నార్తవదోషంబు లసాధ్యంబు లైనను వానిని శుక్రదోషమునందుఁ జెప్పఁబడిన దుర్గంధనాశార్థ మైనచికిత్సల చేయవలయును. ఇకరములగు వాతాది దుష్టార్తవదోషములందు శుక్రదోషశమనార్థమై పైనఁ జెప్పినచికిత్సలఁ గ్రమముగ చేయునది.

### ఆర్తవదోషమునందు పథ్యము.

శ్లో. అన్నం శాలియవం మద్యం హితం మాంసం చ పిత్తలమ్. 19

శాల్యన్నము, యవాన్నము, మద్యము, మాంసము, పిత్తకరపదార్థములు, ఇవి ఆర్తవదోషమునందు పథ్యములు.

### శుద్ధశుక్రలక్షణము.

శ్లో. స్ఫటికాభం ద్రవం స్నిగ్ధం మధురం మధుగన్ధి చ,
శుక్రమిచ్ఛన్తి కేచిత్తు తైలక్షౌద్రనిభం తథా. 20

స్ఫటికతుల్య మైనకాంతిగలదై ద్రవముగ స్నిగ్ధముగ మధురముగ తేనెతో సమానమై గంధము కలదిగనుండు శుక్రము నిర్దోషముయినదనియు, గర్భధారణ యోగ్య మైనదనియు పెద్దలు వచించెదరు. తైలము, తేనె, పీనివలెనుండు శుక్రము కూడ గర్భధారణయోగ్య మని మఱికొందఱు వచించెదరు.

శుద్ధార్తవలక్షణము.

శ్లో. శశాసృక్ప్రతిమం యత్తు యద్వా లాక్షారసోపమమ్,
తదార్తవం ప్రశంసన్తి యద్వాసో న విరఞ్జయేత్. 21

కుందేటి రక్తతుల్యముగఁగాని, లక్కవలెఁగాని, వస్త్రముపైఁ బడిన విశేషముగ నెఱ్ఱఁగఁ గాన్పింపక యుండికినచో గుఱుతు దెలియక యుండునార్తవము నిర్దోషమైన దనియు, గర్భధారణమునకు యోగ్యంబైన దనియు వచించెదరు.

అసృగ్దరలక్షణము.

శ్లో. తదేవాతిప్రసజ్గేన ప్రవృత్తమనృతావపి,
అసృగ్దరం విజానీయాదతోఽన్యదుక్తలక్షణాత్. 22

పైఁ జెప్పిన యార్తవలక్షణములకు విరుద్ధలక్షణములు కలిగి అతిమైథునముచే ఋతుకాలమునందును, ఋతువ్యతిరిక్తకాలమునందును, అధికముగ స్రవించుచు నురుగు, దురద మొదలగులక్షణంబులతోఁ గూడియుండిన నయ్యది యసృగ్దరమని తెలియవలెను. దీనిని తెలుఁగున నెఱ్ఱకుసుమరోగమనియు, నింగ్లీషున మెనరోజియా అనియు నందురు.

అసృగ్దరోపద్రవములు.

శ్లో. అసృగ్దరో భవేత్సర్వ స్సాఙ్గమర్దస్సవేదనః,
తస్యాతివృత్తౌ దౌర్బల్యం భ్రమో మూర్ఛా †తమ స్తృషా,
దాహః ప్రలాపః పాణ్డుత్వం తన్ద్రారోగాశ్చ వాతజాః. 23

అసృగ్దరరోగమునందు ఒడలు విరుపు, శరీరమందంతయు నొప్పులును గలుగును. మఱియు నీవ్యాధియందు ఆర్తవము మిక్కుటముగ స్రవించుచుండిన దౌర్బల్యము, మూర్ఛ, భ్రమ, చీకట్లు క్రమ్ముకొనినట్లు కనుపించుట, దప్పి, శరీరతాపము, ప్రలాపము, శరీరమందు పాండువర్ణము, తంద్ర, వాతవ్యాధియందు కలుగు వికారములును కలుగును.

అసృగ్దరచికిత్స.

శ్లో. తరుణ్యా హితసేవిన్యా స్త మల్పోపద్రవం భిషక్,
రక్తపిత్తవిధానేన యథావత్సముపాచరేత్. 24

వయోవంతురాలుగనుండి హితపదార్థసేవనముఁ జేయుస్త్రీయొక్క యసృగ్దరము అల్పమగునుపద్రవములు కలిగియుండిన దానిని రక్తపిత్తోపచారములచేఁ బోగొట్ట వలయును.

† 'మద స్తృషా' యని పాఠాన్తరము. మదమనఁగా సమ్మోత్తవిత్తులు తిినినటుల శ్రమపడుట.

## నష్టరక్తమునందు పథ్యము.

శ్లో. దోషైరావృతమార్గత్వాదార్తవం నశ్యతి స్త్రియాః,
తత్ర మత్స్యకులుత్థామ్లతిలమాషసురా హితాః,
పానే మూత్రముదశ్విచ్ఛ దధి శుక్తం చ భోజనే. 25

కఫము, వాతము అనువానిచే ప్రత్యేకముగఁగాని లేక కఫవాతములు రెంటిచేఁగాని ఆర్తవమార్గము అడ్డగింపఁ బడుటవలన ఆర్తవము అంతర్గ(ప్రవృత్త)మైనను బైట కనుపించకుండును. "ఈ శాస్త్రమునందు" "దోషైః" అనుటచే వాతపిత్తశ్లేష్మంబులకు మూఁడింటికిని గ్రాహ్యంబగుచుండినను పిత్తము ఆర్తవవృద్ధికరం బగుటచే దానిని వర్జించి కఫవాతములనే గ్రహింపవలయును. పైఁజెప్పినప్రకారము ఆర్తవము కనుపింపకుండునపుడు మత్స్యములు, ఉలవలు, పులికడుగు, నువ్వులు, మినుములు, మద్యము, గోమూత్రము, సగమునీరుగలిపినమజ్జిగ, పెరుఁగు, శుక్తము, అను నివి భోజనపానములయందు హితకరంబులు.

## క్షీణరక్తోపచారము.

శ్లో. క్షీణం ప్రాగీరితం రక్తం సలక్షణచికిత్సితమ్,
తథాప్యత్ర విధాతవ్యం విధానం నష్టరక్తవత్. 26

క్షీణరక్తలక్షణములును తచ్చికిత్సలును ఈసుశ్రుతసూత్రస్థానమున దోషధాతుమలక్షయవృద్ధ్యధ్యాయమునందుఁ జెప్పఁబడియుండినను పైఁజెప్పిన నష్టరక్తమునందు చేయు మత్స్యకులుత్థాద్యుపచారంబులను క్షీణరక్తమునందును జేయవలయును.

## ఋతుకాలవర్జనీయధర్మములు.

సూ. ఏవమదుష్టశుక్రశ్శుద్ధార్తవా ఋతౌ ప్రథమదివసాత్ప్రభృతి బ్రహ్మచారిణీ దివాస్వప్నాఞ్జనాశ్రుపాతస్నానానులేపనాభ్యఞ్జనఖచ్ఛేదనప్రధావనహసనకథనాతిశబ్దశ్రవణావలేఖనానిలాయాసాన్పరిహరేత్. కిం కారణమ్? దివా స్వపన్త్యాస్స్వాపశీలో,ఽఞ్జనాదన్ధో, రోదనాద్వికృతదృష్టి, స్నానానులేపనాద్దుఃఖశీల, స్తైలాభ్యఙ్గాత్కుష్ఠీ, నఖాపకర్తనాత్కునఖీ, ప్రధావనాచ్చఞ్చలో, హసనాచ్ఛ్యావదన్తోష్ఠతాలుజిహ్వః, ప్రలాపీ చాతికథనా, దతిశబ్దశ్రవణాద్బధిరో, ఽవలేఖనాత్ఖలతి, ర్మారుతాయాససేవనాదున్మత్తో గర్భో భవతీత్యేవమేతాన్పరిహరేత్. 27

పై ప్రకారము చికిత్సలను జేసినయెడల పురుషునికిఁ గలిగియుండు శుక్రదోషములును, స్త్రీకిఁగల యార్తవదోషములును నశించి స్త్రీపురుషులు శుద్ధశుక్రశుద్ధార్తవవంతులుగ నయ్యెదరు. స్త్రీ ఋతుమతియైన ప్రథమదినము మొదలుకొని మూఁడుదిన

ములవరకు బ్రహ్మచర్యము (అష్టాఙ్గమైథునరాహిత్యము) మొదలగువ్రతములచే నియమవంతురాలై పగటినిద్ర, కన్నులయందు కాటుక పెట్టుకొనుట, రోదనము, స్నానము, చందనాద్యనులేపనము, అభ్యంగనము, గోళ్లు తీయుట, పరుగులిడుట, దుముకుట, నవ్వుట, అధికసంభాషణము, గొప్పధ్వనివినుట, తలదువ్వుట, మిక్కుటమైనగాలి, ఆయాసకరములైన పనులు, వీనిని వర్జింపవలయును. ఏలననఁగా——పగటి నిద్రవలన ఎప్పుడును నిద్రించు స్వభావము, కాటుకవలన గ్రుడ్డితనము, రోదనమువలన వికారమైన దృష్టి, స్నానానులేపనమువలన సదా దుఃఖించు స్వభావము, అభ్యంగనమువలన కుష్ఠరోగము, గోళ్లుతీసికొనుటవలన పుచ్చిగోళ్లు, పరుగెత్తుట దుముకుట వీనివలన చంచలస్వభావము, నవ్వుటవలన దంతములు పెదవులు దౌడలు నాలుక వీనియందు శ్యావవర్ణము, అతిసంభాషణమువలన ప్రలాపము, అధికశబ్దశ్రవణమువలన చెవిటితనము, తలదువ్వుకొనుటవలన బట్టతల, వాతసేవనము-ఆయాసకరమైన పనులఁ జేయుట వీనివలన ఉన్మాదము ఇవి గల శిశువు జనించును.

## రజస్వలానియమము.

సూ. దర్భసంస్తరశాయినీం కరతలశరావపర్ణాన్యతమభోజినీం హవిష్యం త్ర్యహం చ భర్తుస్సంరక్షేత్. తతశ్శుద్ధస్నాతాం చతుర్థేఽహన్యహతవాస సమలఙ్కృతాం కృతమఙ్గళస్వస్తివాచనాం భర్తారం దర్శయేత్. తత్కస్య హేతోః?

శ్లో. పూర్వం పశ్యేదృతుస్నాతా యాదృశం నరమఙ్గనా,
తాదృశం జనయేత్పుత్రం భర్తారం దర్శయేదతః.
తతో విధానం పుత్రీయముపాధ్యాయస్సమాచరేత్,
కర్మాన్తే చ క్రమం హ్యేవమారభేత విచక్షణః. 23

ఋతుమతియగు స్త్రీ దర్భపై శయనించుట, దోసిలిలోఁగాని, మూఁకుడులోఁగాని, ఆకులలోఁగాని, శాల్యన్నమును లేక యవాన్నాదికముల నునిచికొని వానిని ఘృతక్షీరాదులలో దేనిలోనైనఁ జేర్చికొని భుజించుట, ఋతువైనమూఁడుదినములు భర్తను దర్శింపకుండుట, అనునియమముల నాచరింపవలయు. "నవే ఋతౌచసఞ్జాతే విగతేజీర్ణశోణితే, నారీ భవతి సంశుద్ధా పుమాంసం సృజతే తదా" అనువచనమువలన పైఁ జెప్పిన మూఁడుదినములు గడచినపిదప ప్రాచీనశోణితముపోయినూతనార్తవము కలిగియుండుట వలన స్త్రీ పరిశుద్ధురా లగుచున్నయది. తెలియఁజేయుచున్నది. కనుక అట్టినాలవదినమున పరిశుద్ధురాలై స్నానముచేసి నూతనవస్త్రమును ధరించుకొని ఆభరణాదులచేతను హారిద్రాకుంకుమాదులచేతను అలంకృతురాలై మంగళస్వస్తివాచనపూర్వకముగ భర్తను జూడవలయును. ఏలనన; ఋతుస్నాతయగుస్త్రీ తొలుత నేపురుషుని జూచునో అట్టి

పురుషునివంటిపుత్రుని గనును. కాఁబట్టి తొలుత భర్తనే చూడవలయు. భర్తృదర్శనానంతరము నిపుణత్వము గల యాచార్యుఁడు పుత్రజననసూచకమైన ఆజ్యహోమాదిప్రధానక్రియలఁ జేయించి సమాప్తి యైనపిదప నీక్రిందఁ జెప్పువిధానమును కూడఁ జేయుంచవలయును.

## స్త్రీసంభోగనియమము.

సూ. తతోఽపరాహ్ణే పుమాన్మాసం బ్రహ్మచారి సర్పిస్స్నిగ్ధస్సర్పిః
క్షీరాభ్యాం శాల్యోదనం భుక్త్వా మాసం బ్రహ్మచారిణీం తైల
స్నిగ్ధాం తైలమాషోత్తరాహారాం నారీముపేయాద్రాత్రౌ
సామాదిభిరాశ్వాస్య వికల్పైర్వ్యేవం చతుర్థ్యాం షష్ఠ్యామష్ట
మ్యాం దశమ్యాం ద్వాదశ్యాం చోపేయాదితి పుత్రకామః.

శ్లో. ఏషూత్తరోత్తరం విద్యాదాయురారోగ్యమేవ చ,
ప్రజాసౌభాగ్యమైశ్వర్యం బలం చ దివసేషు వై.

సూ. అతః పరం పఞ్చమ్యాం సప్తమ్యాం నవమ్యామేకాదశ్యాం
చ స్త్రీకామః. త్రయోదశీప్రభృతయో నిన్ద్యాః. 2

పైఁ జెప్పినకర్మ సమాప్తమైనపిదప నొకమాసమువఱకు బ్రహ్మచర్యవ్రతము నాచరించి యుండినపురుషుఁడు సాయంకాలమునందు శరీరమునకు నేతిని బూసికొని స్నానముచేసి ఘృతక్షీరములతోఁ గలసిన శాల్యన్నమును భుజించి యొకమాసమువఱకు బ్రహ్మచర్యనియమము గలదై సాయంకాలమున శరీరమునకు నూనెను పూసికొని స్నానముచేసి నూనె మినుములు అధికముగ గలసిన యాహారమును భుజించియుండు స్త్రీని మంచిమాటలచే నూరడించి ఋతుమతియైన నాలుగు, ఆఱు, యెనిమిది, పది, పండ్రెండు, యీ దినములలో నేదైన నొకదినముయొక్క రాత్రియందు మంచిముహూర్తమునఁ బుత్రేచ్ఛగలవాఁడై సంభోగమునందుఁ బ్రవర్తింపవలయు. పైఁ జెప్పినప్రకారము నాలవదినమునందు సంభోగమునఁ బ్రవర్తించిన ఆయుష్యము, ఆఱవదినమునందైన ఆరోగ్యము, ఎనిమిదవదినమునందైనయెడల సంతానము, పదియవదినమునందైనయెడల సౌభాగ్యము, పండ్రెండవదినమునందైనయెడల ఐశ్వర్యబలములు గలపుత్రుఁడు జనించును. స్త్రీసంతతియం దిచ్ఛగలపురుషుఁడు ఐదు, ఏడు, తొమ్మిది, పదకొండు, యీదినములలో నేరాత్రియందైనను సంభోగము సేయవలయు. పదుమూఁడు మొదలగు దినములు నిందితంబులు కావున సంభోగమును జేయంజనదు.

## రజస్వలాసంభోగనిషేధము.

సూ. తత్ర ప్రథమే దివసే ఋతుమత్యాం మైథునగమనమనా
యుష్యం పుంసాం భవతి. యశ్చ తత్రాధీయతే గర్భస్స ప్రసవ

మానో విముచ్యతే. ద్వితీయే ఒప్యేవం సూతికాగృహే వా. తృతీయేఒప్యేవమసమ్పూర్ణాఙ్గోఒల్పాయుర్వా భవతి. చతుర్థేతు సమ్పూర్ణాఙ్గో దీర్ఘాయుశ్చ భవతి. న చ ప్రవర్తమానే రక్తే బీజం ప్రవిష్టం గుణకరం భవతి. యథా నద్యాం ప్రతిస్రోతః ప్లావి ద్రవ్యం ప్రక్షిప్తం ప్రతినివర్తతే నోర్ధ్వం గచ్ఛతి, తద్వదేవ ద్రష్టవ్యమ్. తస్మాన్నియమవతీం త్రిరాత్రం పరిహరేత్. అతః పరం మాసాదుపేయాత్. 30

ఋతుమతియైన స్త్రీతోడ ప్రథమదినమునందు సంభోగము సేయుపురుషుని యాయువు క్షీణించుటయగాక యాదినమున ధరించిన గర్భముకూడ ప్రసవమగునపుడే మృతిఁజెందును. రెండవదినమునందు ధరించిన గర్భము ప్రసవమైనతోడనే కాని, పది దినములలోగాని మృతిఁజెందును. మూఁడవదినమునందు ధరించిన గర్భము ప్రసవించిన తోడనే గాని కొలదిదినములు ఉండిగాని మృతిఁజెందును. లేక అసంపూర్ణమైన యవయవములు గలదిగనైన నగును. నాలవదినమునందు ధరించిన గర్భము సంపూర్ణావయవములు గలదై దీర్ఘాయువు కలదిగనుండును. నదియందు ప్రవాహమున కెదురుగ వేయఁబడిన తేలునట్టి స్వభావముగలకాష్ఠాదులు ప్రవాహమున కెదురుగఁ బోక మరలం దిరిగి వచ్చు చందంబున యోనివలన రక్తము స్రవించుచుండఁగా ప్రవిష్టమైనశుక్రము గర్భకోశమును జెందుట కసమర్థంబై రక్తముతోడనే బయట వెలువడును కాఁబట్టి ఋతునియమము ననుసరింపుచుండు స్త్రీతో మూఁడురాత్రులు సంభోగము సేయంజనదు. 'ఋతుస్తు ద్వాదశరాత్రం భవతి దృష్టార్తవః' అను మూఁడవయధ్యాయమునందలి సూత్రమునందు దృష్టార్తవ యగుస్త్రీకి పండ్రెండుదినములు ఋతుకాలము అని చెప్పియున్నందున ఆపండ్రెండుదినములు గడచిన పిదప నెలదినములు వర్జించి పిదప సంభోగము జేయవలయు. ఆంతకులోపల సంభోగమును జేసిన గర్భద్వారము వికృతమగును.

## గర్భోపచారము.

సూ. లబ్ధగర్భాయాశ్చైతేష్వహస్సు లక్ష్మణావటశృఙ్గాసహదేవావిశ్వదేవానామన్యతమం క్షీరేణాభిషుత్య త్రీంశ్చతురో వా బిన్దూన్దద్యాద్దక్షిణే నాసాపుటే పుత్రకామాయై న చ తాన్నిష్ఠీవేత్. 31

స్త్రీ గర్భము ధరించియుండఁగా లక్ష్మణపంజి, వటాంకురము, సహదేవి, జిబిలిక అనువానిలో దేనినేని ఆవుపాలతో నూరి మూఁడు లేక నాలుగుబిందువులు పుత్రేచ్ఛగల స్త్రీయొక్క కుడిముక్కునందు పురుషుఁడు నస్యము చేయించవలయును. దాని నాస్త్రీ యుమియవేయఁజనదు. ఈవిషయమున గ్రంథాంతరమునందు,

శ్లో. "పుత్ర తారకరక్తాల్పబిందుభిర్లక్షితచ్ఛదా, లక్ష్మణా పుత్రజననీ బస్తగంధా కృతిర్భవేత్" లక్ష్మణయను మూలిక గుడ్లగూబశరీరమువలె కొన్నిస్థలములయందు రక్తతుల్యమైన బిందువులతోఁ గూడియుండునట్టి యాకులుకలదిగ, కుక్కవాయింటాకుయొక్క ఆకృతికలదిగ, పుత్రోత్పాదనసామర్థ్యముకలదిగ నుండును. కావున శరత్కాలమునందు పుష్పఫలములతోఁ గూడియుండునపు డాలక్ష్మణ యనుమూలికను చూచి యునిచి శనివారము సాయంకాలమునందు నాయోషధికి నాలుగుప్రక్కలను చంద్రమేకులను నాటి మరునాఁడు హస్త, మూల, పుష్యమి అను నక్షత్రములలో నేనియందైన సూర్యుఁడు కూడియుండునపుడు మంత్రపూర్వకముగ గ్రహించి యామూలిక వర్ణముతో తుల్యమైన వర్ణముగలిగిన దూడగల యావుపాలతో నూరి శాస్త్రోక్తముగ స్త్రీకి నస్యము చేయించవలయునని చెప్పఁబడియున్నది.

## గర్భోత్పత్తిసామగ్రి.

శ్లో. ధ్రువం చతుర్ణాం సాన్నిధ్యాద్గర్భస్స్యాద్విధిపూర్వకః,
ఋతుక్షేత్రాम्बुబీజానాం సామగ్ర్యాదఙ్కురో యథా. 32

వర్షాదిఋతువులు, భూమి, ఉదకము, శాల్యాదిబీజములు, అనునవి నాలుగు దోషరహితంబై నొకటిగఁ జేరుటవలన అంకురములు జనించు చందంబున ఋతుకాలము, గర్భాశయము, జాఠరాగ్నిచేఁ బక్వమయిన యన్నరసము, శుక్రశోణితములు అనునవి నాలుగు నొకటిగఁ జేరుటవలన గర్భ ముత్పన్నంబగును.

శ్లో. ఏవం జాతా రూపవన్తో మహాసత్త్వాశ్చిరాయుషః,
భవన్త్యృణస్య మోక్తారస్సత్పుత్రాః పుత్రిణే హితాః. 33

ఈప్రకారము జనించిన పుత్రులు మిక్కిలి రూపవంతులుగ, సత్వగుణసంపన్నులుగ, దీర్ఘాయుష్మంతులుగ, ఋష్యాదిఋణవిమోచనపరులుగ, తలిదండ్రుల కనుకూలురుగ సత్పుత్రులుగ నుండెదరు.

## గర్భస్థ శిశువు శరీరవర్ణకారణము.

సూ. తత్ర తేజోధాతుస్సర్వవర్ణానాం ప్రభవ, స్స యదా గర్భోత్పత్తావబ్ధాతుప్రాయో భవతి తదా గర్భం గౌరం కరోతి, పృథ్వీధాతుప్రాయః కృష్ణం, పృథివ్యాకాశధాతుప్రాయః కృష్ణశ్యామం, తోయాకాశధాతుప్రాయో గౌరశ్యామమ్, యాదృగ్వర్ణమాహారముపసేవతే గర్భిణీ తాదృగ్వర్ణప్రసవా భవతీత్యేకే భాషన్తే.

గర్భముయొక్క శుక్లాదిసర్వవర్ణములకు తేజోధాతువు కారణము, గర్భాధానకాలమునందా తేజోధాతువులో నుదకధాతు వధికముగఁ గూడియుండిన గర్భమునకు గౌరవర్ణము. పృథ్వీధాతు వధికముగఁ గూడియుండిన గర్భమునకు కృష్ణవర్ణము. పృథి

వ్యాకాశధాతువు లధికముగఁ గూడియుండినగర్భమునకు కృష్ణశ్యామవర్ణములు. ఉదకాకాశధాతువు లధికముగఁ గూడియుండిన గర్భమునకు గౌరశ్యామవర్ణములు కలుగును. గర్భిణీస్త్రీ శుక్లాదివర్ణములలో నేవర్ణము గలయాహారమును భుజించునో అట్టివర్ణము గలశిశువునే గనునని కొందఱాచార్యులు వచించెదరు.

### గర్భస్థ శిశువు నేత్రవర్ణాదిహేతువు.

సూ. తత్ర దృష్టిభాగమప్రతిపన్నం తేజో జాత్యన్ధం కరోతి, తదేవ
రక్తానుగతం రక్తాక్షం, పిత్తానుగతం పిఙ్గాక్షం, శ్లేష్మానుగతం శుక్లా
క్షం, వాతానుగతం వికృతాక్షమితి. 35

గర్భమునకు ఇంద్రియవిభాగకాల మైననాలవమాసమందు తేజోధాతువు పూర్వజన్మదుష్కర్మమువలన దృష్టిభాగమునందు వ్యాపింపకుండిన గర్భమునకు జాత్యంధత్వము కలుగును. మఱియు నా తేజోధాతువే రక్తయుక్తమై దృష్టిభాగమునందు వ్యాపించిన గర్భమునకు రక్తాక్షత్వము (ఎఱ్ఱనికండ్లు) కలుగును. మఱియు నా తేజోధాతువు పిత్తముతోఁగూడి వ్యాపించిన గర్భమునకు పింగాక్షత్వము (పచ్చనికండ్లు) కలుగును. కఫముతోఁగూడి వ్యాపించిన గర్భమునకు శ్వేతాక్షత్వము (తెల్లనికండ్లు) కలుగును. వాయువుతోఁగూడి వ్యాపించిన గర్భమునకు వికృతాక్షత్వము (వికారమైనదృష్టి) కలుగును.

### గర్భహేతువు.

భవన్తి చాత్ర.—

శ్లో. ఘృతపిణ్డో యథైవాగ్నిమాశ్రితః ప్రవిలీయతే,
విసర్పత్యార్తవం నార్యాస్తథా పుంసాం సమాగమే. 36

పేరిననెయ్యి అగ్నిసంబంధమువలన ద్రవించుచందంబున పురుషసంబంధముచే జనించు సూష్మమువలన స్త్రీయొక్క ఆర్తవము ద్రవించి శుక్రయుక్తమై గర్భాశయమును జెంది జీవసంబంధము కలదై గర్భమునకు కారణమగును. అయినను స్త్రీసంయోగమునందు కామోద్రేకమువలన పురుషునికిమాత్రము శుక్రము స్రవించినను అది గర్భోత్పత్తికి కారణము కానేరదని "యోషితోఽపి స్రవత్యేవం తథా పుంసాం సమాగమే, తత్ర గర్భస్య కిఞ్చిత్తు కరోతీతి న చిన్త్యతే" అనువచనమువలనఁ దెలియుచున్నది.

### యమళోత్పత్తికారణము.

శ్లో. బీజేఽన్తర్వాయునా భిన్నే ద్వౌ జీవౌ కుక్షిమాగతౌ,
యమావిత్యభిధీయేతే ధర్మేతరపురస్సరౌ. 37

గర్భాశయమునందు శుక్రశోణితము లొకటిగఁ జేరునపుడు వాతము అచ్చట ప్రవేశించి బీజభూతములగు శుక్రశోణితములను భిన్నము సేయుటచే నవి రెండుఖండ

ములుగ నగును. ఆరెండుఖండములందును ప్రారబ్ధవశమున నిరువురు జీవులు ప్రవేశించుటచే నిరువురు శిశువులు జనించెదరు. వారు కవ లనఁబడియెదరు.

## ఆసేక్యనపుంసకలక్షణము.

శ్లో. పిత్రోరత్యల్పవీర్యత్వాదాసేక్యః పురుషో భవేత్,
స శుక్రం ప్రాశ్య లభతే ధ్వజోచ్ఛ్రాయమసంశయమ్. 38

మిక్కిలి యల్పవీర్యము గలతలితండ్రులకు జనించు పురుషుఁడు ఆసేక్యనపుంసకుఁడనఁబడును. వీఁడు అన్యపురుషునివలన తనముఖమునందు మైథునము చేయించికొని పతనంబైనశుక్రమును భక్షించిన పిదప లింగోత్థాపనము గలవాఁడగును. (వీనికే ముఖయోనియనియు నామాంతరము గలదు).

## సౌగంధికనపుంసకలక్షణము.

శ్లో. యః పూతియోనౌ జాయేత స సౌగన్ధికసంజ్ఞితః,
స యోనిశేఫసోర్గన్ధ మాఘ్రాయ లభతే బలమ్. 39

దుర్గంధయుక్త మగుయోనియందు జనించినవాఁడు సౌగంధికనపుంసకుఁ డనఁబడును. వాఁడు యోనిశిశ్నములగంధము నాఘ్రాణించినపిదప లింగోత్థానము కలవాఁడగును. (వీనికే నాసాయోని యనియు నామాంతరము కలదు.)

## కుంభీకనపుంసకలక్షణము.

శ్లో. స్వే గుదేఽబ్రహ్మచర్యాద్యః స్త్రీషు పుంవత్ప్రవర్తతే,
కుమ్భీకస్స తు విజ్ఞేయ ఈర్ష్యకం శృణు చాపరమ్. 40

తనగుదమునం దన్యునివలన మైథునము చేయించికొనినపిదప లింగోత్థానము కలవాఁడై స్త్రీసంభోగమునందు పురుషునివలెనే ప్రవర్తించువాఁడు కుంభీకనపుంసకుఁ డనఁబడును. మఱియు "మాతుర్వ్యవాయప్రతీపేన వక్రీ స్యాద్బీజదౌర్బల్యవశాత్పితుశ్చ" గర్భాధానకాలమునందు తల్లియొక్క మైథునవైపరీత్యమువలనను తండ్రియొక్క బీజదౌర్బల్యమువలనను జనించినవాఁడు కుంభీకనపుంసకుఁ డని కొందఱాచార్యులును, "అరజస్కాం యదా నారీం శ్లేష్మరేతా వ్రజేత్పుమాన్, అన్యసక్తా భవేత్ప్రీతిర్జాయతే కుంభికస్తదా" అల్పరజస్సుగలస్త్రీ శిథిలమైన శుక్రముగలపురుషునితో ఋతుకాలమునందు సంభోగమునఁ బ్రవర్తించుటవలన కామశాంతి కలుగక యన్యపురుషసంభోగమునం దిచ్ఛగలిగియుండినయెడల నట్టిస్త్రీకి జనించినవాఁడు కుంభీకనపుంసకుఁ డనఁబడునని కాశ్యపుఁడును వచించియున్నాఁడు.

## ఈర్ష్యకనపుంసకలక్షణము.

శ్లో. దృష్ట్వా వ్యవాయమన్యేషాం వ్యవాయే యః ప్రవర్తతే,
ఈర్ష్యకస్స తు విజ్ఞేయష్షణ్ఢకం శృణు పఞ్చమమ్. 41

అన్య మైథునదర్శనానంతరము లింగోత్థానముకలవాఁడై మైథునమునందుఁ బ్రవర్తించువాఁడు ఈర్ష్యకనపుంసకుఁ డనఁబడును. వీనికే దృగ్యోనియనికూడ నామాంతరము కలదు. 'ఈర్ష్యాభిభూతావపి మన్దహర్షావీర్ష్యాహ్వయస్యాపి వదన్తి హేతుమ్' స్త్రీపురుషు లిరువురు నన్యమైథునమును సహింపనేరక దుఃఖితులై సంభోగమునందుఁ బ్రవర్తించినయెడల నట్టి స్త్రీపురుషులకు జనించువాఁడు ఈర్ష్యకనపుంసకుఁ డనఁబడు నని కొందఱు వచించుచున్నారు.

### షండలక్షణము.

శ్లో. యో భార్యాయామృతౌ మోహాదఙ్గనేవ ప్రవర్తతే,
తతః స్త్రీచేష్టితాకారో జాయతే షణ్డసంజ్ఞితః. 42

మోహమువలన భార్యతో ఋతుకాలమునం దుపరిసురతప్రవర్తకుఁ డగువానికి జనించువాఁడు నిర్వీర్యుఁడగును. కావున షండుఁడనఁబడును. వీఁడు స్త్రీతో సమానమైన చేష్టలు ఆకారము కలవాఁడుగ నుండును.

### పురుషచేష్టాయుక్తకన్యకోత్పత్తికారణము.

శ్లో. ఋతౌ పురుషవద్వాపి ప్రవర్తేతాఙ్గనా యది,
తత్ర కన్యా యది భవేత్సా భవేన్నరచేష్టితా. 43

మోహమువలన ఋతుకాలమునం దుపరిసురతప్రవర్తకురా లగు స్త్రీకి జనించు కన్యక పురుషచేష్టలు కలది (మఱియొకస్త్రీతో పురుషునివలె సంభోగమునందుఁ బ్రవర్తించునది) గ నుండును.

### సశుక్రాశుక్రనపుంసకవివరణము.

శ్లో. ఆసేక్యశ్చ సుగన్ధీ చ కుమ్భీకశ్చేర్ష్యకస్తథా,
సరేతసస్త్వమీ జ్ఞేయా అశుక్రష్షణ్డసంజ్ఞితః. 44

పైనఁ జెప్పిన నపుంసకులలో నాసేక్యుఁడు, సౌగంధికుఁడు, కుంభీకుఁడు, ఈర్ష్యకుఁడు అనునలువురికి రేతస్సు కలిగియుండును. షండునికి మాత్రము రేతస్సు లేకయుండును.

### ఆసేక్యాదినపుంసకబలోత్పత్తికారణము.

శ్లో. అనయా విప్రకృత్యా తు తేషాం శుక్రవహాస్సిరాః,
హర్షాత్స్ఫుటత్వమాయాన్తి ధ్వజోచ్ఛ్రాయస్తతో భవేత్. 45

ఆసేక్యాదిచతుర్విధనపుంసకులు రేతోయుక్తులైనను పైఁ జెప్పినశుక్రపానాది క్రియానంతరమే వారలయొక్క రేతోవహనాడులు సంతోషమువలన వికసించి లింగో

స్థానము కలుగుటచే వారు నపుంసకులని చెప్పఁబడియెదరు. [మఱియు, 'నరనారీషండా' అని చరకమునందు చెప్పఁబడియుండుటవలన పురుషులకు గలిగియుండునపుంసకదోషము వలెనే స్త్రీలయందును నపుంసకదోషము కలిగియుండుననుటల దెలియుచున్నది.]

### పుత్రగుణకారణము.

శ్లో. ఆహారాచారచేష్టాభిర్యాదృశీభిస్సమన్వితౌ,
స్త్రీపుంసౌ సముపేయాతాం తయోః పుత్రోఽపి తాదృశః. 46

సంభోగమునందుఁ బ్రవర్తించు స్త్రీపురుషు లెట్టి యాహారాచారచేష్టలు గలవారుగ నుండెదరో అట్టివారలకు నట్టి యాహారాచారచేష్టలు గలపుత్రుఁడే జనించును.

### అస్థివిహీనగర్భకారణము.

శ్లో. యదా నార్యావుపేయాతాం వృషస్యన్త్యౌ కథఞ్చన,
ముఞ్చన్త్యౌ శుక్రమన్యోన్యమనస్థిస్తత్ర జాయతే. 47

మిక్కిలి కామపీడిత లగునిరువురు స్త్రీలు సురతాపేక్షకలవారై దృఢమైన పరస్పరయోనిసంబంధమువలన వీర్యమును స్రవింపఁ జేసినయెడల వారలకు అస్థివిహీన మాంసపిండము జనించును.

### కలలోత్పత్తికారణము.

శ్లో. ఋతుస్నాతా తు యా నారీ స్వప్నే మైథునమావహేత్,
ఆర్తవం వాయురాదాయ కుక్షౌ గర్భం కరోతి హి. 48
మాసి మాసి వివర్ధేత గర్భిణ్యా గర్భలక్షణమ్,
కలలం జాయతే తస్యా వర్జితం పైతృకైర్గుణైః. 49

ఋతుస్నానదినము మొదలు పండ్రెండుదినములలో దేనియందైన మైథునము చేయఁబడినటుల స్వప్నమును గాంచెడి స్త్రీయొక్క యార్తవమును వాతము గ్రహించి కుక్షియందు గర్భాకారముగఁ జేయును. పిదప స్త్రీకి ప్రతిమాసమునందును క్రమముగ గర్భలక్షణములు వృద్ధియై కేశములు, నఖములు, సిరలు, స్నాయువులు, ధమనులు, ఎముకలు అను పితృసంబంధగుణ విహీనమైన మాంసపిండము జనించును. దానినే కలలమని యెదరు.

### సర్పాద్యాకారగర్భకారణము.

శ్లో. సర్పవృశ్చికకూష్మాణ్డవికృతాకృతయశ్చ యే,
గర్భాస్త్వేతే స్త్రియాశ్చైవ జ్ఞేయాః పాపకృతా భృశమ్. 50

స్త్రీయొక్క పాపవిశేషమువలన సర్పవృశ్చిక కూశ్మాండాదులవలె వికారమైన రూపముగలగర్భములు జనించును.

## కుబ్జత్వాది గర్భవికారకారణము.

శ్లో. గర్భే వాతప్రకోపేన దౌహృదే చావమానితే,
భవేత్కుబ్జః కుణిః పఙ్గుర్మూకో మిమ్మిణ ఏవ చ.
మాతాపిత్రోస్తు నాస్తిక్యాదశుభైశ్చ పురాకృతైః,
వాతాదీనాం చ కోపేన గర్భో వికృతిమాప్నుయాత్. 51

వాతాదిదోషముల ప్రకోపమువలనను, దోహదకాలమున స్త్రీకి ఇష్టమగు పదార్థముల నొసంగకుండుటవలనను, తలిదండ్రులయొక్క నాస్తిక్యమువలనను, పూర్వజన్మార్జితపాపవిశేషమువలనను గర్భము వికారమునుజెంది కుబ్జత్వము, ఊచచేతులు, కుంటితనము, మూఁగతనము, ముక్కుతో మాటలాడుట ఇట్టి లక్షణములుగల శిశువు జనించును. [మఱియు కొందఱాచార్యులు "గర్భాధానకాలమునందు స్త్రీ చాంచల్యము గలదిగ నుండిన వెఱ్ఱితనము, మౌనముగనుండిన మూకత్వము, కండ్లుమూసికొనియుండిన నంధత్వము, నిద్రింపుచుండినఁ జెవిటితనము, కనుబొమలు విరిచికొనియుండిన వంధ్యాత్వము, నిలుచుండి పలుమారు నీరుత్రాగుచుండిన నపుంసకత్వము, ఉష్ణపదార్థమును భుజించిన వంకరచేతులు వంకరకాళ్లు గలశిశువు జనించునని వచించెదరు. *

## గర్భమునకు మలాద్యభావకారణము.

శ్లో. మలాల్పత్వాదయోగాచ్చ వాయోః పక్వాశయస్య చ,
వాతమూత్రపురీషాణి న గర్భస్థః కరోతి హి. 52

మలము అల్పముగనుండుటవలనను, పక్వాశయసంబంధమైన వాయువు అల్పమైయుండుటవలనను, గర్భమందుండుశిశువు వాతమూత్రపురీషములవిసర్జనము సేయకుండును.

---

* మఱియు పూర్వజన్మమునందు సాధువుల నిందించినవాఁడు మూఁగవాఁడుగను, అసత్యపుసాక్ష్యముఁ జెప్పినవాఁడు పగిలినపెదవిగలవాఁడుగను, గోవును జంపినవాఁడు తెలుకులవానియెద్దుగను, పరద్రవ్యమును హరించినవాఁడు కుక్కగను, భార్యాత్యాగముఁ జేసినవాఁడు దేశాంతరవాసిగను, చుఱుకు రోగపీడితుఁడుగను, స్త్రీహత్యఁ జేసినవాఁడు—అజాదిజీవహింసచేసినవాఁడు మాదిగవాఁడుగను, కన్యాసంగమము చేసినవాఁడు గ్రుడ్డివాఁడుగను, కపటపువ్యవహారములు చేసినవాఁడు నపుంసకుఁడుగను, హరికీర్తన చేయనివాఁడు వైశ్యుఁడుగను, ముగ్ధత్వము వహించినవాఁడు కారాగృహవాసిగను, జాతివైరము కలవాఁడు అధఃపాతిగను, పాపక్రియాసక్తుఁడు నరకవాసిగను, భర్తృదానవిరోధిని యగుస్త్రీ తిడకలిపక్షి కుక్క తిత్తిరిపక్షిగను, భర్తృపూర్వభోజిని నివడవాదులపక్షిగ (అనఁగా తనవిష్ఠమును తానే తినుపక్షిగ)ను, భర్తృసేవనిరాసక్తిని పింగళానాడి అంగభంగము గలదిగను. పరద్వారి విపశిముఖము గలదిగను, పతిఘాతిని బాలవిధవగను, కుబుద్ధిగలది బంధువర్గమును ద్యజించి తిరుగునదిగ నగునని కొందఱు వచించెదరు.

### గర్భస్థశిశురోదనాభావకారణము.

శ్లో. జరాయుణా ముఖే చ్ఛన్నే కణ్ఠే చ కఫవేష్టితే,
వాయోర్మార్గనిరోధాచ్చ న గర్భస్థః ప్రరోదితి. 53

ముఖము జరాయువు (మావి) చేఁ గప్పఁబడి యుండుటవలనను, కంఠము కఫముచే వ్యాప్తమై యుండుటవలనను, వాతమార్గము జరాయువుచే నడ్డగింపఁబడి యుండుటవలనను గర్భస్థశిశువు రోదనము సేయకుండును.

### గర్భమునకు నిశ్వాసాదికారణము.

శ్లో. నిశ్వాసోచ్ఛ్వాససఙ్క్షోభస్వప్నాన్గర్భోఽధిగచ్ఛతి,
మాతుర్నిశ్వసితోచ్ఛ్వాససఙ్క్షోభస్వప్నసమ్భవాన్. 54

గర్భస్థశిశువునకు నిశ్వాసము, ఉచ్ఛ్వాసము, చలనము, నిద్ర మొదలగునవి తల్లి యొక్క నిశ్వాసాదులవలనఁ గలుగుచుండును.

### శరీరావయవకారణము.

శ్లో. సన్నివేశశ్శరీరాణాం దన్తానాం పతనోద్భవౌ,
తలేష్వసమ్భవో యశ్చ లోమ్నామేతత్స్వభావతః. 55

కరచరణాద్యవయవములయొక్క రూపవిశేషము, దంతములు మొలచుట, దంతము లూడుట, అరచేతులందును అరకాళ్ళయందును రోమములు మొలవకుండుట, ఇవి యన్నియు స్వభావముగనే గలుగుచున్నవి.

### పూర్వదేహసంబంధగుణాదిప్రాప్తి.

శ్లో. భావితాః పూర్వదేహేషు సతతం శాస్త్రబుద్ధయః,
భవన్తి సత్త్వభూయిష్ఠాః పూర్వజాతిస్మరా నరాః.
కర్మణా చోదితో యేన తదాప్నోతి పునర్భవే,
అభ్యస్తాః పూర్వదేహే యే తానేవ భజతే గుణాన్. 56

ఇతి శ్రీ సుశ్రుతాచార్యవిరచితే ఆయుర్వేదశాస్త్రే సుశ్రుతే
తృతీయే శారీరస్థానే ద్వితీయోఽధ్యాయః.

గర్భస్థశిశువుచే పూర్వదేహములయందు విశేషముగ నభ్యసింపఁ బడినవియు, అంతఃకరణమునందు దృఢమైనసంస్కారములతోఁ గూడియుండునవియు నగుశాస్త్రజ్ఞాన గుణాదికములు ప్రకృతదేహమునందును ఆగర్భస్థశిశువునకు స్వభావముగనే సిద్ధించును. మఱియు గర్భము సత్త్వగుణబాహుళ్యము గలదై యుండినయెడల పూర్వజన్మమందలి

జాతిగుణాదికములం గూడ స్మరించుచుండును. పూర్వజన్మార్జితప్రారబ్ధకర్మమువలన జనన మునకుం బ్రేరితుం డైనజీవుండు ప్రకృతదేహమునందును, ఆకర్మానుగుణమైనఫలమునే యనుభవించుటయ కాక పూర్వదేహమునం దభ్యసించి యుండినగుణములనే ప్రకృత దేహమునందును బొందియుండును.

---

# తృతీయాధ్యాయము.

సూ. అథాతో గర్భావక్రాంతిశారీరం వ్యాఖ్యాస్యామః. 1

శుద్ధశుక్రార్తవములవలన గర్భము జనించుచున్నదని రెండవయధ్యాయమునం జెప్పియుంటిమి గాన శుద్ధశుక్రార్తవవివరణానంతరము గర్భాశయమునందు ఆత్మ ప్రకృతి యనువానితో వ్యాప్తమైయుండునట్టి శుక్రార్తవములయొక్క సంయోగరూపమైన గర్భముయొక్క అవక్రాంతి (గర్భాశయమునందు శుక్రార్తవములు చక్కగం బ్రవేశించి ఘనీభావమునుజెంది యాకృతిని బొందుట) శారీరము నిఁక వివరించెదము.

## శుక్రార్తవస్వరూపవివరణము.

సూ. సౌమ్యం శుక్రమార్తవమాగ్నేయ, మితరేషామప్యత్ర భూ
తానాం సాన్నిధ్యమస్త్యణునా విశేషేణ పరస్పరోపకారాత్పర
స్పరానుగ్రహాత్పరస్పరానుప్రవేశాచ్చ. 2

శుక్రము ఉదకగుణవిశేషముకలదిగను, ఆర్తవము తేజోగుణవిశేషము కలదిగను ఉండును. అయిన నట్టిశుక్రశోణితములందు నితరములగు పృథివి, వాయువు, ఆకాశము అను నీ భూతములు పరస్పరోపకారమువలనను పరస్పరానుగ్రహమువలనను పరస్పరానుప్రవేశమువలనను సూక్ష్మరూపముతో సంబంధించియుండుటవలన గర్భవిషయమునం దన్య భూతసంబంధముకూడ కలదని తెలియవలెను. *

---

* "పరస్పరోపకార పరస్పరానుగ్రహపరస్పరానుప్రవేశవివరణం బెట్లన:— పృథివి స్వనిష్ఠధారణగుణముచే స్వవ్యతిరిక్తమైన ఉదకాది నాలుగుభూతములకును, ఉదకము స్వకీయమైన సంభరణగుణముచే స్వవ్యతిరిక్తమైన పృథివి మొదలగు నాలుగు భూతములకును, తేజస్సు స్వనిష్ఠమైన పరిపాకకరణరూపగుణముచే స్వవ్యతిరిక్తమైన పృథివి ఉదకము వాయువు ఆకాశము అను నాలుగుభూతములకును, వాయువు స్వనిష్ఠమైన యాకారకల్పనగుణముచే స్వవ్యతిరిక్తమైన యాకాశము పృథివి ఉద కము తేజస్సు అను నాలుగుభూతములకును, ఆకాశముస్వనిష్ఠమైన అవకాశప్రదాన గుణముచే స్వవ్యతిరిక్తమైన పృథివ్యాది నాలుగుభూతములకును పరస్పర ముపకా

## గర్భోత్పత్తిస్వరూపము.

తత్ర స్త్రీపుంసయోస్సంయోగే తేజశ్శరీరాద్వాయురుదీర
తి, తత స్తేజోఽనిలసన్నిపాతాచ్ఛుక్రం చ్యుతం యోని
ఁ ప్రతిపద్యతే, సంసృజ్యతే చార్తవేన, తతోఽగ్నిసోమసం
ాగాత్సంసృజ్యమానో గర్భో గర్భాశయమను ప్రతిపద్యతే.
త్రజ్ఞో వేదయితా స్పృష్టా ఘ్రాతా ద్రష్టా శ్రోతా రస
తా పురుష స్స్రష్టా గన్తా సాక్షీ ధాతా వక్తా యోఽసా
శ్యేవమాదిభిః పర్యాయవాచకైర్నామభిరభిధీయతే దైవసం
ాగాదక్షయోఽవ్యయోఽచిన్త్యో భూతాత్మనా సహాన్వ
ం సత్వరజస్తమోభిర్దేవాసురైరపరైశ్చ భావైర్వాయునాఽ
శ్రీర్యమాణో గర్భాశయమనుప్రవిశ్యావతిష్ఠతే. 3

స్త్రీపురుషులు పరస్పరాలింగనాదులయం దిచ్ఛగలవారై సంభోగమునందుఁ
ుంచునపుడు వారిరువురియొక్క కర్మేంద్రియసంఘర్షణమువలన జనించు ఊష్మ
ాతము ప్రకోపింపఁజేయును. పిదప సూక్ష్మవాతముల సంబంధమువలన రేతస్సు
స్వస్థానమును విడిచి యోనిమధ్యమునఁబడి యోనియం దంతట వ్యాపించి ఆర్త
ఁ గలియుచున్నది. ఇటుల శుక్రార్తవములు రెండును గలసినతోడనే క్షేత్ర
(పంచమహాభూతనిర్మితం బైన స్థూలసూక్ష్మశరీరరూపక్షేత్రములం దెలిసికొను

---

నుంచున్నయవి. ఘటాదిపార్థివద్రవ్యములందు పృథివీభాగము బలిష్ఠముగ నుండు
యాపృథివి యాశ్రయప్రదానగుణముచే తనకంటె దుర్బలమైన ఉదకాది
భూతములకును, ఆప్యద్రవ్యములం దుదకభాగము బలిష్ఠముగ నుండుటం
ాయుదకము ఆశ్రయప్రదానగుణముచే తనకంటె దుర్బలమైన పృథివి
వాయువు ఆకాశము అనునాలుగుభూతములకును, తైజసద్రవ్యములందు తేజో
బలిష్ఠముగ నుండుటంజేసి యాతేజస్సు ఆశ్రయప్రదానగుణముచే తనకంటె
మైన పృథివి ఉదకము వాయువు ఆకాశము అనునాలుగుభూతములకును, వాయ
ద్రవ్యములయందు వాయుభాగము బలిష్ఠముగ నుండుటంజేసి యది ఆశ్రయ
గుణముచే ఆకాశము పృథివి ఉదకము తేజస్సు అను నాలుగుభూతములకును,
ము బలిష్ఠముగ నుండుటంజేసి యది ఆశ్రయప్రదానగుణముచేఁ దనకంటె
మైన పృథివ్యాది నాలుగుభూతములకును పరస్పరము అనుగ్రహము సేయుం
. పృథివ్యాదిపంచమహాభూతములయొక్క పరస్పరానుప్రవేశము ప్రథమా
మునందు "అన్యోన్యానుప్రవిష్టాని సర్వాణ్యేతాని నిర్దిశేత్" అను వచనమువలనఁ
ఁడియుండుప్రకారము తెలియవలయును.

జాతిగుణాదికములఁ గూడ స్మరించుచుండును. పూర్వజన్మార్జితప్రారబ్ధకర్మమువలన జననమునకుఁ బ్రేరితుఁ డైనజీవుఁడు ప్రకృతదేహమునందును, ఆకర్మానుగుణమైనఫలమునే యనుభవించుటయ కాక పూర్వదేహమునం దభ్యసించి యుండినగుణములనే ప్రకృతదేహమునందును జెందియుండును.

---

# తృతీయాధ్యాయము.

సూ. అథాతో గర్భావక్రాంతిశారీరం వ్యాఖ్యాస్యామః. 1

శుద్ధశుక్రార్తవములవలన గర్భము జనించుచున్నదని రెండవయధ్యాయమునఁ జెప్పియుంటిమి గాన శుద్ధశుక్రార్తవవివరణానంతరము గర్భాశయమునందు ఆత్మ ప్రకృతి యనువానితో వ్యాప్తమైయుండునట్టి శుక్రార్తవములయొక్క సంయోగరూపమైన గర్భముయొక్క అవక్రాంతి (గర్భాశయమునందు శుక్రార్తవములు చక్కఁగఁ బ్రవేశించి ఘనీభావమును జెంది యాకృతిని బొందుట) శారీరము నిఁక వివరించెదము.

## శుక్రార్తవస్వరూపవివరణము.

సూ. సౌమ్యం శుక్రమార్తవమాగ్నేయ, మితరేషామప్యత్ర భూతానాం సాన్నిధ్యమస్త్యణునా విశేషేణ పరస్పరోపకారాత్పరస్పరానుగ్రహాత్పరస్పరానుప్రవేశాచ్చ. 2

శుక్రము ఉదకగుణవిశేషముకలదిగను, ఆర్తవము తేజోగుణవిశేషము కలదిగను ఉండును. అయిన నట్టిశుక్రశోణితములందు నితరములగు పృథివి, వాయువు, ఆకాశము అనునీ భూతములు పరస్పరోపకారమువలనను పరస్పరానుగ్రహమువలనను పరస్పరానుప్రవేశమువలనను సూక్ష్మరూపముతో సంబంధించియుండుటవలన గర్భవిషయమునం దన్యభూతసంబంధముకూడ కలదని తెలియవలెను. *

---

* "పరస్పరోపకార పరస్పరానుగ్రహపరస్పరానుప్రవేశవివరణం బెట్లన:— పృథివి స్వనిష్ఠధారణగుణముచే స్వవ్యతిరిక్తమైన ఉదకాది నాలుగుభూతములకును, ఉదకము స్వకీయమైన సంభరణగుణముచే స్వవ్యతిరిక్తమైన పృథివి మొదలగు నాలుగు భూతములకును, తేజస్సు స్వనిష్ఠమైన పరిపాకకరణరూపగుణముచే స్వవ్యతిరిక్తమైన పృథివి ఉదకము వాయువు ఆకాశము అను నాలుగుభూతములకును, వాయువు స్వనిష్ఠమైన యాకారకల్పనగుణముచే స్వవ్యతిరిక్తమైన యాకాశము పృథివి ఉదకము తేజస్సు అను నాలుగుభూతములకును, ఆకాశముస్వనిష్ఠమైన అవకాశప్రదానగుణముచే స్వవ్యతిరిక్తమైన పృథివ్యాది నాలుగుభూతములకును పరస్పర ముపకా

## గర్భోత్పత్తిస్వరూపము.

౩. తత్ర స్త్రీపుంసయోస్సంయోగే తేజశ్శరీరాద్వాయురుదీరయతి, తత స్తేజోఽనిలసన్నిపాతాచ్ఛుక్రం చ్యుతం యోనిమభి ప్రతిపద్యతే, సంసృజ్యతే చార్తవేన, తతోఽగ్నిసోమసంయోగాత్సంసృజ్యమానో గర్భో గర్భాశయమను ప్రతిపద్యతే. క్షేత్రజ్ఞో వేదయితా స్పృష్టా ఘ్రాతా ద్రష్టా శ్రోతా రసయితా పురుష స్స్రష్టా గన్తా సాక్షీ ధాతా వక్తా యోఽసావిత్యేవమాదిభిః పర్యాయవాచకైర్నామభిరభిధీయతే దైవసంయోగాదక్షయోఽవ్యయోఽచిన్త్యో భూతాత్మనా సహాన్వక్షం సత్వరజస్తమోభిర్దేవాసురైరపరైశ్చ భావైర్వాయునాఽభిప్రేర్యమాణో గర్భాశయమనుప్రవిశ్యావతిష్ఠతే. 3

స్త్రీపురుషులు పరస్పరాలింగనాదులయం దిచ్ఛగలవారై సంభోగమునందుఁ
వర్తించునపుడు వారిరువురియొక్క కర్మేంద్రియసంఘర్షణమువలన జనించు ఊష్మ
ను వాతము ప్రకోపింపఁజేయును. పిదప నూష్మవాతముల సంబంధమువలన రేతస్సు
వించి స్వస్థానమును విడిచి యోనిమధ్యమునఁబడి యోనియం దంతట వ్యాపించి ఆర్త
వతోఁ గలియుచున్నది. ఇటుల శుక్రార్తవములు రెండును గలసినతోడనే క్షేత్ర
డు (పంచమహాభూతనిర్మితం బైన స్థూలసూక్ష్మశరీరరూపక్షేత్రములం దెలిసికొను

---

ు సేయుచున్నయవి. ఘటాదిపార్థివద్రవ్యములందు పృథివీభాగము బలిష్ఠముగ నుండు
ంజేసి యాపృథివి యాశ్రయప్రదానగుణముచే తనకంటె దుర్బలమైన ఉదకాది
లుగు భూతములకును, అప్యద్రవ్యములం దుదకభాగము బలిష్ఠముగ నుండుటం
యాయుదకము ఆశ్రయప్రదానగుణముచే తనకంటె దుర్బలమైన పృథివి
జస్సు వాయువు ఆకాశము అను నాలుగుభూతములకును, తైజసద్రవ్యములందు తేజో
గము బలిష్ఠముగ నుండుటంజేసి యాతేజస్సు ఆశ్రయప్రదానగుణముచే తనకంటె
ర్బలమైన పృథివి ఉదకము వాయువు ఆకాశము అనునాలుగుభూతములకును, వాయ
వ్యద్రవ్యములయందు వాయుభాగము బలిష్ఠముగ నుండుటంజేసి యది ఆశ్రయ
ప్రదానగుణముచే ఆకాశము పృథివి ఉదకము తేజస్సు అను నాలుగుభూతములకును,
కాశము బలిష్ఠముగ నుండుటంజేసి యది ఆశ్రయప్రదానగుణముచేఁ దనకంటె
ర్బలమైన పృథివ్యాది నాలుగుభూతములకును పరస్పరము అనుగ్రహము సేయుఁ
న్నవి. పృథివ్యాదిపంచమహాభూతములయొక్క పరస్పరానుప్రవేశము ప్రథమా
ధ్యాయమునందు "అన్యోన్యానుప్రవిష్టాని సర్వాణ్యేతాని నిర్దిశేత్" అను వచనమువలనఁ
స్పష్టంబడియుండుప్రకారము తెలియవలయును.

వాఁడు) వేదయిత (మనస్సువలన సుఖదుఃఖాదుల నెఱుంగువాఁడు) స్ప్రష్ట (త్వగింద్రియమువలన స్పర్శము నెఱుంగువాఁడు) ఘ్రాత (ఘ్రాణేంద్రియమువలన గంధము నెఱుంగువాఁడు) ద్రష్ట (చక్షురింద్రియమువలన రూపాదుల నెఱుంగువాఁడు) శ్రోత (శ్రోత్రేంద్రియమువలన శబ్దము నెఱుంగువాఁడు) రసయిత (రసనేంద్రియముచే మధురాదిరసముల నెఱుంగువాఁడు) పురుషుఁడు (శరీరమున వసించువాఁడు) స్రష్ట ('చేతనావాన్యతశ్చాత్మాతతఃకర్తా నిరుచ్యతే' అను ప్రమాణమునుబట్టి చేతనావంతుఁ డగుటవలన కర్తృత్వము గలవాఁడు) గంత (సంచరించువాఁడు) సాక్షీ (సర్వంబును జూచువాఁడు) ధాత (శరీరాదుల ధరించువాఁడు) వక్త (సంభాషణము సేయువాఁడు) ఈ మొదలగు పర్యాయనామములచే వ్యవహరింపఁబడునట్టియు, అంతటను వ్యాపించియుండునట్టియు, సద్రూపదేశము లేక దెలిసికొనఁదగనట్టియు నైనజీవుండు అక్షయుండును, అలయుండును, మనంబుచేఁ దెలిసికొనుట కశక్యుండునైనను ప్రాకృతకర్మసంబంధమువలన సత్వరజస్తమోరూప ప్రకృతిగుణములతోడను, బ్రహ్మ, మహేంద్రుఁడు, వరుణుఁడు, కుబేరుఁడు, గంధర్వులు, యముఁడు, ఋషులు అను దేవతలయొక్క సాత్వికభావముతోడను, లేక అసురులు, సర్పములు, పక్షులు, రాక్షసులు, పిశాచములు, ప్రేతములు అను అసురగుణములైన రాజసభావముతోడను, లేక పశువులు, మత్స్యములు, వనస్పతులు అనువానియొక్క గుణములైన తామసభావముతోడను గూడినవాఁడై వాతమువలనఁ బ్రేరితుఁడై సూక్ష్మమైన లింగశరీరముతోడ శుక్రశోణితసంయోగస్థానమైన గర్భాశయమునందుఁ బ్రవేశించి గర్భరూపముగ నుండును.

## స్త్రీపురుషాదిజననకారణము.

సూ. తత్ర శుక్రబాహుళ్యాత్పుమా, నార్తవబాహుళ్యాత్స్త్రీ, సామ్యాదుభయోర్నపుంసకమితి. 4

స్త్రీపురుషసంయోగకాలమునందు శుక్ర మధికముగ నుండినయెడల పురుషుఁడును, ఆర్తవ మధికంబుగ నుండినయెడల స్త్రీయును, శుక్రార్తవములసమత్వమువలన నపుంసకుఁడును జనించును.

## ఋతుకాలవివరణము.

సూ. ఋతుస్తు ద్వాదశరాత్రం భవతి దృష్టార్తవః. అదృష్టార్తవాప్య స్త్రీత్యేకే భాషన్తే. 5

దృష్టార్తవ యగు స్త్రీకి ఋతుస్నానము చేసినదిమొదలు పండ్రెండు దినముల వఱకు ఆర్తవము దృశ్యంబగుచుండును. కావుననే యాపండ్రెండుదినములు ఋతుకాలమనియెదరు. "ఋతుష్షోడశరాత్రయః" ఋతుకాలము పదునాఱుదినములని గ్రంథాంతరములందుఁ జెప్పఁబడియుండినను రజోదర్శనమైనది మొదలు మూఁడుదినములును,

యోనిసంకోచకాలమైన కడపటి పదునాఱవదినమును గర్భధారణ కనర్హమైన కాలమగుటచే ఋతుకాలము పండ్రెండుదినములని తెలియవలయును. కొందఱుస్త్రీలకు ఆర్తవము కనుపించకపోయినను క్రిందఁ జెప్పఁబడు ఋతుమతీలక్షణము లుండినయెడల వారికిని ఋతుకాలము కలదని కొందఱాచార్యులు వచించుచున్నారు.

## ఋతుమతీలక్షణము.

భవన్తి చాత్ర —

పీనప్రసన్నవదనాం ప్రక్లిన్నాత్మముఖద్విజామ్,
నరకామాం ప్రియకథాం స్రస్తకుక్ష్యక్షిమూర్ధజామ్.
స్ఫురద్భుజకుచశ్రోణినాభ్యూరుజఘనస్ఫిచమ్,
హర్షౌత్సుక్యపరాం చాపి విద్యాదృతుమతీమితి.
నియతం దివసేఽతీతే సఙ్కుచత్యమ్బుజం యథా,
ఋతౌ వ్యతీతే నార్యాస్తు యోనిస్సంవ్రియతే తథా.
మాసేనోపచితం కాలే ధమనీభ్యాం తదార్తవమ్,
ఈషత్కృష్ణం విగన్ధం చ వాయుర్యోనిముఖం నయేత్.
తద్వర్షాద్ద్వాదశాత్కాలే వర్తమానమసృక్స్రవః,
జరాపక్వశరీరాణాం యాతి పఞ్చాశతః క్షయమ్. 6

ముఖము ఉన్నతముగను ప్రసన్నముగను గనుపించుట, శరీరము, ముఖము, దంతములు మిక్కిలి చల్లగనుండుట, పురుషసంబంధమందును కామసంబంధ మగువాక్యములయందును యిచ్ఛ గలిగియుండుట, కడుపు, కన్నులు, వెండ్రుకలు ఇవి జారియుండుట, భుజములు, స్తనములు, పిఱుఁదులు, నాభి, తొడలు, జఘనము, నడుముక్రింది తొడలమీఁదిభాగము, ఇవి అదురుచుండుట, అతిసంతోషము, మైథునమం దత్యాశగలిగియుండుట, ఈలక్షణములు గలస్త్రీ ఋతుమతి యని తెలియును. ఋతుకాల మతిక్రమించగనే సూర్యాస్తమయానంతరము కమలములు ముకుళీభావమును జెందునటుల స్త్రీలకు యోని ముకుళీభావమును జెందును. కావున ఋతువ్యతిరిక్తకాలమునందు బీజప్రవేశ మగుటలేదు. స్త్రీలకు ఋతుప్రాదుర్భావకాలమగు పండ్రెండవసంవత్సరము మొదలుకొని ప్రతిమాసమునను గూడుచుండు ఆర్తవము ఒకింత నలుపువర్ణముగలిగి గంధశూన్యమై వాతసంబంధమువలన రెండుధమనులమార్గమునుండి యోనిముఖమును జెంది బైలువెడలును. రసాది సప్తధాతువులు శరీరమున వృద్ధియగుచుండునటుల స్త్రీల కార్తవము పండ్రెండవ సంవత్సరము మొదలుకొని ప్రవృత్తమై వృద్ధిఁజెంది ప్రతిమాసమునందును బైలువెడలుచుండును. మఱియు, ముదిమివలన సప్తధాతువులు శరీరమున క్షయించునటులనే స్త్రీలకు నేఁబదిసంవత్సరము లైనపిదప రజస్సుకూడ క్షయించును.

## స్త్రీసంభోగవిధానము.

యుగ్మేషు తు పుమాన్ప్రోక్తో దివసేష్వన్యథాఽబలా,
పుష్పకాలే శుచిస్తస్మాదపత్యార్థీ స్త్రియం వ్రజేత్. 7

సంభోగమున కర్హమైనఋతుకాలమునందు యుగ్మదినములగు, 4-6-8-10-12 అను నీకాలమున సంభోగమునందుఁ బ్రవర్తించినయెడల పుత్త్రుఁడును, 5-7-9-11 అను విషమదివసములందు సంభోగమునఁ బ్రవర్తించినయెడల కన్యకయును జనించును. కావున పురుషుఁడు పరిశుద్ధుఁడై పైక్రమము నెఱింగి ఋతుకాలమున సంభోగమునఁ బ్రవర్తింప వలెను. [ఈసూత్రార్థము ఈయధ్యాయమున ముందుఁజెప్పఁబడిన "తత్ర శుక్రబాహుళ్యాత్పుమా" నిత్యాది సూత్రమునకు విరోధంబుగ నున్నదని కొందఱు శంకింపవచ్చును. అయినను "యుగ్మేషు దివసేష్వాసాం భవత్యల్పతరం రజః, సంయోగం తత్ర యా గచ్ఛేత్సా పుమాంసం ప్రసూయతే. అయుగ్మేషు దినేష్వాసాం భవేద్బహుతరం రజః, సంయోగం తత్ర యాగచ్ఛేత్సా తుకన్యాంప్రసూయతే" అను విదేహావచనమువలన ఋతుకాలమునందుఁ జెప్పఁబడిన సమదివసములయందు స్త్రీలకు ఆర్తవము మిక్కిలి యల్పముగ నుండుటవలన నట్టికాలమందు సంభోగము కలిగినయెడల పురుషసంతానము, పైఁ జెప్పఁబడినవిషమ (బేసి) దినములందు స్త్రీల కార్తవము మిక్కుటముగ నుండుటవలన నట్టి కాలమునందు సంభోగము కలిగినయెడల కన్యకయు జనించునని తెలియుచున్నది. గనుక ముందుచెప్పఁబడిన "తత్రశుక్రబాహుళ్యాత్పుమా" నిత్యాది సూత్రాభిప్రాయమునకును ఈసూత్రాభిప్రాయమునకును భిన్నాభిప్రాయము లేదని స్పష్టమగుచున్నది.]

## గర్భధారణచిహ్నము.

సూ. తత్ర సద్యోగృహీతగర్భాయా లిఙ్గాని శ్రమో గ్లానిః పిపాసా సక్థి సదనం శుక్రశోణితయోరవబన్ధ స్స్ఫురణం చ యోనేః. 8

ఆయాసము, బడలిక, దప్పి, తొడలయందు బలములేకుండుట, శుక్రశోణితములు బైలువెడలకుండుట, యోని స్ఫురించుట (కొంచెము వణకిన ట్లుండుట) అను నీలక్షణములు గర్భము ధరించినతోడనే స్త్రీకిఁ గలుగును.

## గర్భిణీలక్షణము.

శ్లో. స్తనయోః కృష్ణముఖతా రోమరాజ్యుద్గమ స్తథా,
అక్షిపక్ష్మాణి చాప్యస్యాస్సంమీల్యన్తే విశేషతః.
అకామతశ్ఛర్దయతి గన్ధాదుద్విజతే శుభాత్,
ప్రసేకస్సదనం చాపి గర్భిణ్యా లిఙ్గముచ్యతే. 9

చనుమొనలు నలుపురంగుగ నుండుట, నూఁగారు ప్రకాశముగ నుండుట, కనుఱెప్ప లొకదానితో నొకటి విశేషముగఁ గలియుచుండుట, కారణములేకనే వమన

మగుట, ఉత్తమమైన గంధసేవనవలన భయమును జెందుట, నోట నీళ్లూరుట, శరీరము కృశించుట-ఇట్టిలక్షణములుగల స్త్రీ గర్భిణియని తెలియవలయును.

### గర్భిణీవర్జనీయకృత్యములు.

సూ. తదా ప్రభృత్యేవ వ్యాయామం వ్యవాయమపతర్పణమతి
కర్షణం దివాస్వప్నం రాత్రిజాగరణం శోకం యానావరోహణం
భయముత్కుటకాసనం చైకాన్తతస్స్నేహాదిక్రియాం శోణిత
మోక్షణం చాకాలే వేగవిధారణం చ న సేవేత. 10

గర్భము ధరించినది మొదలు గర్భిణిస్త్రీ శ్రమకరమైనపనులు, మైథునము, అప తర్పణము (తృప్తిగ భుజింపకుండుట), మిక్కుటముగ భుజించుట, పగటియందు నిదు రించుట, రాత్రియందు మేలుకొని యుండుట, దుఃఖించుట, బండి, గుఱ్ఱములు మొద లగువాహనములపై నెక్కుట, భయంకరమైన వానిని జూచుట, కాలుసేతులు వక్ర ముగ నునిచికొని కూర్చుండుట, ఎచ్చుతగ్గు ప్రదేశములయందుఁ గూర్చుండుట, యెని మిదవమాసముతప్ప నితరమాసములందు ఘృతాదిస్నేహములచే అనువాసనవస్తిని జేయుట, జలగలు, సొరకాయబుఱ్ఱలు మొదలగువానిచే రక్తమును దీయుట, కాలమున మల మూత్రముల నిరోధించుట, ఈక్రియలను వర్జింపవలయును.

### గర్భోపద్రవకారణము.

శ్లో. దోషాభిఘాతైర్గర్భిణ్యా యో యో భాగః ప్రపీడ్యతే,
స స భాగశ్శిశోస్తస్యా గర్భస్థస్య ప్రపీడ్యతే. 11

వాతాదిదోషములచేఁగాని, కఱ్ఱలు మొదలగువానిచే దెబ్బలు తగులుటచేఁగాని గర్భిణికి యేయేభాగములందు (యేయే అవయవములందు) వేదన గలుగునో అట్టివేదన గర్భమునందుండు శిశువునకును ఆయాయవయవములందుఁ గలుగునని తెలియఁదగు.

### ప్రథమాదిచతుర్థమాసపర్యంతగర్భస్వరూపము.

సూ. తత్ర ప్రథమే మాసి కలలం జాయతే. ద్వితీయే శీతోష్మానిలై
రభిప్రపచ్యమానానాం మహాభూతానాం సఙ్ఘాతో ఘనస్సఞ్జా
యతే; యది పిణ్డః పుమాన్, స్త్రీ చేత్పేశీ, నపుంసకం చేదర్బు
దమితి. తృతీయే హస్తపాదశిరసాం పఞ్చపిణ్డకా నిర్వర్తన్తే ఽఙ్గ
ప్రత్యఙ్గవిభాగశ్చ సూక్ష్మో భవతి. చతుర్థే సర్వాఙ్గప్రత్యఙ్గ
విభాగః ప్రవ్యక్తతరో భవతి. గర్భహృదయప్రవ్యక్తభావాచ్చేత
నాధాతురభివ్యక్తో భవతి. కస్మాత్ ? తత్స్థానత్వాత్. తస్మాద్గర్భ
శ్చతుర్థే మాస్యభిప్రాయమిన్ద్రియార్థేషు కరోతి. ద్విహృద

యాం చ నారీం దౌహృదినీమాచక్షతే. దౌహృదవిమాననా త్కుబ్జం కుణిం ఖఞ్జం జడం వామనం వికృతాక్షమనక్షం వా నారీ సుతం జనయతి. తస్మాత్సా యద్యదిచ్ఛేత్తత్తస్యై దాపయేత్. లబ్ధదౌహృదా హి వీర్యవన్తం చిరాయుషం చ పుత్త్రం జనయతి. 12

గర్భమునుధరించిన ప్రథమమాసమునందు శుక్రశోణితములు గర్భాశయమునందు కలలావస్థను జెందియుండును. ద్వితీయమాసమునందు కఫపిత్తవాతములవలన పరిపాకమును జెందిన పంచమహాభూతాత్మకమైన శుక్రశోణితసముదాయము గర్భాశయమునందు స్వల్పముగ ఘనీభావమును జెందియుండును. అట్టిగర్భము స్పర్శమువలన పిండాకారముగనుండినఁ బురుషగర్భమనియు, పేశ్యాకారముగనుండిన స్త్రీగర్భమనియు, అర్బుదాకారముగనుండిన నపుంసకగర్భమనియుఁ దెలియఁదగును. "చతురశ్రాభవేత్పేశీ వృత్తః పిండో ఘనస్మృతః, శాల్మలీముకుళాకార మర్బుదం సంప్రచక్షతే" అనువచనమువలన పేశియనునది చచ్చౌకముగ నిటికరాయివలె నుండుననియు, పిండమనునది గుండ్రముగ కఠినముగ నుండుననియు, అర్బుదమనునది బూరుగుమొగ్గవలె (గుండ్రమైన ఫలము యొక్క అర్ధభాగమువలె) నుండుననియు భోజుఁడు వచించియున్నాఁడు. తృతీయమాసమునందు గర్భమునకు పాదములు, హస్తములు, శిరస్సు అనునవి పుట్టుటకు కారణంబగు పంచపిండము లాయాస్థానములయందు జనించుచున్నవి. మఱియు నామాసమునందే హస్తములు, పాదములు, శిరస్సు మొదలగు నంగములును, చెంపలు, ముక్కు, పెదవులు, నేత్రములు, చెవులు, వ్రేళ్లు మొదలగు ప్రత్యంగములును సూక్ష్మముగ జనించుచున్నవి. చతుర్థమాసమునందు సర్వాంగప్రత్యంగములయొక్క విభాగము స్పష్టముగ నేర్పడుచున్నది. మఱియు నామాసమునందు గర్భమునకేర్పడిన హృదయము ఆత్మకు స్థానమగుట వలన దానియం దాత్మయొక్కసంబంధము కలుగుచున్నది. కావున నాచతుర్థమాసమునందు గర్భము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధస్వరూపమైన యింద్రియార్థములఁ గోరుచుండును. గర్భిణికి శిశుహృదయసంబంధముకూడ గలిగియుండుటవలన దానిని దౌహృదినియనియెదరు. గర్భిణి కోరినపదార్థముల నొసఁగకుండుటచే నాగర్భిణి-కుబ్జత్వము, ఊచచేతులు, కుంటితనము, జడత్వము, పొట్టితనము, వికారమైనదృష్టి, లేక, గ్రుడ్డితనముగల శిశువును బ్రసవించును. కావున, 'నాగర్భిణీస్త్రీ కోరెడి పదార్థముల నొసంగవలయు. అట్లుచేసిన శౌర్యము, దీర్ఘాయువు గలపుత్రునిఁ బ్రసవించును.

గర్భిణీచ్ఛాపరిపూర్తికారణము.

భవన్తి చాత్ర.—

శ్లో. ఇన్ద్రియార్థాంస్తు యాన్యాన్సా భోక్తుమిచ్ఛతి గర్భిణీ,
గర్భాబాధభయాత్తాంస్తాన్భిషగాహృత్య దాపయేత్.

సా ప్రాప్తదౌహృదా పుత్త్రం జనయేత గుణాన్వితమ్,
అలబ్ధదౌహృదా గర్భే లభేతాత్మని వా భయమ్.
యేషు యేష్విన్ద్రియార్థేషు దౌహృదే వై విమాననా,
ప్రజాయేత సుతస్యార్తిస్తస్మింస్తస్మిం స్తథేన్ద్రియే. 13

గర్భిణికి దోహదకాలమునందు శ్రోత్రేంద్రియమునకుఁ బ్రీతికరమైన గానాది శబ్దశ్రవణమునం దిచ్ఛగలిగియుండునపుడు అది లభింపనియెడల గర్భస్థశిశువునకు శ్రోత్రేంద్రియమునందు బాధ, త్వగింద్రియమునకుఁ బ్రీతికరమైన చందనాద్యనులేపన వస్త్రాలంకారాద్యుపభోగములం దిచ్ఛగలిగియుండునపు డది లభింపనియెడల గర్భస్థ శిశువునకు త్వగింద్రియమునందు బాధ, చక్షురింద్రియమునకుఁ బ్రీతికరమైన దేవతా దర్శనాదులయం దిచ్ఛగలిగియుండునపు డది లభించనియెడల గర్భస్థశిశువునకు నేత్రేంద్రియమునకు బాధ, రసనేంద్రియమునకుఁ బ్రీతికరమైన షడ్రసాన్నభక్ష్యభోజ్యాది పదార్థసేవనయం దిచ్ఛగలిగియుండునపు డది లభింపనియెడల గర్భస్థశిశువునకు రసనేంద్రియము (నాలుక)నందు బాధ, ఘ్రాణేంద్రియమునకుఁ బ్రీతికరమైన సుగంధ ద్రవ్యముల నాఘ్రాణించుటయం దిచ్ఛగలిగియుండునపు డది లభింపనియెడల గర్భస్థ శిశువునకు ఘ్రాణేంద్రియము (ముక్కు)నందు బాధ కలుగుటయేగాక గర్భిణికికూడ పీడ కలుగును. కావున, గర్భస్థశిశువుయొక్క బాధానివారణార్థమై వైద్యుఁడు గర్భిణి కోరెడిపదార్థముల నిప్పింపవలయును. అటుల మనోరథపరిపూర్తిఁజెందిన గర్భిణీస్త్రీ సద్గుణములు గల పుత్త్రునిఁ బ్రసవించును.

### దౌహృదానుగుణగర్భజననము.

శ్లో. రాజసన్దర్శనే యస్యా దౌహృదం జాయతే స్త్రియాః,
అర్థవన్తం మహాభాగం కుమారం సా ప్రసూయతే.
దుకూలపట్టకౌశేయభూషణాదిషు దౌహృదాత్,
అలఙ్కారైషిణం పుత్త్రం లలితం సా ప్రసూయతే.
ఆశ్రమే సంయతాత్మానం ధర్మశీలం ప్రసూయతే,
దేవతాప్రతిమాయాం తు ప్రసూతే పార్షదోపమమ్.
దర్శనే వ్యాళజాతీనాం హింసాశీలం ప్రసూయతే,
గోధామాంసాశనే పుత్త్రం సుషుప్సుం ధావనాత్మకమ్.
గవాం మాంసే చ మలినం సర్వక్లేశసహం తథా,
మాహిషే దౌహృదాచ్ఛూరం రక్తాక్షం లోమసంయుతమ్.
వరాహమాంసాత్స్వప్నాళుం శూరం సఞ్జనయేత్సుతమ్,

మార్గాద్వి క్రాన్తజఙ్ఘాలం సదా వనచరం సుతమ్.
సృమరాద్వ్యగ్నమనసం నిత్యభీతం చ తైత్తిరాత్,
అతోఽనుక్తేషు యా నారీ సమభిధ్యాతి దౌహృదమ్.
శరీరాచారశీలైస్సా సమానం జనయిష్యతి. 14

దౌహృదకాలమునందు రాజదర్శనమం దిచ్ఛగలగర్భిణి ధనవంతుఁడు గుణవంతుఁడు నగుపుత్త్రునిఁ గనును. సన్నని వస్త్రములు, పట్టువస్త్రములు, ఆభరణములు మొదలగువానియం దిచ్ఛగల గర్భిణి అలంకారప్రియుఁడు సుందరుఁడు నగుపుత్త్రునిఁ బ్రసవించును. ఋష్యాశ్రమ దర్శనవాసములయం దిచ్ఛగలగర్భిణి జితేంద్రియుఁడు ధర్మశీలుఁడు నగుపుత్త్రునిఁ గనును. దేవతాప్రతిమారాధనదర్శనములయం దిచ్ఛగలగర్భిణి సభాధ్యక్షుఁ డగుపుత్త్రునిఁ గనును. సర్పవ్యాఘ్రాదిక్రూరజంతుదర్శనమునం దిచ్ఛగలగర్భిణి హింసాశీలుని, ఉడుముమాంసమును భక్షించుటయం దిచ్ఛగలగర్భిణి యెల్లపుడు నిద్ర, శీఘ్రగమనముగల పుత్త్రుని, గోమాంసమునం దిచ్ఛగల గర్భిణి అశుచి సర్వదుఃఖానుభవముగల పుత్త్రుని, దున్నపోతుమాంసభక్షణమునం దిచ్ఛగల గర్భిణి శౌర్యము, నేత్రములయందు రక్తవర్ణము, శరీరమునం దధికముగ రోమములుగలపుత్త్రుని, పందిమాంసమును భుజింపఁగోరు గర్భిణి అధిక నిద్ర, శౌర్యముగలపుత్త్రుని, జింకమాంసమును దినఁగోరు గర్భిణి వేగముగ నడచుట కనువగు పిక్కలుగలిగినట్టియు, నెల్లప్పుడు నడవియందు సంచరించుస్వభావముగలిగినట్టియు, పుత్త్రుని, దుప్పిమాంసమును దినఁగోరు గర్భిణి దుఃఖశీలుఁడు లేక చంచలుఁడగు పుత్త్రుని, తిత్తిరిపక్షిమాంసమును దినఁగోరు గర్భిణి యెల్లపుడు భయంపడు స్వభావముగల పుత్త్రునిఁ బ్రసవించును. పైనఁ జెప్పఁబడినపదార్థములకంటె నితరపదార్థములయం దిచ్ఛగలగర్భిణి ఆయాపదార్థములతో సమానమైన శరీరాచారస్వభావములుగల కుమారునిఁ బ్రసవించును.

### పూర్వకర్మానుగుణదౌహృదము.

శ్లో. కర్మణా చోదితం జన్తోర్భవితవ్యం పునర్భవేత్,
యథా తథా దైవయోగాద్దౌహృదం జనయేద్ధృది. 15

దౌహృదకాలమునందు గర్భమందుండు జీవునియొక్క ప్రారబ్ధకర్మానుగుణమైన కోరికలు దైవవశమువలన గర్భిణికిఁ గలుగుచున్నవి.

### పంచమమాసాదిగర్భస్వరూపవివరణము.

సూ. పఞ్చమే మనః ప్రతిబుద్ధతరం భవతి. షష్ఠే బుద్ధిః. సప్తమే సర్వాఙ్గప్రత్యఙ్గవిభాగః ప్రవ్యక్తతరః. అష్టమేఽస్థిరం భవత్యోజస్తత్ర జాతశ్చేన్న జీవేన్నిరోజస్త్వాత్ నైరృతభాగత్వాచ్చ

తతో బలిం మాంసౌదనమస్మై దాపయేత్. నవమదశమైకాదశ ద్వాదశానామన్యతమస్మి జ్ఞాయతే. అతోఽన్యథా వికారీ భవతి.

ఐదవమాసమునందు మనస్సు, ఆఱవమాసమునందు బుద్ధి, ఏడవమాసమునందు హస్తపాదాద్యంగములవిభాగము, నాసికము, వ్రేళ్లు, కేశములు మొదలగు ప్రత్యంగములవిభాగము స్పష్టముగ నేర్పడుచున్నది. యెనిమిదవమాసమునందు హృదయస్థానమందు సర్వధాతువులకు తేజోరూపమయిన ఓజస్సు అస్థిరముగనుండును గాన నా యెనిమిదవమాసమునందు జనించువాఁడు రాక్షసులకు భాగార్హుఁడుగాన జీవించుట దుర్లభము. దానంజేసి తద్దోషనివారణార్థము బాలురరక్షణవిషయంబై కుమారతంత్రమునందుఁ జెప్పఁబడియుండు విధిప్రకారము రాక్షసులకు మాంసౌదనమునుగాని, లేక, మాషౌదనమునుగాని బలి యియ్యవలయును. గర్భిణీస్త్రీ తొమ్మిది, పది, పదునొకండు, పండ్రెండు, అను నీమాసములలో దేనియందేని ప్రసవించును. అటుకాదేని గర్భస్థశిశువున కేదైన నొకవికారము కలుగును.

## గర్భవృద్ధివివరణము.

సూ. మాతుస్తు ఖలు రసవహాయాం నాడ్యాం గర్భనాభినాడీ ప్రతిబద్ధా సాస్య మాతురాహారరసవీర్యమభివహతి. తేనోపస్నేహేనాస్యాభివృద్ధిర్భవతి. అసఞ్జాతాఙ్గప్రత్యఙ్గప్రవిభాగమానిషేకాత్ప్రభృతి సర్వశరీరావయవానుసారిణీనాం రసవహానాం తిర్యగ్గతానాం ధమనీనాముపస్నేహో జీవయతి. 17

గర్భాధానము మొదలుకొని అంగప్రత్యంగవిభాగకాలమైన నాలవమాసమువఱకు గర్భిణియొక్క సర్వశరీరావయవములయందు నడ్డముగ వంకరగ వ్యాపించియుండునట్టి రసవహధమనులయందలి యన్నాదిరసము, నద్యాదులనీటిచెమ్మ తీరమందుండువృక్షమును వృద్ధిఁజేయుచుండంబున అంగప్రత్యంగవిభాగముకాని గర్భస్థపిండమును ఉపస్నేహముచేఁ బోషించుచుండును. పైఁ జెప్పిన యంగప్రత్యంగవిభాగానంతరము తల్లియొక్క రసవహనాడి (గర్భాశయమున కుపరిభాగమునందుండుధమని) యందు గర్భస్థశిశువుయొక్క నాభినాడి (నాభియందు వ్యాపించుసిరలతో చుట్టియుండునాడి) కట్టఁబడియుండుటచే తల్లివలన భక్షింపఁబడినవీర్యముతోఁ గూడియుండునాహారరసము, ఆనాభిమార్గముగ గర్భస్థశిశుశరీరమును వృద్ధిఁజేయుచుండును. ఈ విషయమునందు భోజుఁడు "గర్భే రుణద్ధి స్రోతాంసి రసరక్తవహాని వై, రక్తాజ్జరాయుర్భవతి నాడీ చైవ రసాత్మికా. సా నాడీ గర్భమాప్నోతి తథా గర్భస్య వర్తనమ్, యద్యదశ్నాతి మాతాస్య భోజనం హి చతుర్విధమ్. తస్మాదత్రాద్రసీభూతం వీర్యం త్రేధా ప్రవర్తతే, భాగశ్శరీరం

పుష్ణాతి స్తన్యం భాగేన వర్ధతే. గర్భః పుష్యతి భాగేన వర్ధతే చ యథాక్రమం, గర్భం కుల్యేవ కేదారం నాడీ ప్రీణాతి తర్పితా” గర్భము తల్లియొక్క రసరక్తములవహించెడి సిరల నడ్డగించుటవలన నారక్తనాడి జరాయురూపముగను, రసనాడి గర్భస్థశిశునాభి బద్ధముగనై గర్భమును జెంది గర్భము నిటునటు చలింపనీయక దృఢముగఁ జుట్టుకొని యుండుటయె కాక తల్లి భుజించు ఖాద్య, లేహ్య, పేయ, చోష్యాత్మక చతుర్విధాన్న రసము మూఁడువిభాగములుగనై యందొకభాగము తల్లియొక్క శరీరపోషణమును, రెండవ భాగము స్తన్యవృద్ధిని, మూఁడవభాగము “నీళ్లు కాలవమార్గముగ క్షేత్రమును జెంది యందలి సస్యమును వృద్ధిఁజేయుభంగి” పూర్వోక్త నాభినాడిమార్గముగను గర్భమును జెంది దానిని క్రమక్రమముగ వృద్ధిచేయుచుండును అని చెప్పియున్నాఁడు.

## గర్భాశయవోత్పత్తిక్రమము.

సూ. గర్భస్య హి సమ్భవతః పూర్వం శిరస్సమ్భవతీత్యాహ శౌనక శ్శిరోమూలత్వాద్దేహేన్ద్రియాణామ్. హృదయమితి కృతవీర్యో బుద్ధేర్మనసశ్చ స్థానత్వాత్. నాభిరితి పారాశర్యస్తతో హి వర్ధతే దేహో దేహినః, పాణిపాదమితి మార్కణ్డేయస్తన్మూలత్వాచ్చేష్టాయా గర్భస్య. మధ్యశరీరమితి సుభూతిర్గౌతమస్త న్నిబద్ధత్వాత్సర్వగాత్రసమ్భవస్య. తత్తు న సమ్యక్; సర్వాణ్యఙ్గప్రత్య ఙ్గాని యుగపత్సంభవన్తీత్యాహ ధన్వన్తరిర్గర్భస్య సూక్ష్మత్వా న్నోపలభ్యన్తే వంశాఙ్కురవచ్చూతఫలవచ్చ. తద్యథా.— చూతఫలే పరిపక్వే కేసర †మాంసాస్థిమజ్జానః పృథగ్దృశ్యన్తే కాలప్రకర్షాత్తాన్యేవ తరుణేనోపలభ్యన్తే సూక్ష్మత్వాత్తేషాం సూక్ష్మాణాం కేసరాదీనాం కాలః ప్రవ్యక్తతాం కరోతి. ఏతే నైవ వంశాఙ్కురోఽపి వ్యాఖ్యాతః. ఏవం గర్భస్య తారుణ్యే సర్వేష్వఙ్గప్రత్యఙ్గేషు సత్స్వపి సౌక్ష్మ్యాదనుపలబ్ధిః, తాన్యేవ కాలప్రకర్షాత్ప్రవ్యక్తాని భవన్తి. 18

తా. దేహేంద్రియములకు శిరము ప్రధానమగుటచే గర్భస్థపిండమునకుఁ దొలుత శిరస్సు జనించునని శౌనకుఁడును, బుద్ధిమనంబులకు హృదయస్థానమగుటవలనఁ దొలుత హృదయము జనించునని కృతవీర్యుఁడును, ప్రాణులశరీరము నాభివలన వృద్ధిఁజెందుటచే నాభియే తొలుత జనించునని పారాశర్యుఁడును, గర్భముయొక్క సమస్తచేష్టలకు హస్తపాదములు కారణమగుటచేఁ దొలుత పాణిపాదంబులే జనించునని మార్కం

† ‘రసాస్థి’ యని పాఠాంతరము.

దేయుండును, సర్వశరీరోత్పత్తికి మధ్యశరీరమే ముఖ్యకారణమగుటవలనఁ దొలుత మధ్యశరీరము జనించునని గౌతమపుత్రుఁడగు సుభూతియును వచించిరి. అయినను, వెదురుమొలకలు, మామిడిపండ్లు అనువానియందలి కేసరములు, రసము, విత్తనము, జీడి మొదలగునవి పరిపక్వమైన పిదప స్పష్టముగ గానంబడుచుండినను తారుణ్యదశ యందు అతిసూక్ష్మంబు లగుటవలన దృశ్యంబుగాక నంతర్గతంబై యుండుచందంబున, శిరఃపాణి పాదాద్యంగంబులును, చక్షుశ్శ్రోత్రాది ప్రత్యంగములును, ఏక కాలమునందు గర్భపిండమునందు జనించియుండినను నవి యతిసూక్ష్మంబు లగుటవలన దృశ్యంబు గాక కాలాంతరమున దృశ్యం బగుచుండును. కావున గర్భోత్పత్తికాలమునందే గర్భస్థపిండ మునకు సర్వాంగ ప్రత్యంగములు నేకకాలమునందే ధన్వంతరి వచించియుండుటచే పై శౌనకాదిమతంబులన్నియు నయుక్తికములు కావని సుశ్రుతాచార్యుఁడు వచించు చున్నాఁడు.

సూ. తత్ర గర్భస్య పితృజమాతృజరసజాత్మజసత్వజసాత్మ్యజాని శరీరలక్షణాని వ్యాఖ్యాస్యామః. 19.

పైఁ జెప్పఁబడినగర్భమునకు తండ్రివలన, తల్లివలన, రసమువలన, ఆత్మవలన, సత్త్వమువలన, సాత్మ్యమువలన జనించునట్టిశరీరలక్షణముల వివరించెదము.

గర్భముయొక్క పైతృకగుణములు.

సూ. గర్భస్య కేశశ్మశ్రులోమాస్థినఖదన్తసిరాస్నాయుధమనీరేతః ప్రభృతీని స్థిరాణి పితృజాని. 20

గర్భమునకు వెండ్రుకలు, మీసములు, శరీరరోమములు, ఎముకలు, గోళ్లు, దంతములు, సిరలు, స్నాయువులు, ధమనులు, శుక్రము మొదలగు కఠినపదార్థములు తండ్రివలనఁ గలుగును.

గర్భమునకు మాతృజనితగుణములు.

సూ. మాంసశోణితమేదోమజ్జాహృన్నాభియకృత్ప్లీహాన్త్రగుదప్రభృతీని మృదూని మాతృజాని. 21

గర్భమునకు మాంసము, రక్తము, మేదస్సు, మజ్జ (మూలగ), హృదయము, నాభి, యకృత్తు, ప్లీహము, ఆంత్రములు, గుదము మొదలగు మృదుపదార్థములు తల్లి వలనఁ గలుగును.

గర్భమునకు రసజనితగుణములు.

సూ. శరీరోపచయో బలం వర్ణస్థితిర్హానిశ్చ రసజాని. 22

శరీరమునకు వృద్ధి, బలము, కాంతి, స్థితి, హాని మొదలగునవి రసమువలనఁ గలుగును.

### ఆత్మజనితగుణములు.

సూ. ఇన్ద్రియాణి జ్ఞానం విజ్ఞానమాయుస్సుఖదుఃఖాదికం చాత్మ జాని. సత్త్వజాన్యుత్తరం వక్ష్యామః. 23

ఇంద్రియములు, జ్ఞానము, విజ్ఞానము, ఆయుష్యము, సుఖము, దుఃఖము మొదలగునవి యాత్మజనితంబులు. సత్త్వజలక్షణములు ఉత్తరత్ర చెప్పఁబడును.

### సాత్మ్యజనితగుణములు.

సూ. వీర్యమారోగ్యం బలవర్ణౌ మేధా చ సాత్మ్యజాని. 24

పరాక్రమము, ఆరోగ్యము, బలము, వర్ణము, మేధ మొదలగునవి సాత్మ్యజనితంబులు.

### స్త్రీపురుషప్రసూతిచిహ్నము.

సూ. తత్ర యస్యా దక్షిణే స్తనే ప్రాక్పయోదర్శనం భవతి, దక్షిణాక్షిమహత్వాచ్చ పూర్వం చ దక్షిణం సక్థ్యుత్కర్షతి, బాహుల్యాచ్చ పున్నామధేయేషు ద్రవ్యేషు దౌహృదమభిధ్యాయతి, స్వప్నేషు చోపలభతే పద్మోత్పలకుముదామ్రాతకాదీని పున్నామాన్యేవ, ప్రసన్నముఖవర్ణా చ భవతి, తాం బ్రూయాత్పుత్రమియం జనయిష్యతీతి. తద్విపర్యయే కన్యామ్. 25

మొదట దక్షిణస్తనమునందు క్షీరమగుపడుట, కుడికనుబొమ పెద్దదగ నగుపడుట, తొలుత కుడితొడ గర్భభారముచే నుబ్బియుండునటు లగుపడుట, పురుషవాచకములైన అశ్వము, మామిడి, ఏనుఁగు మొదలగువానియం దిచ్ఛగలుగుట, స్వప్నమునందు కమలములు, నల్లకలువలు, తెల్లకలువలు, మామిడిపండ్లు మొదలగు పున్నామధేయద్రవ్యములఁ గాంచుట, ముఖమెల్లప్పుడు ప్రసన్నముగనుండుట-ఇట్టిలక్షణములు గల గర్భిణీస్త్రీ పుత్రునిఁ బ్రసవించును. పైలక్షణములకంటె విపరీతలక్షణములుగలది కన్యకను బ్రసవించును.

### నపుంసకగర్భచిహ్నము.

సూ. యస్యాః పార్శ్వద్వయమున్నతం పురస్తాన్నిర్గతముదరం ప్రాగభిహితలక్షణం చ తస్యా నపుంసకమితి విద్యాత్. 26

ఉభయపార్శ్వము లున్నతములై కడుపు ముందుకు వెడలి పైఁజెప్పినలక్షణములతోఁ గూడియుండుస్త్రీ నపుంసకుని గనును.

### యమళగర్భచిహ్నము.

సూ. యస్యా మధ్యే నిమ్నం ద్రోణీప్రభూతముదరం సా యుగ్మం ప్రసూయత ఇతి. 27

ఏగర్భిణీస్త్రీకి కడుపుమధ్యభాగము పల్లమైనదానివలెఁ గనుపించెడినో, అట్టిస్త్రీ యమడబిడ్డలఁ బ్రసవించును. మఱియొక గ్రంథమున—"రోమరాజిర్భవేన్నిమ్నా యస్యాస్సా సూయతే యమౌ" నూగారు పల్లముగ నగుపడుచుండుస్త్రీ యమడలఁ గనునని చెప్పఁబడి యున్నది.

శ్లో. దేవతాబ్రాహ్మణపరాశ్శౌచాచారహితే రతాః,
మహాగుణాన్ప్రసూయన్తే విపరీతాస్తు నిర్గుణాన్. 28

దేవతాదర్శనము, బ్రాహ్మణపూజ, దంతధావనాదిశుచిత్వము, సదాచారము అనువానియం దాసక్తిగల గర్భిణి ప్రశస్తగుణములు గలపుత్రులఁ బ్రసవించును. పైలక్షణములకంటె విరుద్ధాచారముగల గర్భిణి దుర్గుణములు గలపుత్రులఁ బ్రసవించును.

గర్భమునకు పంగుత్వాదికారణము.

అఙ్గప్రత్యఙ్గనిర్వృత్తిస్స్వభావాదేవ జాయతే,
అఙ్గప్రత్యఙ్గనిర్వృత్తౌ యే భవన్తి గుణాగుణాః,
తే తే గర్భస్య విజ్ఞేయా ధర్మాధర్మనిమిత్తజాః. 29

ఇతి శ్రీసుశ్రుతాచార్యవిరచితే ఆయుర్వేదశాస్త్రే సుశ్రుతే
తృతీయే శారీరస్థానే తృతీయోఽధ్యాయః.

హస్తపాదాద్యంగంబులు, అంగుళ్యాదిప్రత్యంగములు గర్భపిండమునకు స్వభావముగ జనించుచుండినను గర్భస్థశిశువునకు నాయంగప్రత్యంగములయందు సౌందర్యాదిగుణములు, కుబ్జత్వాదిదుర్గుణములు పూర్వజన్మార్జితపుణ్యపాపములవలనఁ గలుగును.

---

# చతుర్థాధ్యాయము.

సూ. అథాతో గర్భవ్యాకరణం నామ శారీరం వ్యాఖ్యాస్యామః. 1

రెండవయధ్యాయమున సంగ్రహముగఁ జెప్పఁబడిన గర్భమును మరల విస్తరముగ గర్భవ్యాకరణమను నీయధ్యాయమునందు వివరించెదము.

గర్భప్రాణవివరణము.

సూ. అగ్నిస్సోమో వాయుస్సత్త్వం రజస్తమః పఞ్చేన్ద్రియాణి భూతాత్మేతి ప్రాణాః. 2

అగ్ని (పిత్తము), సోముఁడు (శ్లేష్మ), వాయువు, సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము, చక్షురాదిపంచజ్ఞానేంద్రియములు, భూతాత్మ అనునవి శరీరపోషణము

నకును, శరీరకాంతిమొదలగువానికిని కారణమగుటవలన ప్రాణములని చెప్పంబడును. ఏల ననఁగ ? సర్వధాతుగతోష్మమునకును శక్తినిచ్చునట్టి పాచక, భ్రాజక, ఆలోచక, రంజక, సాధకములను నైదువిధము లైన భౌతికోష్మముల కధిదైవత మైనయగ్ని యాహార పాకాదులచే శరీరపోషణమును జేయుచుండును. శ్లేష్మము, రసము, శుక్రము, మొద లగు రసాత్మకపదార్థములకును, రసనేంద్రియమునకును శక్తినిచ్చునట్టి మనస్సున కధి దైవత మైనచంద్రుఁడు సౌమ్యధాతుసారభూతమైన ఓజస్సు మొదలగువానివృద్ధిని, శరీర పోషణమును సేయుచుండును. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములను నైదు విధములైన వాయువు వాతపిత్తకఫములయొక్క మలమును, సప్తధాతువులయొక్క మలా దులను బోకడచి ఉచ్ఛ్వాసనిశ్వాసములచే శరీరపోషణమును సేయుచుండును. పైనఁ జెప్పఁబడిన యష్టవిధప్రకృతిగుణము లైనసత్త్వరజస్తమోగుణములు మనోరూపముగఁ బరిణమించి కర్మపురుషుని శరీరోత్పత్తికి కారణమై శరీరపోషణమును సేయుచుండును. శ్రోత్రాదిపంచజ్ఞానేంద్రియములు శబ్దాదివిషయగ్రహణమువలన శరీరపోషణమును సేయుచుండును. భూతాత్మ (కర్మపురుషుఁడు) సర్వావయవములకును, చైతన్యమున కును కారణమై శరీరపోషణమును సేయుచుండును. [గర్భమునకు వర్ణనీయము లగు చర్మము మొదలైనవానిలో ప్రాణము సర్వశరీరపోషణమునకు ముఖ్యంబగుటవలన నిచట ముందుగ ప్రాణము వివరింపఁబడెను.]

### సప్తత్వగుత్పత్తివివరణము.

సూ. తస్య ఖల్వేవం ప్రవృత్తస్య శుక్రశోణితస్యాభిపచ్యమానస్య క్షీర స్యేవ సన్తానికాస్సప్త త్వచో భవన్తి. 3

పైనఁ జెప్పఁబడిన ప్రాణములను అగ్న్యాద్యులసంయోగముచే పక్వమును జెందు నట్టి శుక్రశోణితములవికారమువలన "కాచఁబడినపాలయందు మీగడ మొదలగునవి జనించుభంగి" శరీరముపై సప్త త్వక్కు (చర్మము)లు జనించును.

### సప్తవిధత్వక్కులలక్షణము.

సూ. తాసాం ప్రథమాఽవభాసినీ నామ, యా సర్వవర్ణానవభాసయతి పఞ్చవిధాం చ ఛాయాం ప్రకాశయతి. సా వ్రీహేరష్టాదశభాగ ప్రమాణా, సిధ్మపద్మకణ్టకాధిష్ఠానా. ద్వితీయా లోహితా నామ, వ్రీహి షోడశభాగప్రమాణా, తిలకాలకన్యచ్ఛవ్యఙ్గాధిష్ఠానా. తృతీ యా శ్వేతా నామ, వ్రీహేర్ద్వాదశభాగప్రమాణా, చర్మదళాజ గల్లీమశకాధిష్ఠానా. చతుర్థీ తామ్రా నామ, వ్రీహేరష్టమభాగ ప్రమాణా, వివిధకిలాసకుష్ఠాధిష్ఠానా. పఞ్చమీ వేదినీ నామ, వ్రీహిపఞ్చమభాగప్రమాణా, కుష్ఠవిసర్పాధిష్ఠానా. షష్ఠీ రోహిణీ

నామ, వ్రీహిప్రమాణా, గ్రన్థ్యపచ్యర్బుదశ్లీపదగళగణ్డాధిష్ఠానా. సప్తమీ మాంసధరా నామ, వ్రీహిద్వయప్రమాణా, భగన్దర విద్రధ్యర్శో౽ధిష్ఠానా. యదేతత్ప్రమాణం నిర్దిష్టం తన్మాంసలే ష్వవకాశేషు; నలలాటే సూక్ష్మాఙ్గుళ్యాదిషు. యతో వక్ష్యత్యుదరేషు వ్రీహిముఖేనాఙ్గుష్ఠోదరప్రమాణమవగాఢం విధ్యేదితి 4

పైనఁజెప్పిన ఏడువిధచర్మములలో మొదటిచర్మము అవభాసిని యని పరఁగు. అది భ్రాజకాగ్నిసంబంధమువలన గౌరాదిసమస్త వర్ణములను, పంచమహాభూత సంబంధముచే జనించు నైదువిధములైన ఛాయ (సమీపమున గనుపించునది)ను, ప్రభ (దూరమునందు గనుపించునది)ను ప్రకాశింపఁజేయుటయెగాక యిరువదిభాగములు గల యవ ప్రమాణములో పదునెనిమిదిభాగముల ప్రమాణముగలదై సిధ్మ, పద్మ, కంటక అను రోగముల కుత్పత్తిస్థానమై యుండును. రెండవచర్మము లోహిత యని పరఁగు. అది యవలో పదునాఱవభాగము ప్రమాణము కలదై తిలకాలకము, న్యచ్ఛము, (మచ్చ) వ్యంగము (మంగు) అనుసీరోగముల కుత్పత్తి స్థానంబైయుండు. మూఁడవచర్మము శ్వేత యని పరఁగు, అది యవలో పండ్రెండవభాగము ప్రమాణము కలదై చర్మదళ, అజగల్లిక, మశక అనుసీరోగముల కుత్పత్తిస్థానంబై యుండును. నాలవచర్మము తామ్రయని పరఁగు. అది యవలో నెనిమిదవభాగముప్రమాణముకలదై కిలాసము మొదలగు నానా విధకుష్ఠరోగముల కుత్పత్తిస్థానంబై యుండును. ఐదవచర్మము వేదిని యని పరఁగు. అయ్యది యవలో నైదవభాగము ప్రమాణము కలదై కుష్ఠ విసర్పరోగముల కుత్పత్తిస్థానంబై యుండును. ఆఱవచర్మము రోహిణియని పరఁగు. అది యవప్రమాణము కలదై గ్రంథి, అపచి, అర్బుద, శ్లీపద, గలగండ, అనుసీరోగములకుత్పత్తిస్థానంబైయుండును. ఏడవచర్మము మాంసధరయని పరఁగు. అది రెండు యవలప్రమాణము కలదై భగందరము, విద్రధి, అర్శస్సు అనుసీరోగముల కుత్పత్తిస్థానంబై యుండును. ఉదరమునందు వ్రీహి ముఖశస్త్రముచే నంగుష్ఠోదరప్రమాణము (ఆఱుయవలప్రమాణమును యిరువది భాగములప్రమాణము గలయవలో నొకభాగమును) వేధించవలయునని యు శ్రుతత్ర చెప్పఁబడియుండుటవలన అవభాసిని మొదలగు సప్తత్వక్కులవిషయమై పైఁ జెప్పఁబడిన యవాష్టాదశాదిప్రమాణములు మాంసభూయిష్ఠమైన ప్రదేశములయందలి చర్మవిషయమై ప్రవర్తించియున్నవి. కాని లలాటము, వ్రేళ్లు మొదలగు సూక్ష్మప్రదేశములందుండుచర్మవిషయమై ప్రవర్తించియుండవు.



## సప్తకలావివరణము.

సూ. కలాః ఖల్వపి సప్త సమ్భవన్తి ధాత్వాశయాన్తరమర్యాదాః 5

"రసాసృఙ్మాంసమేదోస్థిమజ్జాశుక్రాణి ధాతవః." అను వచనప్రకారము రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము లను సప్తధాతువులకును, వాత,

పిత్త, శ్లేష్మ, ఆమ, మల, మూత్ర, రక్తాశయములను సేడాశయములకును మధ్యమునందు నేడుకల లుండును. మఱికొందఱు, "ధాతుశబ్దమువలన మాంస, రక్త, మేదః, శ్లేష్మ, శుక్రములనియు, ఆశయశబ్దముచే పిత్తాశయ, పక్వాశయములనియు నీయేడింటికిని మధ్యమున నొక్కొకకల యుండునని వచించెదరు.

శ్లో. యథా హి సారః కాష్ఠేషు చ్ఛిద్యమానేషు దృశ్యతే,
తథా ధాతుర్హి మాంసేషు చ్ఛిద్యమానేషు దృశ్యతే.
స్నాయుభిశ్చ ప్రతిచ్ఛన్నాస్సన్తతాంశ్చ జరాయుణా,
శ్లేష్మణా వేష్టితాంశ్చాపి కలాభాగాంస్తు తాన్విదుః. 6

కాష్ఠాదుల ఛేదించునపుడు వానియందలిసారము (చేవ) అగుపడుచందంబున మాంసాదుల ఛేదించునపుడు అందుండుకలలు ప్రత్యక్షముగ నగుపడుచుండును. అయిన నవి స్నాయువులచేతను జరాయు (మావి) వలె నుండు పొరలచేతను గప్పఁబడి శ్లేష్మచే వ్యాప్తంబై యుండుటవలన ప్రత్యక్షముగఁ గనుపించకుండును. అనఁగా రక్తము స్రవించునపుడు రక్తధర యనుకల తెగినదని తెలిసికొనవలె నని తాత్పర్యము.

మాంసధరావివరణము.

సూ. తాసాం ప్రథమా మాంసధరా నామ, యస్యాం మాంసగతా నాం సిరాస్నాయుధమనీస్రోతసాం ప్రతానా భవన్తి. 7

పైఁజెప్పిననేడుకలలలో మొదటిది మాంసధరయని పరఁగు. దానియందలి మాంసము నాశ్రయించుకొని సిరలు, స్నాయువులు, ధమనులు, స్రోతస్సులు వృద్ధిఁ జెందుచుండును.

శ్లో. యథా బిసమృణాళాని వివర్ధన్తే సమన్తతః,
భూమౌ పఙ్కోదకస్థాని తథా మాంసే సిరాదయః. 8

భూమియందు బురద, ఉదకమును గూడియుండు స్థలము నాశ్రయించికొని తామరతీగెలు ఆకులు పుష్పములు మొదలగునవి వృద్ధిఁ జెందుచుందంబున మాంసము నాశ్రయించి పైఁ జెప్పిన సిరలు మొదలగునవి వృద్ధిఁ జెందుచుండును.

రక్తధరావివరణము.

సూ. ద్వితీయా రక్తధరా నామ, మాంసస్యాభ్యన్తరతస్తస్యాం శోణితం విశేషతశ్చ సిరాసు యకృత్ప్లీహ్నోశ్చ భవతి. 9

రెండవది యగుకల రక్తధర యని పరఁగు. అది మాంసముయొక్క లోప్రదేశమున వ్యాపించి విశేషముగ రక్తము, సిరలు, యకృత్తు, ప్లీహము అనువానిని వృద్ధిఁ జేయుచుండును.

శ్లో. వృక్షాద్యథాభిప్రహతాత్క్షీరిణః క్షీరమావహేత్,
మాంసాదేవం క్షతాత్క్షిప్రం శోణితం సంప్రసిచ్యతే. 10

పాలతోఁగూడియుండు వృక్షమును ఛేదించినయెడల దానియందు తత్క్షణమే పాలు స్రవించుచందంబున మాంసమును ఛేదించిన తత్క్షణమే రక్తము స్రవించును.

## మేదోధరావివరణము.

సూ. తృతీయా మేదోధరా నామ, మేదో హి సర్వభూతానాముదరస్థమణ్వస్థిషు చ మహత్సు చ మజ్జా భవతి. 11

మూఁడవకల మేదోధర యని పరఁగు. మేదస్సు సర్వప్రాణులకు నుదరము నాశ్రయించియుండు సన్నయెముకల (తరుణాస్థి)మధ్యమునందుండును. మజ్జ (మూలగ) యనునది లావుయెముకల మధ్యమునం దుండును.

భవతశ్చాత్ర.—

శ్లో. స్థూలాస్థిషు విశేషేణ మజ్జా త్వభ్యన్తరాశ్రితా,
అథేతరేషు సర్వేషు సరక్తం మేద ఉచ్యతే.
శుద్ధమాంసస్య యస్స్నేహస్సా వసా పరికీర్తితా,
తప్యమానస్య వా స్నేహో మేదసస్సా వసా మతా. 12

లావుగనుండు నెముకల లోప్రదేశమున మజ్జ (మూలగ) యనునది విశేషముగ నుండును. సన్నగనుండు నితరములైనయెముకల లోప్రదేశమున మేదస్సు రక్తముతో కలసియుండును. అటులనే శుద్ధమాంసముయొక్క స్నేహము (చమురు) గాని బాగుగ కాచఁబడిన మేదస్సు (కొవ్వు)యొక్క స్నేహముగాని వస యని పరఁగు.

## శ్లేష్మధరావివరణము.

సూ. చతుర్థీ శ్లేష్మధరా నామ సర్వసన్ధిషు ప్రాణభృతాం భవతి. 13

నాలవకల శ్లేష్మధరయని పరఁగు. అయ్యది సర్వప్రాణులకును సర్వసంధుల (కీళ్ల) నాశ్రయించి కఫమును ధరించుచుండును. అట్లగుటచేతనే సర్వసంధులయందును ముడుచుకొనుట, చాచుట మొదలగు కార్యములు నిర్విఘ్నముగ జరుగుచుండును.

భవతి చాత్ర.—

శ్లో. స్నేహాభ్యక్తే యథా త్వక్షే చక్రం సాధు ప్రవర్తతే,
సంధయస్సాధు వర్తన్తే సంశ్లిష్టాః శ్లేష్మణా తథా. 14

చమురుచే తడపఁబడిన యిరుసు నాశ్రయించియుండుచక్రము బాగుగ తిరుగునట్లు, శ్లేష్మముచే వ్యాప్తమైన హస్తపాదాదిసంధులు (కీళ్లు) బాగుగ చలించుచుండును.

### పురీషధరావివరణము.

సూ. పఞ్చమీ పురీషధరా నామ, యాఽన్తఃకోష్ఠే మలమభి విభజతే
పక్వాశయస్థా. 15

ఐదవకల పురీషధర యని పరఁగు. అది పక్వాశయమునందుండినదై కోష్ఠమునం దలి మలమూత్రముల విభజన సేయుచుండును. 'స్థానాన్యామాగ్నిపక్వానాం మూత్రస్య రుధిరస్య చ, హృదున్డుకః పుప్ఫుసశ్చ కోష్ఠ ఇత్యభిధీయతే' అని చెప్పియుండుటవలన ఆమాశయము, అగ్న్యాశయము, పక్వాశయము, మూత్రాశయము, రక్తాశయము, హృదయము, ఉండుకము, పుప్ఫుసము అనునవి కోష్ఠమనఁబడును.

భవతి చాత్ర.—

శ్లో. యకృత్సమన్తాత్కోష్ఠం చ తథాంత్రాణి సమాశ్రితా,
ఉన్డుకస్థం విభజతే మలం మలధరా కలా. 16

మలధర యనుకల కోష్ఠాంతర్గతమైన యకృత్తు, ప్లీహము, హృదయము, పుప్ఫుసము. ప్రేగులు అను వానియందంతట వ్యాపించి ఉండుకమునం దుండుమలమును విభజన సేయుచుండును.

### పిత్తధరావివరణము.

సూ. షష్ఠీ పిత్తధరా నామ, యా చతుర్విధమన్నపానముపయుక్త మా
మాశయాత్ప్రచ్యుతం పక్వాశయోపస్థితం ధారయతి. 17

ఆఱవకల పిత్తధర యని పరఁగు. అది మనుజులచే భక్షింపఁబడిన చతుర్విధాన్న పానముల నామాశయమునుండి పక్వాశయమునకుఁ దీసికొని ధారణము సేయుచుండును.

భవతి చాత్ర.—

శ్లో. అశితం ఖాదితం పీతం లీఢం కోష్ఠగతం నృణామ్,
తజ్జీర్యతి యథా కాలం శోషితం పిత్తతేజసా. 18

అశితము (విశేషముగ దంతములపనిలేక తినఁబడు నన్నాదులు) ఖాదితము (దంతములచే నమలి భక్షింపఁబడు నపూపాదులు) పీతము (త్రాగునట్టి క్షీరాదులు) లీఢము (నాలుకతో నాకునట్టి పచ్చడి మొదలగు పదార్థములు)అను నాలుగువిధములైన యన్నపానములు మనుజులయొక్క కోష్ఠమును జెంది పిత్తముయొక్క తేజస్సువలన శోషితమై యుచితకాలము నతిక్రమించక జీర్ణమును జెందును. 'షష్ఠీ పిత్తధరానామ యా కలా పరికీర్తితా, పక్వామాశయమధ్యస్థా గ్రహణీ పరికీర్తితా'' అను వచనప్రకారము పక్వాశయ ఆమాశయములకు మధ్యనుండి జాఠరాగ్నికధిష్ఠానంబై పిత్తతేజస్సుచే పూర్వోక్త చతుర్విధాన్నములఁ బరిపాకము సేయుచుండు నాఱవది యగు పిత్తధర యనుకల గ్రహణి యనికూడఁ బరఁగునని తెలియుచున్నది.

### శుక్రధరావివరణము.

సూ. సప్తమీ శుక్రధరా నామ, యా సర్వప్రాణినాం సర్వశరీర వ్యాపినీ. 19

ఏడవకల శుక్రధరయని పరంగు. అయ్యది సర్వప్రాణులయు సర్వశరీరమునందు వ్యాపించి శుక్రమును ధరించియుండును.

భవన్తి చాత్ర.—

శ్లో. యథా పయసి సర్పిస్తు గుడశ్చేక్షురసే యథా,
శరీరేషు తథా శుక్రం నృణాం విద్యాద్భిషగ్వరః.
ద్వ్యఙ్గులే దక్షిణే వామే వస్తిద్వారస్య చాప్యధః,
మూత్రస్రోతః పథాచ్ఛుక్రం పురుషస్య ప్రవర్తతే. 20

పాలయందు నెయ్యి, చెఱకురసమునందు బెల్లము సర్వత్ర వ్యాపించియుండు భంగి ప్రాణులయొక్క సర్వశరీరమునందు శుక్రము వ్యాపించియుండును. వస్తిద్వారమునకు రెండంగుళములక్రింద కుడివైపున నొకటియు, నెడమవైపున నొకటియుం మూత్రస్రోతస్సులు గలవు. వానినుండి పురుషునికి శుక్రము బయలు వెడలును.

శ్లో. కృత్స్నదేహాశ్రితం శుక్రం ప్రసన్నమనసస్తథా,
స్త్రీషు వ్యాయచ్ఛతశ్చాపి హర్షాత్తత్సమ్ప్రవర్తతే. 21

క్రోధము మొదలయినవి లేక స్వస్థచిత్తుఁడై యత్యాసక్తిచే స్త్రీసంభోగమునందుఁ బ్రవర్తించి యాయాసము జెందిన పురుషునియొక్క సర్వశరీరవ్యాపి యగుశుక్రము సంతోషమువలన నధికముగ బయలువెడలును.

### గర్భిణీస్త్రీల కార్తవాదర్శనకారణము.

సూ. గృహీతగర్భాణామార్తవవహానాం స్రోతసాం వర్త్మాన్యవరుధ్యన్తే గర్భేణ. తస్మాద్గృహీతగర్భాణామార్తవం న దృశ్యతే. తతస్తదధః ప్రతిహతమూర్ధ్వమాగతమపరం చోపచీయమానమపరేత్యభిధీయతే. శేషం చోర్ధ్వతరమాగతం పయోధరావభిప్రతిపద్యతే. తస్మాద్గర్భిణ్యాః పీనోన్నతపయోధరా భవన్తి. 22

గర్భధారణానంతరము స్త్రీలకు ఆర్తవవాహినులగు స్రోతస్సులయొక్క మార్గము గర్భముచే నడ్డగింపఁబడుటవలన గర్భిణీస్త్రీల కార్తవము కనుపింపకుండును. గర్భధారణానంతరము అధోభాగమునందు వ్యాపింపకుండ నడ్డగింపఁబడిన యార్తవములో నొకభాగమూర్ధ్వప్రదేశమునందు వ్యాపించి యపర (మావి) రూపముగ నగును. మఱియొక

భాగము స్తనప్రాంతములందు వ్యాపించును. అందుచే గర్భిణీస్త్రీలకు స్తనము లున్నతములై బలసియుండును.

### యకృత్ప్లీహాద్యుత్పత్తివివరణము.

సూ. గర్భస్య యకృత్ప్లీహానౌ శోణితజౌ. శోణితఫేనప్రభవః పుప్ఫుసః. శోణితకిట్టప్రభవ ఉణ్డుకః.

శ్లో. అసృజశ్శ్లేష్మణశ్చాపి యః ప్రసాదః పరో మతః,
తం పచ్యమానం పిత్తేన వాయుశ్చాప్యనుధావతి.
తతోఽస్యాన్త్రాణి జాయన్తే గుదం వస్తిశ్చ దేహినః,
ఉదరే పచ్యమానానామాధ్మానాద్రుక్మసారవత్.
కఫశోణితమాంసానాం సారో జిహ్వా ప్రజాయతే,
యథార్థమూష్మణా యుక్తో వాయుస్స్రోతాంసి దారయేత్.
అనుప్రవిశ్య పిశితం పేశీర్విభజతే తథా,
మేదసస్స్నేహమాదాయ సిరా స్నాయుత్వమాప్నుయాత్.
సిరాణాం తు మృదుః పాకస్స్నాయూనాం తు తతః ఖరః,
ఆశయాభ్యాసయోగేన కరోత్యాశయసమ్భవమ్.

సూ. రక్తమేదఃప్రసాదాద్వృక్కౌ. మాంసాసృక్కఫమేదఃప్రసాదాద్వృషణౌ. శోణితకఫసారజం హృదయం, యదాశ్రయా హి ధమన్యః ప్రాణవహాః. తస్యాధో వామతః ప్లీహా పుప్ఫుసశ్చ దక్షిణతో యకృత్క్లోమ చ. 23

తా. గర్భమునకు యకృత్తు, ప్లీహము అనునవి రక్తమువలనఁ గలుగును. యకృత్తు అనఁగా హృదయమునకు దక్షిణభాగమునందు తొమ్మిదవ పర్శుకాస్థి (ప్రక్కఎముక) వఱకు వ్యాపించి సర్వప్రాణులకు వానివానియంగుళముతో పదునాలుగంగుళము లాయామమును, యెనిమిదంగుళములవిస్తారమును, నాలుగంగుళముల యుత్సేధమును గలిగియుండును. ప్లీహమనఁగా నెడమప్రక్కన నెనిమిదవపర్శుకాస్థివఱకు నుండి యాఱంగుళము లాయామమును, నాలుగంగుళముల విస్తారమును, ఒకటిన్నరయంగుళ ముత్సేధమును గలిగియుండును. రక్తముయొక్క నురుఁగువలన పుప్ఫుసము జనించును. అయ్యది కంఠప్రదేశము మొదలుకొని ఆఱవది లేక నేడవదియగు పర్శుకాస్థివఱకును వ్రేలాడుచు నేడవపర్శుకాస్థికి సమప్రదేశమున నుండినట్టియు కుక్షినివక్షమును విభాగమునుచేసి యారెంటికి నడ్డముగనుండు పొరను తాకుచు ప్రాయికముగ శ్వాసాశయమునంతటను నిండి

యుండును. మఱియు నది క్రిందిభాగమున కోవిదారపత్రము (దేవకాంచనపుటాకు) వలెరెండుగ విభజింపఁబడి యందు దక్షిణభాగము ఎడమప్రక్కనుండు దానికంటె విశాలము గలిగి కొంచెము ముందుకు వచ్చియుండును. ఎడమభాగము కుడిదానికంటె కొంచెమాయతమై కొంచెము వెనుకప్రక్కగ నుండును. శోణితమువలన నుందుకము జనించును.

రక్తశ్లేష్మములయొక్క సారాంశము పిత్తోష్మముచేఁ బక్వమగునపుడు దానియందు వాతము ప్రవేశించుటవలనఁ బ్రాణులకు ప్రేగులు, గుదము, వస్తి, అనునవి జనించును. మఱియు సువర్ణమును బలుమారు పుటంబు లిడుటవలన దానియందు సారము జనించుభంగి యుందరమునందు పిత్తోష్మములవలనఁ బచనమును జెందుకఫరక్తమాంసములవలనఁ దత్సారాంశమైన జిహ్వ జనించును. పిత్తోష్మముతోఁ గూడియుండువాతము రసరక్తశబ్దవీర్యాదులవహించు స్రోతస్సుల విభజనసేయుభంగి మాంసమునందుఁ బ్రవేశించి పేశులను విభజనసేయుచుండును. వాతము మేదస్సుయొక్క స్నేహమును గ్రహించి పిత్తోష్మముచే పచనముఁ జేసి సిరాస్నాయువుల జనింపఁజేయుచున్నది. చెఱకురసము మృదుపాకమువలన సిరలుగ, కఠినపాకమువలన స్నాయువులుగ నగును. వాయువు తనయొక్కస్థితిసహవాసముల శర్కరచేత నాశయముల జనింపఁజేయును. రక్తము, మేదస్సు అనువానిసారమువలన వృక్కలు (కుక్షిగోళములు)ను, వాతముతోఁ గూడియుండునట్టి మాంస, రక్త, కఫ మేదస్సులయొక్క సారమువలన వృషణములు జనించును. రక్తకఫములసారమువలన హృదయము జనించును. ప్రాణవాహిను లగుధమనులు హృదయకమలము నాశ్రయించియుండును. ఆహృదయకమలమున కధోభాగమునందు ఎడమప్రక్కన ప్లీహాపుప్ఫుసములు, కుడిప్రక్కన యకృత్క్లోమములును ఉండును.

## హృదయస్వరూపము.

సూ. తద్ధృదయం విశేషేణ చేతనాస్థానమత స్తస్మిం స్తమసా వృతే సర్వే ప్రాణినస్స్వపన్తి. 24

హృదయము విశేషముగ చైతన్యమునకు స్థానము. అది తమోగుణముచే వ్యాప్తంబైయుండునపుడు సర్వప్రాణులు నిద్రను జెందెదరు. "చేతనానామధిష్ఠానం మనో దేహశ్చ సేంద్రియమ్, కేశలోమనఖాగ్రాంతమలద్రవ్యగుణైర్వినా" కేశములు, రోమములు, నఖాగ్రములు, మలము, ద్రవ్యగుణములు అనునవి తప్ప నింద్రియములతోఁ గూడియుండు మనస్సును, దేహమును, చైతన్యమున కధిష్ఠానమనియెడి చరకవచనమునకును, "తద్ధృదయం విశేషేణ చేతనాస్థానమ్" అనుసూత్రము విరుద్ధముగనున్నదని కొందఱు శంకింపవచ్చు. అయినను సుశ్రుతాచార్యున కింద్రియాదులకన్నను హృదయమే ముఖ్యస్థానమని యభిప్రాయము.

భవతి చాత్ర.—

శ్లో. పుణ్డరీకేణ సదృశం హృదయం స్యాదధోముఖమ్,
జాగ్రత స్తద్వికసతి స్వపతశ్చ నిమీలతి. 25

హృదయము తామరమొగ్గతో సమానాకారము గలదై యధోముఖముగ నుండును; అది జాగ్రదవస్థయందు వికసించియుండును. నిద్రావస్థయందు ముకుళీభావమును జెందును. మఱియు "చతుఃప్రకోష్ఠం హృదయం వామదక్షిణభాగతః, తేషాం ద్వౌ దక్షిణౌ కోష్ఠౌ గృహీత్వా శుద్ధశోణితమ్. మనాక్సంశోధ్య విసృజేత్సరయా పుప్ఫుసేఽనిశమ్, తత్ర శుద్ధం ప్రజేత్కోష్ఠౌ వామౌ చ తదనన్తరమ్. తస్మాత్సృతం శరీరం చ జీవయేద్బృంహయేచ్చ తత్." హృదయమునందు నాలుగు గదులు గలవు. అందు రెండు కుడివైపునను రెం డెడమవైపున నమర్పఁ బడియుండును. కుడిప్రక్కగదులు నీలరక్తసంపూరితములు. ఆరక్త మచ్చటనుండి పుప్ఫుసబృహత్సిరద్వారా పుప్ఫుససంహతి (లంగ్ టిష్యు)లో వ్యాపించి ప్రాణవాయువును సంపూర్ణముగ గ్రహించి రక్తముఁజెంది తిరిగి యెడమప్రక్కనుండు గదులలోకిఁ జొచ్చి అక్కడినుండి బృహద్ధమనీద్వారా శరీరమునకంతయుఁ బ్రసరించి శరీరపోషణమును జేయును అని చెప్పియున్నది.

### నిద్రాస్వరూపము.

సూ. నిద్రాం తు వైష్ణవీం మాయాం పాప్మానముపదిశన్తి. సా స్వభావత ఏవ సర్వప్రాణినోఽభిస్పృశతి. తత్ర యదా సంజ్ఞావహాని స్రోతాంసి తమోభూయిష్ఠశ్లేష్మా ప్రతిపద్యతే, తదా తామసీనామ నిద్రా సమ్భవతి; అనవబోధినీ సా ప్రళయకాలే. తమోభూయిష్ఠానామహస్సు నిశాసు చ భవతి. రజోభూయిష్ఠానామనిమిత్తమ్. సత్త్వభూయిష్ఠానామర్ధరాత్రే. క్షీణశ్లేష్మణామనిలబహుళానాం మనశ్శరీరాభి * ఘాతవతాం చ నైవ; సా వైకారికీ భవతి. 26

నిద్ర విష్ణుసంబంధమగు మాయ; అది సర్వప్రాణులను స్వభావముగ నాశ్రయించి శుభాశుభకర్మల నిరోధించుచుండుటవలన దానిని పాపస్వరూపమని పెద్దలు వచించెదరు. విష్ణుమాయాసంబంధమైన యీనిద్రలో సంజ్ఞావాహిను లగుస్రోతస్సుల తమోగుణప్రధానమైన కఫము అడ్డగించునపుడు తామసియను పేరుగల గాఢమైననిద్ర గలుగును. అట్టి ఘోరరూపంబై మరల జ్ఞానమును గలుగఁజేయకుండునట్టి నిద్ర మరణకాలమునందే కలుగును. సర్వనిద్రలయందును తమోగుణము కారణమైనను పూర్వోక్తనిద్రలయందు తమోగుణ మధికముగ నుండుటచే నది తామసి యనుపేరం బరంగును. తమోగుణబాహుళ్యము గలవారలకు రేయుఁబవలును నిద్రగలుగును. రజోగుణబాహుళ్యముగలవారలకు కారణములేకయే ఒకానొకప్పుడుగాని రాత్రియందుఁగాని

* 'తాపవతాం' అని పాఠాంతరము.

〈టియందుఁగాని ప్రాతఃకాలమునఁగాని నిద్ర గలుగును. సత్త్వగుణాధిక్యము గలవార
నఅర్థరాత్రియందు సత్త్వగుణము స్వల్పముగా తమోగుణ మధికముగా నుండుటవలన
ారల కర్థరాత్రియందు నిద్ర గలుగును. బలప్రదమగుకఫము క్షీణించినవారలకును,
ాతము ప్రకోపించియుండువారలకును, మనశ్శరీరములయం దభిఘాతముఁ జెందినవార
నను నిద్ర గలుగకుండును. "యదాతు మనసి క్లాంతే కర్మాత్మా చ శ్రమాన్వితః,
నయేభ్యో నివర్తేత తదా స్వపితి మానవః" అను చరకవచనప్రకారము మనస్సునందు
ఖము గలిగియుండునపుడు కర్మపురుషుఁడు శ్రమను జెందినపుడు విషయవిముక్తుఁడై
మరించుచున్నాఁడు. కాఁబట్టి ఒకానొకప్పుడు నిద్రజనించిన నది వైకారికి యనం
మను. గ్రంథాంతరములలో సప్తవిధనిద్రలు చెప్పఁబడియుండినను నవి తామసస్వా
వికవైకారికము లను మూఁడువిధములైననిద్రలలో నంతర్భావమును జెందుచున్నవి.

వన్తి చాత్ర.—

శ్లో. హృదయం చేతనాస్థానముక్తం సుశ్రుతదేహినామ్,
తమోఽభిభూతే తస్మింస్తు నిద్రా విశతి దేహినామ్.
నిద్రాహేతుస్తమస్సత్త్వం బోధనే హేతురుచ్యతే,
స్వభావ ఏవ వా హేతుర్గరీయాన్పరికీర్త్యతే.
పూర్వదేహానుభూతాం స్తు భూతాత్మా స్వపతః ప్రభుః,
రజోయుక్తేన మనసా గృహ్ణాత్యర్థాఞ్ఛుభాశుభాన్.
కరణానాం తు వైకల్యే తమసాఽభిప్రవర్ధితే,
అస్వపన్నపి భూతాత్మా ప్రసుప్త ఇవ చోచ్యతే. 27

హృదయము ప్రాణులకుఁ జేతనాస్థానమని యిదివఱకె చెప్పంబడియె. నది తమో
ఽవ్యాప్తంబుగ నుండిన నిద్ర గలుఁగును. నిద్రకు తమోగుణమును, జాగ్రదవస్థకు సత్త్వ
ఽమును లేక బలిష్ఠమైనస్వభావమే ఈరెండవస్థలకును కారణము. నిద్రించునపుడు
త్రజ్ఞుఁ డనేకజన్మాంతరములయం దనుభవించిన శుభాశుభస్వరూపమైనవిషయముల
ుదుఃఖభోగాసక్తమైన మనస్సుచేతఁ దెలిసికొనుచున్నాఁడు. ఇదియె స్వప్నమనఁ
ను. శరీరమునందు తమోగుణముచే నింద్రియవైకల్యము వృద్ధిఁ జెందుచుండఁగ
త్రజ్ఞుఁడు నిద్రించనివాఁడైనను నిద్రించువానివలె నగుపడుచుండును.

## దివాస్వాపనిషేధము.

ం. సర్వర్తుషు దివాస్వాపః ప్రతిషిద్ధోఽన్యత్ర గ్రీష్మాత్. 28

గ్రీష్మఋతువునందు తప్ప తక్కినఋతువులందు పగటినిద్రను వర్జింపవలయును.

## బాలవృద్ధాదులకు దివాస్వాపానుజ్ఞ.

ా. ప్రతిషిద్ధేష్వపి తు బాలవృద్ధస్త్రీకర్శితక్షతక్షీణ నిత్యమద్యపాన

యందు నిద్రించుటచేతను గలుగుదోషంబుల బుద్ధిమంతుఁడు తెలిసికొని మితముగ నాచరింపవలెను. అట్టి యాచరణముచే నారోగ్యము, సంతోషము, బలము, వర్ణము, వీర్యవృద్ధి, ఇవి గలవాఁడై మిక్కిలిలావును మిక్కిలిసన్నముగాని శరీరముగలవాఁడై శాంతియుక్తుఁడై నూఱుసంవత్సరంబులు జీవించును.

## నిద్రాభావహేతువు.

శ్లో. నిద్రా సాత్మ్యకృతా యైస్తు రాత్రౌ చ యది వా దివా,
న తేషాం స్వపతాం దోషో జాగ్రతాం వా విధీయతే.
నిద్రానాశోఽనిలాత్పిత్తాన్మనస్తాపాత్క్షయాదపి,
సమ్భవత్యభిఘాతాచ్చప్రత్యనీకైః ప్రశామ్యతి. 33

పగటియందు నిద్రించుటగాని, రాత్రులందు మేల్కొనుటగాని, సాత్మ్యము (అలవాటు) గలవారికి రోగములు సంభవింపకుండును. వాతము, పిత్తము, మనోవ్యాకులము, క్షయము, శరీరమునకు దెబ్బతగులుట మొదలగువానివలన నిద్రానాశము కలుగును. కావున దాని నభ్యంగాద్యుపచారములవలన శమింపఁజేయవలెను.

## నిద్రానాశమునందు చికిత్స.

శ్లో. నిద్రానాశేఽభ్యఙ్గయోగో మూర్ధ్ని తైలనిషేవణమ్,
గాత్రస్యోద్వర్తనం చైవ హితం సంవాహనాని చ.
శాలిగోధూమపిష్టాన్నభక్ష్యైరైక్షవసంస్కృతైః,
భోజనం మధురం స్నిగ్ధం క్షీరమాంసరసాదిభిః.
రసైర్బిలేశయానాం చ విష్కిరాణాం తథైవ చ,
ద్రాక్షాసితేక్షుద్రవ్యాణాముపయోగో భవేన్నిశి.
శయనాసనయానాని మనోజ్ఞాని మృదూని చ,
నిద్రానాశే తు కుర్వీత తథాన్యాన్యపి బుద్ధిమాన్. 34

నిద్రానాశమునం దభ్యంగము, శిరస్సునందు తైలము నంటించుకొనుట, శరీరమునందు నలుగుపెట్టించుకొనుట, శరీరమర్దనము, చక్కెరతోడ పాకముచేయఁబడిన శాల్యన్నము, గోధూమపిష్టాన్నము, భక్ష్యములు, మాంసరసము మొదలగువానితోఁ గూడి స్నిగ్ధమై (నేతితోఁగూడి) మధురముగ నుండుభోజనమును, రాత్రులయందు ఉడుము మొదలగు పంచనఖజంతువులయొక్కయు, తిత్తిర్యాదిపక్షులయొక్కయు మాంసరసమును, ద్రాక్ష, పంచదార, చెఱకురసము, అనుపానిని సేవింపవలయును. మఱియు, రమ్యమై మృదువుగనుండు శయనాసనయానముల సేవించుటవలనను, దుప్పటి మొదలగు వానిని కప్పుకొనుటవలనను బుద్ధిమంతుఁడగువాఁడు నిద్రానాశమును శమింపఁజేయవలెను.

### నిద్రాధిక్యమునందు చికిత్స.

శ్లో. వమేన్నిద్రాతియోగే తు కుర్యాత్సంశోధనాని చ,
లఙ్ఘనం రక్తమోక్షం చ మనోవ్యాకులనాని చ. 35

నిద్రాధిక్యమునందు వమనము మిక్కిలి హితకరంబుగ నుండును. మఱియు, వమనము, విరేచనము, స్వేదము మొదలగుశోధనక్రియలును, లంఘనము, రక్తమును దీయుట, మనస్సునకు వ్యాకులముగలిగించు కార్యములసేయుట అనునవియును, హితకరంబులుగ నుండును. ఇచట సంశోధనక్రియలలో వమనముఁ జెప్పియుండినను నిద్రాధిక్యమునందు వమనము మిక్కిలి హితకరం బని సూచించుటకై ప్రత్యేకముగ వమనము మరలఁ జెప్పంబడెను.

### రాత్రిజాగరణమున కర్హులు.

శ్లో. కఫమేదోవిషార్తానాం రాత్రౌ జాగరణం హితమ్. 36

కఫము, మేదస్సు, విషము వీనిచేఁ బీడితులైనవారలకు రాత్రులయందు జాగరణము హితకరము.

### దివాస్వాపమున కర్హులు.

శ్లో. దివాస్వప్నశ్చ తృట్ఛూలహిక్కాజీర్ణాతిసారిణామ్. 37

దప్పి, శూల, ఎక్కిళ్లు, అజీర్ణము, అతిసారము అనువానిచేఁ బీడితులైనవారికి పగటినిద్ర హితకరము.

### తంద్రాలక్షణము.

శ్లో. ఇన్ద్రియార్థేష్వసమ్ప్రాప్తిర్గౌరవం జృమ్భణం క్లమః,
నిద్రార్తస్యేవ యస్యేహా తస్య తన్ద్రాం వినిర్దిశేత్. 38

నిద్రార్తునివలెనే శబ్దాదివిషయంబులయం దజ్ఞానము, శరీరమునందు బడలిక, ఆవలింతలు అను నీలక్షణములు గలిగియుండును.

### జృంభా (ఆవలింత) లక్షణము.

శ్లో. పీత్వైకమనిలోచ్ఛ్వాసముద్వేష్టన్వివృతాననః,
యం ముఞ్చతి సనేత్రాస్రం స జృమ్భ ఇతి సంజ్ఞితః. 39

ఒక యనిలోచ్ఛ్వాసమును నోటిచే నాకర్షించి శిరమును వెనుకకు కదల్చుచు మరల నోరు దెరచికొని నేత్రజలముతోడ దానిని విడుచుటయే జృంభ (ఆవలింత) యనఁబడును.

### క్షుత (తుమ్ము) లక్షణము.

శ్లో. ప్రాణోదానౌ సమౌ స్యాతాం మూర్ధ్ని స్రోతఃపథస్థితౌ,
నస్తః ప్రవర్తతే శబ్దః క్షవథుం తం వినిర్దిశేత్. 40

హృదయమునందుండు ప్రాణవాయువును, కంఠమందుండు ఉదానవాయువును మస్తకమునఁ బ్రవేశించి స్రోతోమార్గము నడ్డగించి క్షణమాత్రము స్థిరముగ నుండి ముక్కువలన శబ్దముతోడ బయలువెడలిన క్షుతమనంబడును.

క్లమలక్షణము.

శ్లో. యోఽనాయాసశ్శ్రమో దేహే ప్రవృద్ధశ్శ్వాసవర్జితః,
క్లమస్స ఇతి విజ్ఞేయ ఇన్ద్రియార్థప్రబాధకః. 41

అనాయాసముగ దేహమునందు శ్రమకలిగి యుండుటయే క్లమ మనఁబడును. దానియందు నిట్టూర్పు వాతసంబంధము లేకనే యింద్రియార్థములైన శబ్దాదివిషయములయందు ప్రవృత్తిలేకుండును. ఈక్లమమునే గ్లాని (బడలిక) యనికూడ వచించెదరు.

ఆలస్యస్వరూపము.

శ్లో. సుఖస్పర్శ *ప్రసఙ్గిత్వం దుఃఖద్వేషణలోలతా,
శక్తస్య చాప్యనుత్సాహః కర్మస్వాలస్యముచ్యతే. 42

సుఖస్పర్శయం దిచ్ఛ, దుఃఖమునందు ద్వేషణము, చంచలత్వము, శక్తిగలిగి యుండియు వ్యాపారమునం దనుత్సాహము గలిగియుండునట్టియవస్థయే ఆలస్య మనఁబడును.

ఉత్క్లేశస్వరూపము.

శ్లో. ఉత్క్లిశ్యాన్నం స నిర్గచ్ఛేత్ప్రసేకష్ఠీవనేరితమ్,
హృదయం పీడ్యతే చాస్య తముత్క్లేశం వినిర్దిశేత్. 43

కడుపులో త్రిప్పుటవలన నన్నము బైలువెడలకుండుట, నోటియందు నీరు కారుట, నోటియసహ్యము వలన విశేషముగ నుమియుచుండుట, హృదయమునందు పీడ కలుగుట; ఇట్టియవస్థయే యుత్క్లేశ (ఓకర) మనఁబడును.

గ్లానిస్వరూపము.

శ్లో. వక్త్రే మధురతా తన్ద్రా హృదయోద్వేష్టనం భ్రమః,
న చాన్నమభికాఙ్క్షేత గ్లానిం తస్య వినిర్దిశేత్. 44

నోటియందు తీపిదనము, తంద్ర కలుగుట, ఱొమ్ము యీడ్చునట్లుండుట, భ్రమ కలుగుట, అన్నమునం దిచ్ఛలేకుండుట, ఇట్టియవస్థయే గ్లాని యనఁబడును.

గురుత్వస్వరూపము.

శ్లో. ఆర్ద్రచర్మావనద్ధం హి యో గాత్రమభిమన్యతే,
తథా గురుశిరోఽత్యర్థం గౌరవం తద్వినిర్దిశేత్. 45

శరీరమంతయు తడిపినచర్మముతోఁ గప్పఁబడినట్లుండుట, తల మిక్కిలి బరువుగ నుండుట ఇట్టియవస్థయే గౌరవ మనఁబడును.

* 'ప్రసఙ్గిత్వమ్' అని పాఠాంతరము.

### మూర్ఛాదులకు కారణము.

శ్లో. మూర్ఛా పిత్తతమఃప్రాయా రజఃపిత్తానిలాద్భ్రమః,
తమోవాతకఫాత్తన్ద్రా నిద్రా శ్లేష్మతమోభవా. 46

పిత్తము, తమోగుణము అనువీనిసంబంధమువలన మూర్ఛగలుగును. దీనియం దకస్మాత్తుగ సావలింత గలిగి మనుజుఁడు నిశ్చేష్టితుఁడుగ నగును. రజోగుణము, పిత్తము, వాతము అనువానిసంబంధమువలన భ్రమకలుగును. దీనియందు చక్రముపైఁ గూర్చుండఁ బెట్టి త్రిప్పునటులనే యవస్థకలుగును. తమోగుణము, వాతము, కఫము అనువానిసంబంధమువలన తంద్ర కలుగును. కఫము తమోగుణము అనువానిసంబంధమువలన నిద్ర కలుగును.

### గర్భవృద్ధిహేతువు.

సూ. గర్భస్య ఖలు రసనిమిత్తా మారుతాధ్మాననిమిత్తా చ పరివృద్ధిర్భవతి. 47

తల్లి వలన భుజింపఁబడిన అన్నాదిరసములును, వాతపూరణమును గర్భవృద్ధికి నిమిత్తంబులు. తల్లి వలన భుజింపఁబడిన యన్నాదిరసమువలనఁ గలిగెడి వృద్ధి పూర్వోక్త తృతీయాధ్యాయమునందు "మాతుస్తు ఖలు రసవహాయాం నాడ్యాం" అనుసూత్రము నందుఁ జెప్పఁబడియున్నది. వాతము శిశువుయొక్క నాడులయందు పూరితమై శిశువుయొక్క సర్వావయవములను వృద్ధిఁజేయుచుండును.

భవన్తి చాత్ర.—

శ్లో. తస్యాన్తరేణ నాభేస్తు జ్యోతిస్థ్సానం ధ్రువం స్మృతమ్,
తదా ధమతి వాతస్తు దేహస్తేనాస్య వర్ధతే.
ఊష్మణా సహితశ్చాపి దారయత్యస్య మారుతః,
ఊర్ధ్వం తిర్యగధస్తాచ్చ స్రోతాంస్యపి యథా తథా.
దృష్టిశ్చ రోమకూపాశ్చ న వర్ధన్తే కదాచన,
ధ్రువాణ్యేతాని మర్త్యానామితి ధన్వన్తరేర్మతమ్.
శరీరే క్షీయమాణేఽపి వర్ధతే ద్వావిమౌ సదా,
స్వభావం ప్రకృతిం కృత్వా నఖకేశావితి స్థితిః. 48

గర్భముయొక్క నాభిస్థానమునందుండునగ్నిని జ్వలింపఁజేయునట్టివాతము ఊష్మసహితముగ పాదము మొదలుకొని శిరస్సువఱకు ఊర్ధ్వముఖముగ అడ్డముగ నధోముఖముగ వ్యాపించియుండుసిరలయందుఁ బ్రవేశించి పూరితమై విభజన సేయుటవలన గర్భముయొక్క దేహము వృద్ధిఁజెందుచుండును. శరీరము కాలక్రమముగ వృద్ధిఁజెందక స్థిరముగనుండుననుటయు శరీరము క్షయించుచుండినను నఖకేశములు స్వభావముగ నెల్లపుడు వృద్ధిఁజెందుచుండుననుటయు ధన్వంతరిమతము.

## సప్తప్రకృతివివరణము.

సూ. సప్త ప్రకృతయో భవన్తి దోషైః పృథక్ ద్విశస్సమస్తైశ్చ. 49

వాత, పిత్త, శ్లేష్మ, వాతపిత్త, వాతశ్లేష్మ, పిత్తశ్లేష్మ, సన్నిపాతములను నేడుభేదములవలన పురుషులకు ప్రకృతులుకూడ నేడువిధములుగ నగును.

శ్లో. శుక్రశోణితసంయోగే యో భవేద్దోష ఉత్కటః,
ప్రకృతిర్జాయతే తేన తస్యా మే లక్షణం శృణు. 50

శుక్రశోణితసంయోగకాలమందు స్వభావమువలన ప్రబలమగు వాతాదిదోషాను గుణముగ గర్భస్థశిశువునకు ప్రకృతియును కలుగును. ఎట్లన:— గర్భాధానకాలమునందు వాతము ప్రకోపించియుండిన గర్భస్థశిశువునకు కూడ వాతప్రకృతి కలిగి యుండును. ఇటులనె పిత్తాదులయందును తెలియవలెను. వాతాదిదోషములు స్వభావమువలనను దోషబాహుళ్యమువలనను ప్రకోపించును. స్వభావమువలనఁ గలిగిన ప్రకోపము ప్రకృతికి హేతువై శరీరాభివృద్ధికి కారణమగును. దోషబాహుళ్యమువలనఁ గలిగిన ప్రకోపము రోగమునకు హేతువై గర్భనాశమునకు కారణమగును.

## వాతప్రకృతిమనుజలక్షణము.

సూ. తత్ర జాగరూకశ్శీతద్వేషీ దుర్భగస్స్తేనో మత్సర్యనార్యో గాన్ధర్వచిత్తస్స్ఫుటితకరచరణోఽతిరూక్షశ్మశ్రునఖకేశః క్రోధీ దన్తనఖఖాదీ చ భవతి.

శ్లో. అధృతిరదృఢసౌహృదః కృతఘ్నః కృశపరుషో ధమనీతతః ప్రలాపీ,
ద్రుతగతిరటనోఽనవస్థితాత్మా వియతి చ గచ్ఛతి సమ్భ్రమేణ సుప్తః.
అవ్యవస్థితమతిశ్చలదృష్టిర్మన్దరత్నధనసఞ్చయమిత్రః,
కిఞ్చిదేవ విలపత్యనిబద్ధం మారుతప్రకృతిరేష మనుష్యః.
వాతికాశ్చాజగోమాయుశశాఖూష్ట్రశునాం తథా,
గృధ్రకాకఖరాదీనామనూకైః కీర్తితా నరాః. 51

పైఁ జెప్పిన యేడువిధములైన ప్రకృతులలో మిక్కుటముగ జాగరణ స్వభావము, శీతపదార్థ ద్వేషము, వికారమైనశరీరము, చోరత్వము, పరుల మేలును సహింపలేని స్వభావము, దురాచారము, ఎల్లపుడు నృత్యగీతాదులయం దాసక్తి, హస్తపాదములయందు పగుళ్లు, మిక్కిలిబిరుసుగ నుండు మీసములు, వెండ్రుకలు, గోళ్లును, క్రోధము, దంతములచే గోళ్లను కొఱుకుస్వభావము, లేక నిద్రయందు దంతములఁ గొఱుకుస్వభావము, సన్నములై కఠినముగనుండు నరములు, పలుమరు మాటలాడుస్వభావము, వేగగమనము, అధికముగ తిరుగుట, చంచలమైన చిత్తము, నిద్రయం దాకాశగమనము, అస్థిరబుద్ధి, చంచలదృష్టి, అల్పముగ రత్నములను ధనమును మిత్రులను సంపాదించు స్వభావము,

విలాసముగ కొంచె మబద్ధమాడుస్వభావము, ఇట్టిలక్షణములు గలవాఁడు వాతప్రకృతి కలవాఁడని తెలియవలెను. మఱియు, వాతప్రకృతిగలిగినమనుజులు మేక, నక్క, కుందేలు, ఎలుక, ఒంటె, కుక్క, గద్ద, కాకి, గాడిద మొదలగు జంతువులయొక్క స్వభావము గలవారుగ నుండెదరు.

## పిత్తప్రకృతిమనుజలక్షణము.

సూ. స్వేదనో దుర్గన్ధః పీతశిథిలాఙ్గస్తామ్రనఖనయనముఖతాలు జిహ్వోష్ఠపాణిపాదతలో దుర్భగో వలీపలితఖాలిత్యజుష్టో బహుభుగుష్ణద్వేషీ క్షిప్రకోపప్రసాదో మధ్యమబలో మధ్యమాయుశ్చ భవతి.

శ్లో. మేధావీ నిపుణమతిర్విగృహ్యవక్తా తేజస్వీ సమితిషు దుర్నివారవీర్యః,
సుప్తస్సన్ కనకపలాశకర్ణికారాన్సంపశ్యేదపిచ హుతాశవిద్యుదుల్కాః.
న భయాత్ప్రణమేదనతేష్వమృదుః ప్రణతేష్వపి సాంత్వనదానరుచిః,
భవతీహ సదా వ్యథితాస్యగతిస్స భవేదిహ పిత్తకృతప్రకృతిః.
భుజఙ్గోలూకగన్ధర్వయక్షమార్జారవానరైః,
వ్యాఘ్రర్క్షనకులానూకైః పిత్తికాస్తు నరాస్స్మృతాః. 52

చెమట, దౌర్గన్ధ్యము, పచ్చనిశరీరము,శిథిలమైనయవయవములు, నఖములు, నేత్రములు, ముఖము, దౌడలు, నాలుక, పెదవులు, అరచేతులు, అరకాళ్లు ఇవి యెఱుపుగ నుండుట, వికారమైనయాకారము, శరీరము ముడతలు బడుట, నరసినవెండ్రుకలు, బట్టతల, మిగులభుజించుట, ఉష్ణపదార్థములయందు ద్వేషము, తీవ్రమైనకోపము తీవ్రముగ సంతోషము, మధ్యమబలము, మధ్యమాయుష్యము, బుద్ధివిశేషము, చాతుర్యము, నిరాకరించి మాటలాడుట, అధికమైనతేజస్సు, యుద్ధమునందు జయింపఁదగనిపరాక్రమము, స్వప్నమునందు బంగారు, మోదుగపుష్పము, ఱేలచెట్టు, అగ్ని, మెఱుపు, కొఱవికట్టె, అను నివిగాంచుట, ఆపత్కాలమునందుకూడ లొంగకుండుట, తనకు లోఁబడనివారియందు క్రూరముగనుండుట, తనకులోఁబడినవారి నూరడించుట, ముఖరోగము, నడచునపుడు సంకటము, ఇట్టిలక్షణములుకలవాఁడు పిత్తప్రకృతికలవాఁడని తెలియవలయును. మఱియు పిత్తప్రకృతిగల మనుజులు సర్పము, గుడ్లగూబ, గంధర్వులు, యక్షులు, పిల్లి, కోఁతి, పెద్దపులి, భల్లూకము (ఎలుగుబంటు), ముంగిస అనుజంతువులయొక్క స్వభావము గలవారుగ నుండెదరు.

## శ్లేష్మప్రకృతిమనుజలక్షణము.

సూ. దూర్వేన్దీవరనిస్త్రింశార్ద్రారిష్టశరకాణ్డానా మన్యతమవర్ణస్సుభగః

ప్రియదర్శనో మధురప్రియః కృతజ్ఞో ధృతిమాన్సహిష్ణురలోలుపో
బలవాంశ్చిరగ్రాహీ దృఢవైరశ్చ భవతి.

శ్లో. శుక్లాక్షస్స్థిరకుటిలాతినీలకేశో లక్ష్మీవాఞ్జలదమృదఙ్గసింహఘోషః,
సుప్తస్సన్సకమలహంసచక్రవాకాన్సంపశ్యేదపిచజలాశయాన్మనోజ్ఞాన్.
రక్తాన్తనేత్రస్సువిభక్తగాత్రస్స్నిగ్ధచ్ఛవిస్సత్వగుణోపపన్నః,
క్లేశక్షమోమానయితా గురూణాం జ్ఞేయో బలాసప్రకృతిర్మనుష్యః.
దృఢశాస్త్రమతిస్స్థిరమిత్రధనః పరిగణ్య చిరాత్ప్రదదాతి బహు,
పరినిశ్చితవాక్యపదస్సతతం గురుమానకరశ్చ భవేత్స సదా.
బ్రహ్మరుద్రేన్ద్రవరుణైస్సింహాశ్వగజగోవృషైః,
తార్క్ష్యహంససమానూకాశ్లేష్మప్రకృతయో నరాః. 53

గఱికె, నల్లకలువ, ఖడ్గము, పచ్చివెదురు, రెల్లు, వీనిలో నేదైన నొకదానివర్ణముతో సమానమైన శరీరవర్ణము, ఐశ్వర్యము, సౌందర్యము, మధురపదార్థములయం దిచ్ఛ, కృతజ్ఞత, ప్రశస్తమగు ధైర్యము, ఓర్పు, లోభవిహీనుఁడుగ నుండుట, బలము, గంభీరమైనహృదయము, దృఢమైనవైరము, తెల్లనికన్నులు, బిరుసుగ వంకరగ నల్లగ నుండువెండ్రుకలు, సంపద, మేఘము, మృదంగము, సింహము, వీనిశబ్దముతో తుల్యమైన కంఠధ్వని, స్వప్నమునందు కమలములు, హంసలు, చక్రవాకములు, వీనితోఁగూడియుండు తటాకములఁగాంచుట, నేత్రాంతములయందు రక్తవర్ణము, సువిభక్తగాత్రము (మంచిలక్షణములతోఁ గూడియుండుశరీరము) మనోహరమైన శరీరకాంతి, సత్త్వగుణము, క్లేశమును సహించుట, గురుదేవతలయందు విశ్వాసము, శాస్త్రములయందు దృఢమైనబుద్ధి, స్థిరమైనస్నేహము, బాగుగయోచించి ధనమునిచ్చుట, వాక్యార్థమును దృఢముగ నిశ్చయించుట, ఎల్లపుడు గురువును సన్మానించుట, ఇట్టిలక్షణములు గల వాఁడు శ్లేష్మప్రకృతిగలవాఁడని తెలియవలెను. మఱియు, శ్లేష్మప్రకృతిగలనరులు బ్రహ్మ, రుద్రుఁడు, వరుణుఁడు, సింహము, అశ్వము, గజము, ఆవు, ఎద్దు, గరుడపక్షి, హంస అనువానిస్వభావముతో తుల్యమైనస్వభావముగలవారుగ నుండెదరు.

## ప్రకృతినిర్ణయము.

శ్లో. ద్వయోర్వా తిసృణాం వాపి ప్రకృతీనాం తు లక్షణైః,
జ్ఞాత్వా సంసర్గజా వైద్యః ప్రకృతీరభినిర్దిశేత్. 54

వైద్యుఁడగువాఁడు ద్వంద్వ (రెండుదోషములవలనఁ గలిగిన) ప్రకృతులును, సన్నిపాత (త్రిదోషములవలనఁ గలిగిన) ప్రకృతులును, సంసర్గజప్రకృతిలక్షణముల వలన నెఱింగి ఆయాప్రకృతిభేదముల నిశ్చయింపవలెను.

### వాతాదిప్రకృతిస్వరూపము.

శ్లో. ప్రకోపో వాఽన్యథాభావః క్షయో వా నోపజాయతే,
ప్రకృతీనాం స్వభావేన జాయతే తు గతాయుషః.
విషజాతో యథా కీటో న విషేణ విపద్యతే,
తద్వత్ప్రకృతయో మర్త్యం శక్నువన్తి న బాధితుమ్. 55

పైఁజెప్పిన వాతాదిప్రకృతులకు ప్రకోపముగాని, వికారముగాని, క్షయముగాని, స్వభావముగ గలుగకుండును. అయితే జీవితకాలాంతమున పై వాతపిత్తాదిప్రకృతులు ప్రకోపాదులఁ జెందును. "విషము తనయందు పుట్టినపురుగును బాధింపకుండు చందముగ" వాతాది ప్రకృతులు స్వసంబంధముగల మనుజుల విశేషముగ పీడింపకుండును. ఐన నవి కరచరణాదులయందుఁ గలిగెడిపగుళ్లవలన మాత్రము స్వల్పముగ బాధించును.

శ్లో. ప్రకృతిమిహ నరాణాం భౌతికీం కేచిదాహుః
పవనదహనతోయైః కీర్తితాస్తాస్తు తిస్రః,
స్థిరవిపులశరీరః పార్థివశ్చ క్షమావాన్
శుచిరథ చిరజీవీ నాభసస్సైర్మహద్భిః. 56

పంచమహాభూతములవలన ప్రకృతులు జనించి వాతపిత్తకఫభేదముచే త్రివిధంబులై యుండును. పార్థివప్రకృతిగలవాఁడు దార్ఢ్యస్థౌల్యములతోఁ గూడియుండునట్టి శరీరము, ఓర్పుకలవాఁడై యుండును. ఆకాశప్రకృతిగలవాఁడు శుచి, దీర్ఘాయుష్యము గలవాఁడై యుండును. ఇటులనే ఆయాభూతగుణములవలన మనుజులయొక్క ఆప్యము మొదలగు ప్రకృతిభేదంబులఁ దెలియందగును. పంచమహాభూతములవలన జనించిన ప్రకృతి యొక్కొకభూతసంబంధమువలన నైదువిధంబులై, రెండురెండుభూతముల సంబంధమువలన పదివిధంబులై, మూఁడుమూఁడుభూతముల సంబంధము వలనను, నాలుగునాలుగు భూతములసంబంధమువలనను పలువిధంబులై విలసిల్లు చుండునని కొందఱాచార్యులు వచించెదరు. "ప్రకృతి సత్త్వాదిగుణసంబంధమువలన నేడువిధంబులై యుండునని నాగార్జునుఁడు వచించుచున్నాఁడు."

### బ్రహ్మకాయలక్షణము.

శ్లో. శౌచమాస్తిక్యమభ్యాసో వేదేషు గురుపూజనమ్,
ప్రియాతిథిత్వమిజ్యా చ బ్రహ్మకాయస్య లక్షణమ్. 57

ఆచారము, ఆస్తిక్యబుద్ధి, వేదాభ్యాసము, గురుపూజ, అతిథిసత్కారము, యజ్ఞమునందుఁ బ్రీతి, ఈలక్షణములుకలవాఁడు బ్రహ్మకాయుఁడని తెలియవలయును.

మహేంద్రకాయలక్షణము.

శ్లో. మాహాత్మ్యం శౌర్యమాజ్ఞా చ సతతం శాస్త్రబుద్ధితా,
భృత్యానాం భరణం చాపి మాహేన్ద్రం కాయలక్షణమ్. 58

మాహాత్మ్యము, శూరత్వము, ఆజ్ఞాపించుట, ఎల్లపుడు శాస్త్రాభ్యాసము, భృత్యపోషణము, ఈలక్షణములు కలవాఁడు మహేంద్రకాయుఁడని తెలియవలయును.

వరుణకాయలక్షణము.

శ్లో. శీతసేవా సహిష్ణుత్వం పైఙ్గల్యం హరికేశతా,
ప్రియవాదిత్వమిత్యేతద్వారుణం కాయలక్షణమ్. 59

శీతపదార్థసేవనము, ఓర్పు, నేత్రములయందు పసుపువర్ణము, కపిలవర్ణముగల వెండ్రుకలు, ప్రియసంభాషణము, ఈలక్షణములు కలవాఁడు వరుణకాయుఁడని తెలియవలెను.

కుబేరకాయలక్షణము.

శ్లో. మధ్యస్థతా సహిష్ణుత్వమర్థస్యాగమసఞ్చయౌ,
మహాప్రసవశక్తిత్వం కౌబేరం కాయలక్షణమ్. 60

మాధ్యస్థ్యము (తీర్పుచెప్పుట), ఓర్పు, ధనార్జనము, ధనసంచయము, విశేషమైన ప్రజోత్పాదనశక్తి, ఈలక్షణములు కలవాఁడు కుబేరకాయుఁడని తెలియవలయు.

గాంధర్వకాయలక్షణము.

శ్లో. గన్ధమాల్యప్రియత్వం చ నృత్యవాదిత్రకామితా,
విహారశీలతా చైవ గాన్ధర్వం కాయలక్షణమ్. 61

చందనము, పుష్పము, నృత్యము, గానము, వాద్యము వీనియం దిచ్ఛగలిగియుండుట, విహరించుస్వభావము, ఈలక్షణములు గలవాఁడు గాంధర్వకాయుఁడని తెలియవలయు.

యమకాయలక్షణము.

శ్లో. ప్రాప్తకారీ దృఢోత్థానో నిర్భయస్స్మృతిమాఞ్ఛుచిః,
రాగమోహభయద్వేషైర్వర్జితో యామ్యసత్త్వవాన్. 62

యుక్తకాలమునందు కర్మల నాచరించుట, ఆరంభించిన కార్యమును సాంగముగ నెరవేర్చుట, భయము లేకుండుట, పూర్వానుభూతపదార్థమును స్మరించుట, శుచిత్వము, ఆశ అజ్ఞానము భయము ద్వేషము ఇవిలేకుండుట, అనునీలక్షణములు కలవాఁడు యమకాయుఁడని తెలియవలయు.

ఋషికాయలక్షణము.

శ్లో. జపవ్రతబ్రహ్మచర్యహోమాధ్యయనసేవనమ్,
జ్ఞానవిజ్ఞానసమ్పన్నమృషిసత్త్వం నరం విదుః. 63

జపము, వ్రతము, బ్రహ్మచర్యము, హోమము, అధ్యయనము, జ్ఞానము, విజ్ఞానము, ఈగుణములు కలవాఁడు ఋషికాయుఁడని తెలియవలయు.

శ్లో. సప్తైతే సాత్త్వికాః కాయాః రాజసాం స్తు నిబోధ మే. 64

పైనఁజెప్పిన యేడుకాయములును సాత్త్వికములు. ఇఁక రాజసకాయములను వివరించెదము.

అసురకాయలక్షణము.

శ్లో. ఐశ్వర్యవన్తం రౌద్రం చ శూరం చణ్డమసూయకమ్,
ఏకాశినం చౌదరికమాసురం సత్త్వమీదృశమ్. 65

ప్రశస్తమైన యైశ్వర్యము, భయంకరమైనరూపము, శౌర్యము, అధికకోపము, అసూయ, ఒంటరిగభుజించుట, మిక్కుటముగభుజించుట, ఇట్టి లక్షణములు కలవాఁడు అసురకాయుఁడని తెలియవలెను.

సర్పకాయలక్షణము.

శ్లో. తీక్ష్ణమాయాసినం భీరుం చణ్డం మాయాన్వితం తథా,
విహారాచారచపలం సర్పసత్త్వం విదుర్నరమ్. 66

తీక్ష్ణత్వము, ఆయాసము, అధికభయము, అతికోపము, మాయ, విహారాచారముల యందు చాపల్యము, ఇట్టిలక్షణములు గలవాఁడు సర్పకాయుఁడని తెలియవలయు.

పక్షికాయలక్షణము.

శ్లో. ప్రవృద్ధకామసేవీ చాప్యజస్రాహార ఏవ చ,
అమర్షణోఽనవస్థాయీ శాకునం కాయలక్షణమ్. 67

అతికామము, ఎల్లప్పుడు భక్షణమునందిచ్ఛ, కోపము, ఒకచోట నిలవకుండుట, ఈలక్షణములు కలవాఁడు పక్షికాయుఁడని తెలియవలయు.

రాక్షసకాయలక్షణము.

శ్లో. ఏకాన్తగ్రాహితా రౌద్రమసూయా ధర్మబాహ్యతా,
భృశమాత్రం తమశ్చాపి రాక్షసం కాయలక్షణమ్. 68

ఏకాంతముగ నపహరించుట, ఉగ్రస్వభావము, అసూయ, ధర్మమును నిందించుట, విశేషముగ తమోగుణము, ఈ లక్షణములు కలవాఁడు రాక్షసకాయుఁడని తెలియవలయు.

పైశాచకాయలక్షణము.

శ్లో. ఉచ్ఛిష్టాహారతా తైక్ష్ణ్యం సాహసప్రియతా తథా,
స్త్రీలోలుపత్వం నైర్లజ్యం పైశాచం కాయలక్షణమ్. 69

ఉచ్ఛిష్ట (ఎంగిలి) భక్షణము, కార్యములయందు తైక్ష్ణ్యము, శాస్త్రవిరుద్ధాచారమునందుఁ బ్రీతి, పరస్త్రీలయం దిచ్ఛ, లజ్జలేకుండుట, ఈలక్షణములు కలవాఁడు పైశాచకాయుఁడని తెలియవలెను.

### ప్రేతకాయలక్షణము.

శ్లో. అసంవిభాగమలసం దుఃఖశీలమసూయకమ్,
లోలుపం చాప్యదాతారం ప్రేతసత్త్వం విదుర్నరమ్. 70

కార్యాకార్యములయం దవివేకము, ఆలస్యము, దుఃఖించుస్వభావము, అసూయ, లుబ్ధత్వము, కృపణత్వము, ఈలక్షణములు గలవాఁడు ప్రేతకాయుఁడని తెలియవలయు.

శ్లో. షడేతే రాజసాః కాయాస్తామసాంస్తు నిబోధ మే. 71

పైఁజెప్పిన నాఱును రాజసకాయములు. ఇఁక తామసకాయముల వివరించెదము.

### పశుకాయలక్షణము.

శ్లో. దుర్మేధస్త్వం మన్దతా చ స్వప్నే మైథుననిత్యతా,
నిరాకరిష్ణుతా చైవ విజ్ఞేయాః పాశవా గుణాః. 72

దుర్బుద్ధి, సర్వకార్యములం దాలస్యము, ఎల్లపుడు మైథునముఁ జేయునటుల స్వప్నముఁ గాంచుట, పరుల నిరాకరించుట, ఈగుణములు గలవాఁడు పశుకాయుఁడని తెలియవలెను.

### మత్స్యకాయలక్షణము.

శ్లో. అనవస్థితతా మౌర్ఖ్యం భీరుత్వం సలిలార్థితా,
పరస్పరాభిమర్దశ్చ మత్స్యసత్త్వస్య లక్షణమ్. 73

సర్వకార్యములయందు వ్యవస్థ లేకుండుట, మూర్ఖత్వము, భయము, ఎల్లప్పుడు నుదకమునందుఁ బ్రీతి, పరస్పర ద్వేషము, ఈలక్షణములు కలవాఁడు మత్స్యకాయుఁడని తెలియవలయు.

### వృక్షకాయలక్షణము.

శ్లో. ఏకస్థానరతిర్నిత్యమాహారే కేవలే రతః,
వానస్పత్యో నరస్సత్త్వధర్మకామార్థవర్జితః. 74

ఎల్లపు డొకచోటనుండుట, ఆహారము నెప్పుడు కోరుచుండుట, సత్త్వగుణము ధర్మము కామము అర్థము ఇవి లేకుండుట, అనునీలక్షణములు గలవాఁడు వృక్షకాయుఁడని తెలియవలెను.

శ్లో. ఇత్యేతే త్రివిధాః కాయాః ప్రోక్తా వై తామసాస్తథా. 75

పైఁ జెప్పిన మూఁడుకాయములును తామసకాయములు.

కాయానాం ప్రకృతీర్జ్ఞాత్వా త్వనురూపాం క్రియాం చరేత్. 76

శ్లో. మహాప్రకృతయస్త్వేతా రజస్సత్వతమఃకృతాః,
ప్రోక్తా లక్షణతస్సమ్యగ్భిషక్తాశ్చ విభావయేత్. 77

ఇతి శ్రీసుశ్రుతాచార్యవిరచితే ఆయుర్వేదశాస్త్రే సుశ్రుతే
తృతీయే శారీరస్థానే చతుర్థోఽధ్యాయః.

సత్త్వరజస్తమోగుణములవలన జనించిన మహాప్రకృతులయొక్క లక్షణములు పైనఁ జెప్పంబడియె. కావున వైద్యుఁడు వానిలక్షణంబుల బాగుగ నెఱింగి ఆయాశరీర ప్రకృతి కనుగుణముగఁ జికిత్స చేయవలయు.

---

# పంచమాధ్యాయము.

సూ. అథాతశ్శరీరసఙ్ఖ్యావ్యాకరణం శారీరం వ్యాఖ్యాస్యామః. 1

గర్భవర్ణనము తెలిసినంతమాత్రమున శరీరతత్త్వము విపులముగ గోచరించదు; కాన ఏశరీరతత్త్వమును దెలిసికొని నిస్సంశయముగ నెట్టివ్యాధులనైన ననాయాసముగఁ జికిత్స చేయుట కనుకూలముగ నుండునో, అట్టిశరీరసంఖ్యావ్యాకరణ (శరీరమునందుండు అంగప్రత్యంగముల నొక్కొకదాని పరిమాణము, సంఖ్య మొదలగువానిని దెలుపునట్టి) మను నీ యధ్యాయమును గర్భవర్ణనానంతరము వివరించెదము.

## గర్భవృద్ధివివరణము.

సూ. శుక్రశోణితం గర్భాశయస్థమాత్మప్రకృతివికారసమ్మూర్ఛితం గర్భ ఇత్యుచ్యతే. తం చ చేతనావస్థితం వాయుర్విభజతి; తేజ ఏనం పచతి; ఆపః క్లేదయన్తి; పృథివీ సంహన్తి; ఆకాశం వివర్ధయతి. ఏవం వివర్ధితస్స యదా హస్త పాదజిహ్వా ఘ్రాణ కర్ణ నితమ్బాదిభిరఙ్గై రుపేతస్తదా శరీరమితి సంజ్ఞాం లభతే. తచ్చ షడఙ్గం శాఖాశ్చతస్రో; మధ్యం పఞ్చమం; షష్ఠం శిర ఇతి. 2

ఆత్మ (క్షేత్రజ్ఞుఁడు), ప్రకృతి, వికృతి అనువానితో వ్యాప్తంబై గర్భాశయమును జెందియుండు శుక్రశోణితసముదాయముచే గర్భమని చెప్పంబడును. వాయువు ప్రసవకాల పర్యంతము చేతనాయుక్తమైన గర్భముయొక్క వాతాదిదోషములను, రక్తాదిధాతువులను మలములను, కరచరణాద్యంగములను, అంగుళ్యాది ప్రత్యంగములను

విభజన సేయుచుండును. తేజస్సు గర్భమునకు రూపాంతరమును గలుగఁజేయుచుండును. ఈప్రకారము వాయువువలన విభక్తమై పరిణామమును జెందిన గర్భమును తేజస్సు శోషింపఁజేయుచుండఁగా దాని నుదకము తడుపుచుండును. ఉదకసంబంధమువలన స్రవించు గర్భమును పృథివి గట్టిగఁ జేయుచుండును. అట్టిగర్భమును ఆకాశము వృద్ధిఁ జేయుచుండును. ఇటుల పంచమహాభూతసంబంధమువలనఁ వృద్ధిఁ జెందిన గర్భము, హస్తములు, పాదములు, నాలుక, ముక్కు, చెవులు, పిఱుఁదులు మొదలగు యంగములతోఁ గూడియుండునపుడు శరీరమని పరఁగు. ఆశరీరము హస్తపాదములు, మధ్య భాగము, శిరస్సు అను నాలుంగములతోఁ గూడియుండును.

## ప్రత్యంగవివరణము.

సూ. అతః పరం ప్రత్యఙ్గాని వక్ష్యన్తే. మస్తకోదర పృష్ఠ నాభి లలాట నాసా చుబుక వస్తి గ్రీవా ఇత్యేతా ఏకైకాః. కర్ణ నేత్ర నాసా భ్రూశఙ్ఖాంస గణ్డ కక్ష స్తన వృషణ పార్శ్వ స్ఫిగ్జాను బాహూరు ప్రభృతయో ద్వేద్వే. వింశతి రఙ్గుళయః. స్రోతాంసి చ వక్ష్యమాణాని. ఏష ప్రత్యఙ్గవిభాగ ఉక్తః. 3

శిరస్సు, ఉదరము, వీఁపు, నాభి, లలాటము (నుదుఱు), ముక్కు, గడ్డము, వస్తి (పొత్తికడుపు), కంఠము, అను నొక్కొకటిగనుండు నవయవములు, చెవులు, నేత్రములు, నాసారంధ్రములు, కనుబొమలు, కణతలు, భుజశిరస్సులు, చెక్కిళ్లు, చంకలు, స్తనములు, వృషణములు, ప్రక్కలు, పిఱుఁదులు, మోకాళ్లు, చేతులు, తొడలు మొదలగు జంటజంటగనుండు నవయవములును, యిరువదివ్రేళ్లను, ఇఁకఁ జెప్పఁబోవు స్రోతస్సులును ప్రత్యంగములని చెప్పఁబడును గాన ఈప్రకారము ప్రత్యంగవిభాగము చెప్పం బడియె.

## త్వగాదివిభాగము.

సూ. తస్య పునస్సఙ్ఖ్యేయాని - త్వచః కలా ధాతవో మలా దోషా యకృత్ప్లీహానౌ పుప్ఫుస ఉన్డుకో హృదయమాశయా అన్త్రాణి వృక్కౌ స్రోతాంసి కణ్డరా జాలాని కూర్చా రజ్జవస్సేవన్య స్సఙ్ఘాతా స్సీమన్తా అస్థీని సన్ధయ స్నాయవః పేశ్యో మర్మాణి సిరాధమన్యో యోగవహాని. స్రోతాంసి చ. 4

త్వక్కులు, కలలు, ధాతువులు, మలములు, దోషములు, యకృత్తు, ప్లీహము, పుప్ఫుసము, ఉండుకము, హృదయము, ఆశయములు, అంత్రములు (ప్రేగులు), వృక్కలు, స్రోతస్సులు, కండరములు, జాలములు, కూర్చలు, రజ్జువులు, సేవనులు, సంఘాత

ములు, సీమంతములు, అస్థులు, సంధులు, స్నాయువులు, పేశీలు, మర్మములు, సిరలు, ధమనులు, యోగవహస్రోతస్సులు (ప్రాణము, ఉదకము, అన్నము వీనిని వహించు నాడులు) అను నిరువది తొమ్మిదియు గర్భముయొక్క అంగప్రత్యంగములఁ జేర్చునవి యని తెలియవలయును.

### త్వగాదిసంఖ్యాసంగ్రహము.

సూ. త్వచస్సప్త కలాస్సప్త. ఆశయాస్సప్త. ధాతవస్సప్త. సప్త సిరా శతాని. పఞ్చ పేశీశతాని. నవ స్నాయుశతాని. త్రీణ్యస్థిశతాని. ద్వేదశోత్తర సన్ధిశతే. సప్తోత్తరం మర్మశతం. చతుర్వింశతిర్ధమన్యః. త్రయోదోషాః. త్రయో మలాః. నవ స్రోతాంసి. షోడశ కండరాః. షోడశ జాలాని షట్ కూర్చాః. చతస్రో రజ్జవః. సప్త సేవన్యః. చతుర్దశ సంఘాతాః. చతుర్దశ సీమంతాః. ద్వావింశతిః యోగవహాని స్రోతాంసి. ద్వేశాన్యంత్రాణి చేతి. 5

త్వక్కులు 7, కలలు 7, ఆశయములు 7, ధాతువులు 7, సిరలు 700, పేశీలు 500, స్నాయువులు 900, అస్థులు (ఎముకలు) 300, సంధులు 210, మర్మలు 107, ధమనులు 24, దోషములు 3, మలములు 3, స్రోతస్సులు, 9, కండరములు 16, జాలములు 16, కూర్చలు 6, రజ్జువులు 4, సేవనులు 7, సంఘాతములు 14, సీమంతములు 14, యోగవహాస్రోతస్సులు 22, అంత్రములు 2, అని త్వగాదులసంఖ్య తెలుపఁబడియె.

### త్వగాదివివరణము.

సూ. విస్తారోఽత ఊర్ధ్వమ్. త్వచోఽభిహితాః, కలా ధాతవో మలా దోషా యకృత్ప్లీహానౌ పుప్ఫుస ఉన్డుకో హృదయం వృక్కౌచ. 6

త్వక్కులు, కలలు, ధాతువులు, మలములు, దోషములు, యకృత్తు, ప్లీహము, పుప్ఫుసము, ఉండుకము, హృదయము, వృక్కలు, అనువానిలో దోషములు, ధాతువులు, మలములు అనునవి యీ సుశ్రుతసూత్రస్థానమునందును, మిగిలిన త్వగాదులన్నియుఁ బూర్వాధ్యాయమునను వివరముగఁ జెప్పంబడియె.

### ఆశయవివరణము.

సూ. ఆశయా స్తు వాతాశయః పిత్తాశయశ్శ్లేష్మాశయో రక్తాశయ ఆమాశయః పక్వాశయో మూత్రాశయ స్త్రీణాం గర్భాశయో ఽష్టమ ఇతి. 7

వాత, పిత్త, శ్లేష్మ, రక్త, ఆమ, పక్వ, మూత్రాశయములను నేడాశయములు స్త్రీపురుషుల కిరువురికి సాధారణముగ నుండును. స్త్రీలకు మాత్రము పురుషులకంటె నెనిమిదవది యగుగర్భాశయ మధికముగ నుండును.

## అంత్రవివరణము.

సూ. సార్ధత్రివ్యామాన్యన్త్రాణి పుంసాం. స్త్రీణామర్ధవ్యామహీనాని. 8

పురుషులకుఁ బ్రేగులు మూఁడున్నరబార నిడుపును స్త్రీలకు మూఁడుబారల నిడుపును కలిగియుండును.

## స్రోతో వివరణము.

సూ. శ్రవణ నయన వదన ఘ్రాణ గుద మేఢ్రాణి నవ స్రోతాంసి నరాణాం బహిర్ముఖాణి. ఏతాన్యేవ స్త్రీణామపరాణి చ త్రీణి; ద్వే స్తనయో రధస్తాద్రక్తవహం చ. 9

చెవులు, నేత్రములు, నోరు, నాసికారంధ్రములు, గుదము, మేఢ్రము, అను తొమ్మిది స్రోతస్సులు స్త్రీపురుషులకు బహిర్ముఖములుగ నుండును. స్త్రీలకు మాత్రము స్తనములయందు రెండుస్రోతస్సులును, "విపులపిప్పలపత్రసమాకృతే రవయవస్య శిరస్థల మాశ్రితమ్, సకలకామసిరాముఖచుంబితం విమృదితం మదనాతపవారణమ్" అను వచనప్రకారము రావియాకుతో సమానమైనయాకారముగల యోనియొక్క శిరో భాగమునందు మూఁడవసుడి నాశ్రయించియుండు ఆర్తవమును వహించునట్టి స్రోతస్సు ఒకటియును, పురుషులకంటె నధికముగ నుండును. "స్రోతాంసి నాసికే కర్ణౌ నేత్రే పాయ్వాస్య మేహనం, స్తనౌ రక్తవహాశ్చేతి నారీణామధికం త్రయమ్" స్త్రీపురుషుల కిరువురికిఁ బూర్వోక్తశ్రవణాదినవస్రోతస్సులును సాధారణములుగ నుండుటయే గాక స్త్రీలకు స్తనములు, ఆర్తవమును వహించుచు యోనిమధ్యమునందుండు స్రోతస్సు అను నవిమాత్ర మధికముగనుండునని గ్రంథాంతరమునందుఁ జెప్పఁబడియున్నది.

## కండరావివరణము.

సూ. షోడశ కణ్డరాః. తాసాం చతస్రః పాదయో స్తావత్యో హస్త గ్రీవా పృష్ఠేషు తత్ర హస్తపాదగతానాం కణ్డరాణాం నఖాః ప్రరోహాః, గ్రీవాహృదయనిబన్ధినీనా మధోభాగగతానాం మేఢ్రం శ్రోణిపృష్ఠనిబన్ధినీనామధోభాగగతానాం బిమ్బః. ఊరువక్షోక్షి పిండాదిగతానాం చ మూర్ధా. 10

కండరములు (లావుగనుండుస్నాయువులు) 16, వానిలో పాదములయందు (పాదాదికటిఫలకమువఱకు) 4, హస్తములయందు (చేయిమొదలు చంకవఱకు) 4, మెడ యందు (మెడకు నిరువంకలు, మెడకు వెనుక భాగమువఱకు) 4, వీఁపుయందు (వెన్నె ముకకిరుపార్శ్వములయందు) 4 వ్యాపించియుండును. ఈకండరములు పాదాది ప్రదేశ ములయందు రెండు లావుగను, రెండు సన్నముగను నుండును. సన్నముగ నుండునవి

నిద్రాదియవస్థలయందు తమంతట తాము ఆకుంచన ప్రసారణముల (ముడుచుకొనుట-చాచుట)ను జేయుచుండును. లావుగనుండునవి ప్రయత్నము గలిగినప్పుడు ఆకుంచనాదులఁ జేయుచుండును. పైఁజెప్పిన హస్తములయందును, పాదములయందును, వ్యాపించిన కండరములయగ్రములే నఖములు; మెడ, హృదయము వీనిని బంధించి యధోభాగమును వ్యాపించియుండు కండరముల యగ్రములే మేఢ్రము; శ్రోణి (పిఱుఁదులు), వీఁపు, వీనిని దృఢముగ బంధించి యధోభాగమును జెందిన కండరముల యగ్రములే బింబము (రంధ్రయుక్తమగు త్రికాస్థి); తొడలు, వక్షము, నేత్రగోళములు వీనిని వ్యాపించియుండు కండరములయగ్రములే శిరస్సు అని తెలియ నగును.

## మాంసజాలాదివివరణము.

సూ. మాంససిరాస్నాయ్వస్థిజాలాని ప్రత్యేకం చత్వారి చత్వారి. తాని మణిబన్ధగుల్ఫసంశ్రితాని పరస్పరనిబద్ధాని పరస్పరసంశ్లిష్టాని పరస్పరగవాక్షితాని చేతి; యైర్గవాక్షితమిదం శరీరమ్. 11

మాంసజాలము, సిరాజాలము, స్నాయుజాలము, అస్థిజాలము, అనునవి నాలుగు నాలుగుచొప్పున ప్రత్యేకములుగ నుండును. ఆజాలములు గవాక్షరూపములై మణికట్టు, చీలమండ అనువీని నాశ్రయించి పరస్పరము మిళితంబులై కట్టఁబడియుండును. జాలమన గవాక్షము గాన నీశరీర మిట్టి గవాక్షములతోఁ గూడినదని తెలియవలయును. మాంసజాలమనఁగా:—గవాక్షాకారమైన మాంసవిశేషమని యర్థము. ఇటులనే సిరాస్నాయ్వస్థిజాలముల నెఱుంగనగును.

## కూర్చవివరణము.

సూ. షట్కూర్చాస్తే హస్తపాదగ్రీవామేఢ్రేషు. హస్తయోర్ద్వౌ పాదయోర్ద్వౌ గ్రీవామేఢ్రయోరేకైకః. 12

హస్తములయందు 2, పాదములయందు 2, కంఠమునందు 1, శిశ్నమునందు 1, ఈప్రకారము హస్తపాదగ్రీవామేఢ్రములయందు 6, కూర్చలు (ధమనీస్నాయువుల సముదాయము) ఉండును. మఱికొందఱు స్నాయుధమనీసముదాయ మగుకూర్చలు:—మెడ, చంకలు, వంక్షణము (గజ్జలు) అనువానియం దొక్కొక్కటిచొప్పున నైదును, ధమనీసముదాయ మగుకూర్చ మేఢ్రమునం దొకటియుం జేరి యాఱుకూర్చలు కనఁబడుచున్నవని చెప్పెదరు.

## మాంసరజ్జువివరణము.

సూ. మహత్యో మాంసరజ్జవశ్చతస్రః. పృష్ఠవంశముభయతః పేశీనిబన్ధనార్థం ద్వే బాహ్యే అభ్యన్తరే చ ద్వే. 13

గొప్పవి యగుమాంసరజ్జువులు (త్రాడులు) 4 ఉండును. అవి వెన్నెముక కిరుపార్శ్వములయందును పేశీనిబంధనార్థము లోపలిభాగమున 2 ను, పైభాగమున 2 ను ఉండును.

## నేవనీవివరణము.

సూ. సప్త సేవన్యః. శిరసి విభక్తాః పఞ్చ, జిహ్వాశేఫసో రేకైకా తాః పరిహర్తవ్యాశ్శస్త్రేణ. 14

శిరస్సునందుఁ బ్రత్యేక ప్రత్యేకముగ 5, నాలుకయందు 1, శిశ్నమునందు 1, ఇటుల నేడు సేవనులుండును. వీనియందు శస్త్రప్రయోగము సేయఁజనదు.

## అస్థిసంఘాతవివరణము.

సూ. చతుర్దశాస్థ్నాం సఙ్ఘాతాః. తేషాం త్రయో గుల్ఫజానువఙ్క్షణేషు. ఏతేనేతరసక్థి బాహూ చ వ్యాఖ్యాతౌ. త్రికశిరసో రేకైకః. 15

చీలమండ, మోకాలు, వంక్షణము (గజ్జ), అనువానియందొక్కొక్కటిచొప్పున రెండుకాళ్ళయందును 6, మణికట్టు, మోచెయ్యి, చంక, అనువానియందొక్కొక్కటి చొప్పున రెండుచేతులయందును 6, ముడ్డిపూసయందు 1, శిరమునందు 1, ఇటుల పదు నాలుగు అస్థిసంఘాతము (దృఢమగు అస్థిసంయోగము) లుండును. అందు చీలమండ, మణిబంధము అనువానియందు దేడేసియు, మోచేతియందు 2, మోకాలునందు 4, చంక గజ్జ అనువానియందు రెండేసియు, శిరస్సునందు 6, ముడ్డిపూసయందు 3 ను ఎముకల సంధిగలవిగ పైఁ జెప్పఁబడిన యస్థిసంఘాతముల నెఱుంగవలయు.

## సీమంతవివరణము.

సూ. చతుర్దశైవ సీమన్తాః. తే చాస్థిసఙ్ఘాతవద్గణనీయాః, యతస్తైర్యుక్తా అస్థిసఙ్ఘాతాః యే హ్యుక్తాః. సీమంతాస్తు ఖల్వష్టాదశైకేషామ్. 16

సీమంతములు 14, వానితో నస్థిసంఘాతములు కూడియుండుటవలన నస్థిసంధుల వలెనే సీమంతములస్థానములను సంఖ్యను దెలియవలయును. మఱియు, నీసీమంతములు 18 యనికొందఱు వచించెదరు. ఈయర్థమునే "చతుర్దశాస్థిసంఘాతాస్సీమన్తా ద్విగుణా నవ" యని గ్రంథాంతరమునందుఁ జెప్పఁబడియున్నది.

## అస్థిసంఖ్యావివరణము.

సూ. త్రీణి సషష్టీన్యస్థిశతాని వేదవాదినో భాషన్తే. శల్యతన్త్రే తు త్రీణ్యేవాస్థిశతాని. తేషాం అష్టాదశోత్తరం శతం శాఖాసు. పంచాధికం శతం శ్రోణిపార్శ్వపృష్ఠోరఃకంఠనాడీషు. గ్రీవాం ప్రత్యూర్ధ్వం సప్తసప్తతిః. ఏవమస్థ్నాం త్రీణి శతాని పూర్యన్తే. 17

ఏముకలు 360 అని వేదవాదులు (యాజ్ఞవల్క్యాదులు) వచించుచున్నారు. శల్యతంత్రమునందు ధన్వంతరిప్రభృతులు 300 అని వచించిరి. వానిలో హస్తపాద

ములయందు 118 పిఱుఁదులు, ప్రక్కలు, వీఁపు, ఱొమ్ము, కంఠనాడి, వీనియందు 105, మెడకు పైభాగమునందు 77, నీప్రకారము 300 యెముకలుండును.

### హస్తపాదగతాస్థిసంఖ్యావివరణము.

సూ. ఏకైకస్యాం తు పాదాఙ్గుళ్యాం త్రీణి త్రీణి, అంగుష్ఠే ద్వే, తాని చతుర్దశ. తలకూర్చగుల్ఫసంశ్రితాన్యేకాదశ, పార్ష్ణ్యామేకమ్, జఙ్ఘాయాం ద్వే, జానున్యేకమ్, ఏకమూరావితి, త్రింశదేవమేకస్మిన్సక్థ్ని భవన్తి. ద్వితీయేఽప్యేవం ఏతేనైవ చ జానువర్జేన బాహూ చ వ్యాఖ్యాతౌ. 18

ఒక్కొక కాలివ్రేలియందు 3, చొప్పున నాలుగువ్రేళ్లయందు 12 ను, బొట్టనవ్రేళ్లయందు 2 ను గలసి 14, అరకాలియందు 5, కూర్చము (స్నాయు మర్మ భేదము) నందు 3, చీలమండయందు 3, ఇటుల నరకాలుకూర్చము. చీలమండ అనువానియందు 11 మడమ (చీలమండకు క్రిందిభాగము) యందు 1, పిక్కలయందు 2, మోకాలునందు 1, తొడయందు 1, ఇటుల నొకకాలియందు యెముకలు 30, ఇటులనే రెండవకాలియందు 30 యుండును. కాలియందుండునటులనే చేతియందును జెప్పఁబడెనుగాని, కాలియందు మాత్రము జాన్వస్థియొక్కటి యధికముగ నుండుటచేతను చేతియందు (మోచేతియందు) నది లేకపోవుటచేత నొకటితగ్గుటవలన 29 మాత్రము చేతియందుండును. ఇటుల రెండు చేతులయందును కాళ్లయందును గూడ కలసి 118 ఎముకలుండును.

### శ్రోణ్యాదిగతాస్థిసంఖ్యావివరణము.

సూ. శ్రోణ్యాం పఞ్చ, తేషాం గుదభగనితమ్బేషు చత్వారి, త్రికసంశ్రితమేకమ్, పార్శ్వయోరష్టచత్వారింశత్. పృష్ఠే చతుర్వింశతి, ద్వే అంసపీఠే, ఉరసి త్రీణి, అక్షకసంజ్ఞే ద్వే, పుప్ఫుసనిబద్ధాయాం కంఠసంసక్తాయాం నాడ్యామేకవింశతిః. 19

శ్రోణి (కటి) యందు 5, వానిలో గుదము, భగము, నితంబములు అనువానియందు 4, త్రికము (ముడ్డిపూస) యందు 1 యు నుండును. పార్శ్వము (ప్రక్క) లయందు 48, పృష్ఠభాగమునందు 24, అంసపీఠమునందు 2, ఱొమ్ముయందు 3, జత్రుప్రదేశములందు అక్షకమను పేరంబరగునవి 2, శ్వాసవహనాడియందు 21, యు నిట్లు కటిమొదలుకొని కంఠమువఱకు నుండునవి 105 యెముకలని తెలియవలయును.

### గ్రీవాదిగతాస్థిసంఖ్యావివరణము.

సూ. గ్రీవాయాః పురస్తాత్ నవకమ్, తదూర్ధ్వమేకమ్, అభ్యన్తరతః కర్ణశంకులోర్యధస్తాత్ షట్, గణ్డకర్ణశంఖేష్వేకైకమ్, హను

సమాఖ్యమేకమ్, దన్తా ద్వాత్రింశత్, నాసాయామష్టౌ, నాసాయా
ముపకనీనకం ద్వే, అపాంగయోరధస్తాత్ ద్వే, వర్త్మసంజ్ఞే ద్వే,
షట్ శిరసి, శిరసోఽభ్యంతరే చ ద్వే. 20

కంఠమునందు 9, కంఠమునకు పైభాగమునందు 1, కర్ణశంఖులికి క్రిందిభాగము నందు మధ్యభాగమునందును 6, గండ, కర్ణ, శంఖములు (చెవికి నపాంగమునకు మధ్య ప్రదేశము) వీనియం దొక్కొకటి చొప్పున నిరువంకల 6, హనువను పేరుగలది 1, దంతములు 32, నాసికయందు 8, నాసికమొదలు కనీనికప్రాంతమువఱకు నుండునవి 2, అపాంగములయొక్క క్రిందిప్రదేశమున 2, వర్మ్తసంజ్ఞగలవి 2, శిరస్సుయందు 6, శిరస్సుయొక్క మధ్యమునందు 2, ఇటుల మెడకు పైభాగమునందుండునవి 77 ఎముకలనియు తెలియనగును.

## అస్థిభేదవివరణము.

సూ. ఏతాని పఞ్చవిధాని భవన్తి. తద్యథా.—కపాలరుచకతరుణవల
యనలకసంజ్ఞాని. తేషాం జానునితమ్బాంసగణ్డశఙ్ఖశిరస్సు కపాలాని.
దశనాస్తు రుచకాని. ఘ్రాణకర్ణగ్రీవాక్షికోశకంఠనాడీషు తరుణాని.
పాణిపాదపార్శ్వపృష్ఠోరస్సు వలయాని. శేషాణి నలకసంజ్ఞాని. 21

పైఁ జెప్పఁబడిన యెముకలు కపాల, రుచక, తరుణ, వలయ, నలకము లను నైదువిధములగు భేదములు గలిగియుండును. వానిలో మోకాలు, పిఱుదులు, భుజములు, గండము (కనుబొట్ట)లు, కణతలు, శిరస్సు అను వానియందుండునవి కపాలము లనియు, దంతములు రుచకములనియు, ముక్కు, చెవులు, మెడ, నేత్రకోశములు, కంఠనాడి వీనియందుండునవి తరుణములనియు, హస్తములు, పాదములు, ప్రక్కలు, వీఁపు, ఱొమ్ము వీనియందుండునవి వలయములనియు, తక్కినస్థానములందుండునవి నలకము లనియుఁ జెప్పంబడును.

భవన్తి చాత్ర.—

శ్లో. అభ్యన్తరగతై స్సారైర్యథా తిష్ఠన్తి భూరుహాః,
అస్థిసారై స్తథా దేహా ధ్రియన్తే దేహినాం ధ్రువమ్.
తస్మాచ్చిరవినష్టేషు త్వఙ్మాంసేషు శరీరిణామ్,
అస్థీని న వినశ్యన్తి సారాణ్యేతాని దేహినామ్.
మాంసాన్యత్ర నిబద్ధాని సిరాభిస్స్నాయుభి స్తథా,
అస్థీన్యాలమ్బనం కృత్వా న శీర్యన్తే పతన్తి వా. 22

లోపలిభాగమునందుండుసారము (చేవ) వలన వృక్షములు దృఢముగనుండుచందంబున నస్థిసారమువలనఁ బ్రాణులయొక్క దేహము దృఢముగ నుండును. కావునఁ బ్రాణులయొక్క త్వఙ్మాంసములు చిరకాలమునకు శిథిలమై యుండినను సారభూతమైన యస్థులు మాత్రము నశింపకుండును. మఱియు నస్థులయందు మాంసము సిరాస్నాయువుచే దృఢముగఁ గట్టఁబడియుండుటవలన మాంసము శైథిల్యమును జెందియు వీడిపడకుండును.

## సంధిద్వైవిధ్యనిరూపణము.

సూ. సన్ధయస్తు ద్వివిధాశ్చేష్టావన్తస్స్థిరాశ్చ. 23

అస్థిసంధులు చేష్టావంతములు (తిరుగునవి), స్థిరములు (తిరగనివి) అనిరెండు విధములుగ నుండును.

శ్లో. శాఖాసు హన్వోః కట్యాం చ చేష్టావన్తస్తు సన్ధయః,
శేషాస్తు సన్ధయస్సర్వే విజ్ఞేయా హి స్థిరా బుధైః. 24

హస్తములు, పాదములు, హనుప్రదేశము, కటి, వీనియందుండు అస్థిసంధులు చలములనియు, తక్కినయస్థిసంధులు స్థిరము లనియుఁ దెలియవలయు.

## అస్థిసంధిసంఖ్యావివరణము.

సూ. సఙ్ఖ్యాతస్తు దశోత్తరే ద్వేశతే, తేషాం శాఖాస్వష్టషష్టిరేకోననవతిః కోష్ఠే, గ్రీవాం ప్రత్యూర్ధ్వం త్రిపంచాశత్. 25

హస్తపాదములయందు 68, కోష్ఠమునందు 89, మెడకుపైన 53, ఇటుల 210 అస్థిసంధులుండును.

## హస్తపాదగతాస్థిసంధిసంఖ్య.

సూ. ఏకైకస్యాం పాదాఙ్గుళ్యాం త్రయస్త్రయో, ద్వావఙ్గుష్ఠే, తే చ చతుర్దశ, జానుగుల్ఫవఙ్క్షణేష్వేకైకః, ఏవం సప్తదశైకస్మిన్సక్థ్ని భవన్తి. ఏతేనేతరసక్థి బాహూ చ వ్యాఖ్యాతౌ. 26

ఒక్కొకపాదాంగుళియందు 3 అస్థిసంధులచొప్పున నాలుగువ్రేళ్లయందును 12, బొటనవ్రేలియందు 2 ను చేరి 14, మోకాలు, చీలమండ, గజ్జ, వీనియందొక్కొక్కటి చొప్పున 3 ను చేరి యొకకాలియందు 17 అగును. ఈప్రకారమే రెండవ కాలునందును, రెండుచేతులందును నుండును. ఇటుల నస్థిసంధులు శాఖలయందు 68 యని తెలియనగును.

## కోష్ఠగతాస్థిసంధిసంఖ్య.

సూ. పంచ కటీకపాలేషు, చతుర్వింశతిః పృష్ఠవంశే, తావన్త ఏవ పార్శ్వయోః, ఉరసి షోడశ, పుప్ఫుసనిబద్ధాయాం కంఠసంసక్తాయాం నాడ్యాం వింశతిః. 27

కటిసంబంధమైన కపాలాస్థులయందు అస్థిసంధులు 5, వెన్నెముకయందు 24, ప్రక్కలయందు 24, ఱొమ్మునందు 16, పుప్ఫుసనిబంధమగు శ్వాసవహనాడియందు 20, ఇటుల కోష్ఠమునందు 89 అస్థిసంధులుండును.

## గ్రీవోపర్యస్థిసంధిసంఖ్య.

సూ. త్రయః కణ్ఠే, దన్త పరిమాణా దన్తమూలేషు, నాసాయాం ఏకః, ద్వౌ వర్త్మమణ్డలజౌ నేత్రాశ్రయౌ, దణ్డ కర్ణ శఙ్ఖేష్వేకైకః, ద్వౌ హనుసన్ధీ, ద్వావధస్తాచ్ఛంఖయోః, పఞ్చ శిరఃకపాలేషు. 28

కంఠమునందు 3, దంతమూలములందు 32, ముక్కునందు 1, నేత్రకోశసంబంధమగు వర్త్మమండలములందు 2, కనుబొట్టలు (గండ చెవులు, కణతలు) అనువానియందు 6, హనుసంధులు 2, కణతలకు క్రిందిప్రదేశములందు 2, శిరః కపాలాస్థులయందు 5, ఇటుల 53 అస్థిసంధు లుండును.

## అస్థిసంధి భేదములు.

సూ. త ఏతే సన్ధయోఽష్టవిధాః. కోరోదూఖలసాముద్గప్రతర తున్న సేవనీవాయసతుణ్డమణ్డలశఙ్ఖావర్తాః. తేషామఙ్గుళి మణిబన్ధ గుల్ఫ జాను కూర్పరేషు కోరా స్సన్ధయః. కక్షావఙ్క్షణ దశనేషూదూఖలాః, అంసపీఠ గుద భగ నితమ్బేషు సాముద్గాః. గ్రీవా పృష్ఠవంశయోః ప్రతరాః. శిరః కటీ కపాలేషు తున్నసేవనీ. హన్వోరుభయతస్తు వాయసతుణ్డాః. కణ్ఠ నేత్ర పుప్ఫుస నాడీషు మణ్డలాః శ్రోత్రశృఙ్గాటకేషు శంఖావర్తాః. తేషాం నామభిరేవాకృతయః ప్రాయేణ వ్యాఖ్యాతాః. 29

పైఁజెప్పఁబడిన యస్థిసంధులు కోరము, ఉదూఖలము, సాముద్గము, ప్రతరము, తున్నసేవని, వాయసతుండము, మండలము, శంఖావర్తము అని యెనిమిది విధములుగ నుండును. వానిలో వ్రేళ్లు, మణికట్టు. చీలమండ, మోకాలు, మోచెయ్యి వీనియందలి యస్థిసంధులు కోరములనియు, చంకలు, గజ్జలు, దంతములు వీనియందలి యస్థిసంధులు ఉదూఖలములనియు, భుజములు (అంసపీఠము), గుదము, భగము, పిఱుఁదులు అనువాని యందలియస్థిసంధులు సాముద్గములనియు, మెడ, వెన్నెముక వీనియందుండు యస్థిసంధులు ప్రతరములనియు, శిరము, కటి, కపాలము అనువానియందలి యస్థిసంధులు తున్నసేవనులనియు, హనుప్రదేశమున కుభయపార్శ్వములందుండుసంధులు వాయసతుండము లనియు, కంఠము, నేత్రము, పుప్ఫుసనాడి వీనియందుండు నస్థిసంధులు మండలములనియు, చెవులు, శృంగాటకము (నాసామూలమునకు దగ్గరప్రదేశము) వీనియందలి

యస్థిసంధులు శంఖావర్తములనియుఁ దెలియవలయును. పైఁ జెప్పినయష్టవిధసంధి స్వరూపములను వానివానినామములచేతనే తెలియుచుగ నెఱుంగఁదగును.

శ్లో. అస్థ్నాంతు తు సన్ధయో హ్యేతే కేవలాః పరికీర్తితాః,
పేశీ స్నాయు సిరాణాం తు సన్ధిసఙ్ఖ్యా న విద్యతే. 30

ఈప్రకారము అస్థిసంధులు మాత్రము చెప్పఁబడియె. పేశులు, స్నాయువులు, సిరలు, అనువానిసంధిసంఖ్య నెఱుంగుట కశక్యము.

స్నాయుసంఖ్యావివరణము.

సూ. నవ స్నాయుశతాని. తాసాం శాఖాసు షట్ఛతాని. ద్వే శతే త్రింశచ్చ కోష్ఠే. గ్రీవాం ప్రత్యూర్ధ్వం సప్తతిః. 31

హస్తపాదములయందు 600, కోష్ఠమునందు 230, మెడ మొదలుకొని పైభాగమునందు 70, ఇటుల యావచ్ఛరీరమునందు 900 స్నాయువు లుండును.

హస్తపాదగతస్నాయుసంఖ్యావివరణము.

సూ. ఏకైకస్యాం తు పాదాఙ్గుళ్యాం షణ్ణిచితా స్తాః స్త్రింశత్. తావత్య ఏవ తలకూర్చగుల్ఫేషు. తావత్య ఏవ జఙ్ఘాయామ్. దశ జానుని. చత్వారింశదూరౌ. దశ వఙ్క్షణే శతమధ్యర్థమేవ మేకస్మిన్సక్థ్ని భవన్తి. ఏతేనేతరసక్థి బాహూ చ వ్యాఖ్యాతౌ. 32

ఒక్కొకకాలివ్రేలియందు 6 చొప్పున నైదువ్రేళ్లయందును స్నాయువులు 30, అరకాలు, కూర్చము, (అంగుష్ఠాంగుళిమధ్యమునకు పైభాగము) చీలమండ, వీనియందు స్నాయువులు 30, పిక్కయందు స్నాయువులు 30, మోకాటిచిప్పయందు స్నాయువులు 10, తొడయందు స్నాయువులు 40, గజ్జయందు స్నాయువులు 10, ఇటుల నొకకాలియందు 150 స్నాయువులుండును. ఈప్రకారమే మఱియొక కాలు, రెండు చేతులు అనువానిలో ప్రతిదానియందును 150 స్నాయువులు చొప్పున రెండుకాళ్లయందును, రెండుచేతులయందును 600 స్నాయువులుండును.

మధ్యప్రదేశగతస్నాయుసంఖ్య.

సూ. షష్టిః కట్యామ్. అశీతిః పృష్ఠే. పార్శ్వయోష్షష్టిః. ఉరసిత్రింశత్.

కటి యందు స్నాయువులు 60, వీఁపుయందు స్నాయువులు 80, ప్రక్కలయందు స్నాయువులు 60, ఱొమ్మునందు స్నాయువులు 30, యిటుల శరీరమధ్యప్రదేశమునందు 230 స్నాయువులుండును.

## శ్రీవోపరిభాగగతస్నాయుసంఖ్యా.

సూ. షట్త్రింశద్గ్రీవాయామ్. మూర్ధ్ని చతుస్త్రింశత్. ఏవం నవ స్నాయుశతాని వ్యాఖ్యాతాని. 34

మెడయందు 36, శిరస్సునందు 34, ఇటుల 70 స్నాయువులు మెడకుఁ బైభాగమునందుండును. ఈప్రకారము శరీరాద్యంతమునందుండు స్నాయువులు 900 అని చెప్పఁబడియె.

భవన్తి చాత్ర:—

శ్లో. స్నాయూశ్చతుర్విధా విద్యాత్తాస్తు సర్వా నిబోధ మే,
ప్రతానవత్యో వృత్తాశ్చ పృథ్వ్యశ్చ సుషిరాస్తథా.
ప్రతానవత్యశ్శాఖాసు సర్వసన్ధిషు చాప్యథ,
వృత్తాస్తు కణ్డరాస్సర్వా విజ్ఞేయాః కుశలైరిహ.
ఆమపక్వాశయాన్తేషు వస్తౌ చ సుషిరాః ఖలు,
పార్శ్వోరసి తథా పృష్ఠే పృథులాశ్చ శిరస్యథ.
నౌర్యథా ఫలకాస్తీర్ణా బన్ధనైర్బహుభిర్యుతా,
భారక్షమా భవేదప్సు నృయుక్తాసు సమాహితా.
ఏవమేవ శరీరేఽస్మిన్యావన్తస్సన్ధయస్స్మృతాః,
స్నాయుభిర్బహుభిర్బద్ధాస్తేన భారసహా నరాః. 35

స్నాయువులు ప్రతానవతులు, వృత్తములు, పృథ్వులు, సుషిరములు అని నాలుగువిధంబులు. వానిలో ప్రతానవతులు (తీఁగలవలె సన్ననై వ్యాపించియుండునవి) హస్తపాదములయందును, వృత్తములు (గుండ్రముగ నుండునవి) సర్వ సంధులయందును, సుషిరములు (రంధ్రములు గలవి), ఆమాశయము, పక్వాశయము వీనియంతమందును, వస్తియందును, పృథులములు (లావుగనుండునవి) పార్శ్వము, ఱొమ్ము, వీపు, శిరము అను వానియందును వ్యాపించియుండును. పలకలతో పరుపఁబడి త్రాళ్లతో కట్టఁబడియుండునట్టియోడ మనుష్యులతో నిండి జలమునందు భారమును వహించుచుండునటుల యీశరీరమునందు సర్వసంధు లనేకస్నాయువులతోఁ గట్టఁబడియుండుటవలన మానవులు భారమును వహించు చుండెదరు.

శ్లో. న హ్యస్థీని న వా పేశ్యో న సిరా న చ సన్ధయః,
వ్యాపాదితాస్తథా హన్యుర్యథా స్నాయుశ్శరీరిణః.
యస్స్నాయూః ప్రవిజానాతి బాహ్యాశ్చాభ్యన్తరాస్తథా,
స గూఢం శల్యమాహర్తుం దేహాచ్ఛక్నోతి దేహినామ్. 36

మనుజులకు స్నాయువులు వికృతిఁజెందుటవలనఁ బ్రాణభయము గలుగునటుల నస్థులు, పేశులు, సిరలు, సంధులు, అనునవి వికృతిఁ జెందుటవలన ప్రాణభయము గలుగకుండును. బాహ్యాభ్యంతరస్నాయుభేదంబుల బాగుగ నెఱుంగువాఁడు ప్రాణుల యొక్క దేహాంతర్గతమైన శల్యమును దీయుటకు సమర్థుండగును.

### పేశీసంఖ్య.

సూ. పఞ్చ పేశీశతాని భవన్తి. తాసాం చత్వారి శతాని శాఖాసు. కోష్ఠే షట్షష్టిః. గ్రీవాం ప్రత్యూర్ధ్వం చతుస్త్రింశత్. 37

హస్తపాదములయందు 400, కోష్ఠమునందు 66, మెడమొదలుకొని పైభాగమునందు 34, ఇటుల సర్వశరీరమునందు 500 పేశులుండును.

### హస్తపాదగతపేశీసంఖ్య.

సూ. ఏకైకస్యాం తు పాదాఙ్గుల్యాం తిస్రస్తిస్రస్తాః పఞ్చదశ. దశ ప్రపదే. పాదోపరి కూర్చసన్నివిష్టాస్తావత్య ఏవ. దశ గుల్ఫతలయోః. గుల్ఫజాన్వన్తరే వింశతిః. పఞ్చ జానుని. వింశతిరూరౌ. దశ వఙ్క్షణే. శతమేవ మేకస్మి న్సక్థ్ని భవన్తి. ఏతేనేతరసక్థి బాహూ చ వ్యాఖ్యాతౌ. 38

ఒక్కొక పాదాంగుళియందు 3-3, చొప్పున నైదువ్రేళ్లయందు 15, పాదాగ్రమునందు 10, పాదపృష్ఠమునందు 10, చీలమండ, అరకాలు వీనియందు 10, చీలమండ, మోకాలు వీనిమధ్యమునందు 20, మోకాటిచిప్పయందు 5, తొడయందు 20, గజ్జయందు 10, ఇటుల నొకకాలియందు 100 పేశులుండును. ఇత్తెఱంగుననే మఱియొక కాలు, రెండుచేతులు అనువానిలో ప్రతిదానియందును 100 పేశిల చొప్పున రెండుకాళ్లయందును, రెండుచేతులయందును 400 పేశిలుండును.

### కోష్ఠగతపేశీసంఖ్య.

సూ. తిస్రః పాయౌ. ఏకా మేఢ్రే. సేవన్యాం చాపరా. ద్వే వృషణయోః. స్ఫిచోః పఞ్చ పఞ్చ ద్వే వస్తి శిరసి. పఞ్చోదరే. నాభ్యామేకా. పృష్ఠోర్ధ్వసన్నివిష్టాః పఞ్చ పఞ్చ దీర్ఘాః. షట్పార్శ్వయోః. దశ వక్షసి. అక్షకాంసౌ ప్రతి సమన్తాత్సప్త. ద్వే హృదయామాశయయోః, షడ్యకృత్ప్లీహోన్డుకేషు. 39

గుదమునందు 3, శిశ్నమునందు 1, సేవని (శిశ్నమునకుక్రిందనుండునరము) యందు 1, వృషణములయందు 2, ఒకపిఱ్ఱయందు 5 చొప్పున రెండుపిఱ్ఱలయందును 10, వస్తిశిరము (వృక్కలు)నందు 2, ఉదరమునందు 5, నాభియందు 1, వీఁపుయొక్క పైప్ర

దేశమునందు దీర్ఘముగనుండునవి 10, పార్శ్వములయందు 6, ఱొమ్మునందు 10, అక్షకము భుజములు వీనియొక్క చుట్టుప్రదేశమునందు 7, హృదయము, ఆమాశయము వీనియందు 2, యకృత్తు, ప్లీహము, ఉండుకము వీనియందు 6, ఇటుల కోష్ఠప్రదేశమునందు 66 పేశీ లుండును.

### గ్రీవోర్ధ్వగత పేశీసంఖ్య

సూ. గ్రీవాయాం చతస్రః. అష్టౌ హనుసమాఖ్యే. ఏకైకా కాకలక గళయోః. ద్వే తాలుని. ఏకా జిహ్వాయామ్. ఓష్ఠయోర్ద్వే. ఘోణాయాం ద్వే. ద్వే నేత్రయోః. గణ్డయో శ్చతస్రః. కర్ణయోర్ద్వే. చతస్రో లలాటే. ఏకా శిరసి. ఇత్యేవ మేతాని పఞ్చపేశీ శతాని.

శ్లో. సిరాస్నాయ్వస్థిపర్వాణి సన్ధయశ్చ శరీరిణామ్,
పేశీభిస్సంవృతాన్యత్ర బలవన్తి భవన్త్యతః. 40

మెడయందు 4, హనువు (కటిమర్ల) యందు 8, కంఠమణియందు 1, గళమునందు, 1, దౌడలయందు 2, నాలుకయందు 1, పెదవులయందు 2, నాసికయందు 2, నేత్రములయందు 2, గండము (కనుబొట్ట) లయందు 4, చెవులయందు 2, లలాటము (నుదురు) నందు 4, శిరమునందు 1, ఇటుల మెడకు పైప్రదేశమున 34 పేశీలుండును. ఈప్రకారము యావచ్ఛరీరమునందుండు 500 పేశీలును జెప్పఁబడియె. మనుజులయొక్క సిరలు, స్నాయువులు, అస్థిపర్వములు, సంధులు, వీనిని మాంసపేశీలావరించికొనియుండుటవలన నాసిరాదులు దృఢముగ నున్నవి.

### స్త్రీ పేశీసంఖ్య.

సూ. స్త్రీణాం తు వింశతిరధికా. దశ తాసాం స్తనయోరేకైకస్మిన్పఞ్చ పఞ్చ, యౌవనే తాసాం పరివృద్ధిః. అపత్యపథే చతస్రస్తాసాం ప్రసృతేఽభ్యన్తరతో ద్వే. ముఖాశ్రితే బాహ్యే చ ప్రవృత్తే ద్వే. గర్భచ్ఛిద్రసంశ్రితాస్తిస్రః. శుక్రార్తవప్రవేశిన్యస్తిస్రఏవ. *పిత్తపక్వాశయమధ్యే గర్భాశయో యత్ర గర్భస్తిష్ఠతి. 41

పురుషులకంటె స్త్రీలకు 20 పేశీ లధికముగ నుండును, వానిలో నొక్కొక స్తనమునందైదైదు చొప్పున రెండుస్తనములయందును 10 పేశీలుండును. నయ్యవి యౌవనకాలమునందు వృద్ధిఁ జెందుచుండును. యోని లోపలిభాగమునందు వ్యాపించియుండు పేశీలు 2, యోనిముఖముయొక్క యిరుపార్శ్వములయందు వ్యాపించి స్పర్శముచే సుఖము నిచ్చుచు వర్తులముగనుండు పేశీలు 2, యిటులయోనియందు 4 పేశీలుండును. గర్భమార్గము (ఛిద్రము) నాశ్రయించి సుళ్లవలెనుండు పేశీలు 3, పిత్తపక్వా

* 'వస్తిపక్వాశయ' యని పాఠాన్తరము.

శయములను మధ్యమునందుండు గర్భాశయమునందు శుక్రార్తవములఁ బ్రవేశింపం జేయునట్టి పేశీలు 3, ఇటులఁ బురుషులకంటె స్త్రీలకు 20 పేశీ లధికముగ నుండును.

### స్థానవిశేషమువలన పేశీస్వరూపము.

సూ. తాసాం బహలపేలవస్థూలాణుపృథువృత్తహ్రస్వదీర్ఘస్థిరమృదుశ్లక్ష్ణకర్కశభావాస్సన్ధ్యస్థిసిరాస్నాయుప్రచ్ఛాదకా యథాదేశం స్వభావత ఏవ భవన్తి. 42

పైఁజెప్పఁబడిన పేశీలలో, సంధులు, అస్థులు, సిరలు, స్నాయువులు, వీనిని మూసికొని యుండునట్టి పేశీలు ఆయాప్రదేశములయందు స్వభావమువలన విశాలముగ, సన్నముగ, లావుగ, చిన్నవిగ, ఘనముగ, గుండ్రముగ, పొట్టిగ, పొడవుగ, గట్టిగ, మృదువుగ, నున్నగ, కఠినముగ నుండును.

భవతి చాత్ర.—

శ్లో. పుంసాం పేశ్యః పురస్తాద్యాః ప్రోక్తా లక్షణముష్కజాః,
స్త్రీణామావృత్య తిష్ఠన్తి ఫలమన్తర్గతం హి తాః. 43

పురుషులకు శిశ్నము, వృషణములు వీనియందు పైజెప్పిన 3 పేశీలుండునటు లనే స్త్రీలకు 3 పేశీలు గర్భాశయమునందుఁ జుట్టుకొని యుండును.

సూ. మర్మసిరాధమనీస్రోతసామన్యత్ర ప్రవిభాగః. 44

మర్మలు, సిరలు, ధమనులు, స్రోతస్సులు, అని వానివిభాగముత్తరత్ర చెప్పంబడును.

### యోనిలక్షణము.

శ్లో. శఙ్ఖనాభ్యాకృతిర్యోనిస్త్ర్యావర్తా సా ప్రకీర్తితా,
తస్యాస్తృతీయే త్వావర్తే గర్భశయ్యా ప్రతిష్ఠితా. 45

యోని శంఖనాభ్యాకృతి గలదై మూఁడుసుడులతోఁ గూడియుండును. వానిలో మూఁడవసుడియందు గర్భస్థానముండును.

### గర్భాశయలక్షణము.

శ్లో. యథా రోహితమత్స్యస్య ముఖం భవతి రూపతః,
తత్సంస్థానాం తథారూపాం గర్భశయ్యాం విదుర్బుధాః 46

ఆగర్భస్థానము రోహితమత్స్యముఖాకారముగలదై యుండును.

### గర్భస్థశిశువుయొక్కయవస్థ.

శ్లో. ఆభుగ్నో ఽభిముఖశ్శేతే గర్భో గర్భాశయే స్త్రియాః,
స యోనిం శిరసా యాతి స్వభావాత్ప్రసవం ప్రతి. 47

స్త్రీ యొక్క గర్భాశయమునందు పూర్వజన్మకర్మమువలన సంకుచితావయవయు
సించుచుండుశిశువు ప్రసవకాలమునందు స్వభావముగ యోని కభిముఖముగ
సరించుకొని బైలువెడలును.

## అంగప్రత్యంగనిశ్చయోపాయము.

త్వక్పర్యన్తస్య దేహస్య యోఽయమఙ్గవినిశ్చయః,
శల్యజ్ఞానాదృతే నైష వర్ణ్యతేఽఙ్గేషు కేషుచిత్.
తస్మాన్నిస్సంశయం జ్ఞానం హర్త్రా శల్యస్య వాఞ్ఛతా,
శోధయిత్వా మృతం సమ్యగ్ద్రష్టవ్యోఽఙ్గవినిశ్చయః.
ప్రత్యక్షతో హి యద్దృష్టం శాస్త్రదృష్టం చ యద్భవేత్,
సమాసతస్తదుభయం భూయో జ్ఞానవివర్ధనమ్. 48

హముయొక్క యస్థులు మొదలుకొని త్వక్పర్యంతము నుండునట్టియంగముల
నిర్ణయము శల్యతంత్రజ్ఞానము లేకయే సిద్ధించుట దుర్లభము. కావున, శరీర
ంలను బైలుపరప నిశ్చయించువానికి సర్వాంగజ్ఞానము నిస్సందేహముగ గలిగి
రెను. అట్లగుటంజేసి మృతశరీరమును జక్కగ కడిగి యంగవిభాగమును
వలయును. ప్రత్యక్షముగఁ జూచుటవలనను శాస్త్రజ్ఞానమువలనను దేహజ్ఞాన
వృద్ధియగును.

## అంగశోధనవివరణము.

తస్మాత్సమస్తగాత్రమవిషోపహతమదీర్ఘవ్యాధిపీడితమవర్షశతికం
ృష్టాన్త్రపురీషం పురుషమావహన్త్యామాపగాయాం నిబద్ధం
స్థం ముఞ్జవల్కలకుశశణాదీనామన్యతమేనావేష్టితాఙ్గమప్ర
దేశే కోథయేత్. సమ్యక్ప్రకుథితం చోద్ధృత్య తతో దేహం
త్రాదుశీరబాలవేణువల్కలకూర్చీనామన్యతమేన శనైరవ
షం స్త్వగాదీన్సర్వానేవ బాహ్యాభ్యన్తరానఙ్గప్రత్యఙ్గవిశేషా
క్షాన్లక్షయేచ్చక్షుషా. 49

పున సంపూర్ణావయవయుక్తుఁడు, విషము, దీర్ఘవ్యాధి, వీనిచేఁ బీడింపఁబడ
హరు సంవత్సరముల వయస్సుకు లోఁబడినవాఁడు నైనపురుషునియొక్క శవ
దించి యందలిప్రేగులను మలమును పరిహరించి యాశరీరమును ముంజగడ్డి,
, జనపపురి మొదలగు వానిలో దేనిచేనైన బాగుగచుట్టి పంజరమునం
హించుచుండునదియందు రహస్యస్థలమున మునుఁగునటుల వైచి కొట్టుకొని
ంల నేడుదినములు కట్టియుంచి పిదప నామృతకళేబరమును బయటికిఁ దీసి

పట్టివేరు, లేతవెదురు, వరిగడ్డి, అను కూర్చములలో దేనిచేఁ గాని మెల్లమెల్లగ రుద్ది కడిగి చూచిన బాహ్యాభ్యంతరములైన త్వక్కు మొదలగుసర్వాంగప్రత్యంగవిశేషములు పైఁ జెప్పినప్రకారము బాగుగఁ గనుపించును.

శ్లోకౌ చాత్ర భవతః.—

శ్లో. న శక్యశ్చక్షుషా ద్రష్టుం దేహే సూక్ష్మతమో విభుః,
దృశ్యతే జ్ఞానచక్షుర్భిస్తపశ్చక్షుర్భిరేవ చ.
శరీరే చైవ శాస్త్రే చ దృష్టార్థస్స్యాద్విశారదః,
దృష్టశ్రుతాభ్యాం సన్దేహమవాపోహ్యాచరేత్క్రియాః. 50

ఇతి శ్రీసుశ్రుతాచార్యవిరచితే ఆయుర్వేదశాస్త్రే సుశ్రుతే
తృతీయే శారీరస్థానే పంచమోఽధ్యాయః.

దేహమునందు వ్యాపించియుండు నతిసూక్ష్ముఁడైన యాత్మ నేత్రములకుఁ గనుపించుట దుర్లభము. అయినను వాఁడు జ్ఞానచక్షువు, తపశ్చక్షువు గలవారలకు మాత్రము కనుపించును. శరీరసంశోధనమువలనను శాస్త్రాభ్యాసమువలనను శరీరతత్త్వమును బాగుగ నెఱింగినవాఁడు పండితుఁడగును. గాన, పైఁ జెప్పినప్రకారము శరీరమును ప్రత్యక్షముగ శోధించి చూచుటవలనను శాస్త్రజ్ఞానమువలనను వైద్యుఁడగువాఁడు సందేహమును బోకడఁచుకొని చికిత్సయందుఁ బ్రవర్తింపవలయు.

# షష్ఠాధ్యాయము.

సూ. అథాతః ప్రత్యేకమర్మనిర్దేశం శారీరం వ్యాఖ్యాస్యామః. 1

శరీరసంఖ్యావ్యాకరణమను పూర్వాధ్యాయమునందు "మర్మసిరాధమనీస్రోత సామన్యత్ర ప్రవిభాగః" అని చెప్పుటచేత నిచ్చట ప్రత్యేకమర్మనిర్దేశమను యధ్యాయమును జెప్పుచున్నాఁడు. ప్రత్యేకమర్మ నిర్దేశమనఁగా? మర్మలను గుఱించిమాత్రము తెలుపునదియనియు, ఒక్కొకమర్మనుగుఱించి విరళముగఁ దెలుపునదియనియుఁ నర్థము. అట్టి యీయధ్యాయమును వివరించెదము.

మర్మసంఖ్యావిభాగము.

సూ. సప్తోత్తరమర్మశతమ్. తాని మర్మాణి పఞ్చాత్మకాని. తద్యథా—
మాంసమర్మాణి, సిరామర్మాణి, స్నాయుమర్మాణి, అస్థిమర్మాణి, సంధి

మర్మాణి చేతి. న ఖలు మాంససిరాస్నాయ్వస్థిసన్ధివ్యతిరేకేణాన్యాని మర్మాణి భవన్తి యస్మాన్నోపలభ్యన్తే. 2

మర్మలు 107. అయ్యవి మాంసమర్మ, సిరామర్మ, స్నాయుమర్మ, అస్థిమర్మ, సంధిమర్మ అవి యైదువిధంబులు. మర్మలనఁగా:—మాంసము, సిరలు, స్నాయువులు, అస్థులు, సంధులు అనువానిపరస్పరసంబంధము గాన, మాంసశిరాస్నాయ్వస్థి సంధుల కంటె వేఱుమర్మలు కానంబడకుండుటవలన నవియే మర్మలని చెప్పఁబడును.

## మాంసమర్మాదిసంఖ్యావివరణము.

సూ. తత్రైకాదశ మాంసమర్మాణి. ఏకచత్వారింశత్సిరామర్మాణి. సప్తవింశతిస్నాయుమర్మాణి. అష్టావస్థిమర్మాణి. వింశతిస్సన్ధిమర్మాణి. తదేతత్సప్తోత్తరం మర్మశతమ్. 3

మాంసమర్మలు 11, సిరామర్మలు 41, స్నాయుమర్మలు 27, అస్థిమర్మలు, 8 సంధిమర్మములు 20, ఇటుల మర్మలన్నియు 107 అని తెలియనగును.

## పాదాదిగతమర్మసంఖ్య.

సూ. తేషామేకాదశైకస్మిన్సక్థ్ని భవన్తి. ఏతేనేతరసక్థిబాహూచ వ్యాఖ్యాతౌ. ఉదరోరసోర్ద్వాదశ. చతుర్దశ పృష్ఠే. గ్రీవాం ప్రత్యూర్ధ్వం సప్తత్రింశత్. 4

పైఁ జెప్పిన 107 మర్మలలో నొకకాలియందు 11మర్మలుండును. ఈప్రకారమే మఱియొకకాలు, రెండు చేతులు, వీనిలో ప్రతిదానియందును 11, చొప్పున రెండు కాళ్లయందును రెండుచేతులయందును 44 మర్మలుండునని తెలియవలయు. ఉదరము, ఱొమ్ము, వీనియందు 12, వీపుయందు 14, మెడకు పైభాగమున 37, ఇటుల సర్వశరీరమునందును 107 మర్మములుండును.

## పాదగతమర్మవివరణము.

సూ. తత్ర సక్థిమర్మాణి క్షిప్ర తల హృదయ కూర్చశిరో గుల్ఫేన్ద్రవస్తి జాన్వాణ్యుర్వీలోహితాక్షాణి విటపం చేతి. ఏతేనేతరం సక్థి వ్యాఖ్యాతమ్. 5

పైఁజెప్పిన పాదాదిమర్మలలో క్షిప్రము 1, తల హృదయము 1, కూర్చము 1, కూర్చశిరము 1, గుల్ఫము 1, ఇంద్రవస్తి 1, జాను 1, అణి, ఉర్వి, లోహితాక్షము 1, విటపము 1, అను నీపదునొకండును నొకకాలియందుండు మర్మలు. ఈప్రకారమే మఱియొకకాలియందుండుమర్మలఁ దెలియనగు.

సూ. ఉదరోరసోస్తు గుద వస్తి నాభి హృదయ స్తనమూల స్తనరోహితాపలాపాన్యపస్తమ్భా చేతి. 6

గుదము, 1, బస్తి 1, నాభి 1, హృదయము 1, స్తనమూలములు 2, స్తనరోహితములు 2, అపలాపములు 2, అపస్తంభములు 2, అను నీపంద్రెండును ఉదరము, ఱొమ్ము వీనియందుండు మర్మలు.

## పృష్ఠగతమర్మవివరణము.

సూ. పృష్ఠమర్మాణి తు కటీక తరుణ కుకున్దర నితమ్బ పార్శ్వసన్ధి బృహత్యంసఫలకాన్యంసౌ చేతి. 7

కటీకము 1, తరుణము 1, కకుందరము 2, నితంబములు 2, పార్శ్వ సంధులు 2, బృహతులు 2, అంసఫలకములు 2, అంసములు 2, అనునీ 14 లును వీపుయందుండు మర్మలు.

## హస్తగతమర్మవివరణము.

సూ. బాహుమర్మాణి తు క్షిప్ర తలహృదయ కూర్చ కూర్చశిరో మణిబన్ధేన్ద్రబస్తి కూర్పరాణ్యూర్వీ లోహితాక్షాణి కక్షధరం చేతి. ఏ తే నేతరో బాహుర్వ్యాఖ్యాతః. 8

క్షిప్రము 1, తలహృదయము 1, కూర్చము 1, కూర్చ శిరము, 1, మణిబన్ధము 1, ఇంద్రవస్తి 1, కూర్పరము, 1, అణి 1, ఊర్వి 1, లోహితాక్షము 1, కక్షధరము 1, అను నీ 11 నొకహస్తమునందుండు మర్మలు. ఈప్రకారమే మఱియొక చేతియందును 11 మర్మలుండునని తెలియవలయును.

## జత్రూర్ధ్వగతమర్మవివరణము.

సూ. జత్రూర్ధ్వం మర్మాణి చతస్రో ధమన్యః, అష్టౌ మాతృకాః ద్వే కృకాటికే, ద్వే విధురే, ద్వౌ ఫణౌ, ద్వావపాఙ్గౌ ద్వావావర్తౌ, ద్వావుత్క్షేపౌ, ద్వౌ శఙ్ఖౌ, ఏకా స్థపనీ, పఞ్చ సీమన్తాః, చత్వారి శృఙ్గాటకాని, ఏకోఽధిపతిరితి. 9

ధమనులు 4, మాతృకలు, 8, కృకాటికలు 2, విధురములు 2, ఫణములు 2, అపాంగములు 2, ఆవర్తములు 2, ఉత్ క్షేపములు 2, శంఖములు 2, స్థపని 1, సీమంతములు 5, శృంగాటకములు 4, అధిపతి 1, అను నీ 37 మెడకొంకులకు పైభాగమునందుండు మర్మలు.

## మాంసమర్మవివరణము.

సూ. తత్ర తలహృదయేఽన్ద్రబస్తిగుద స్తనరోహితాని మాంసమర్మాణి.

పైఁజెప్పినమర్మలలో తలహృదయములు 4, ఇంద్రవస్తులు 4, గుదము 1, స్తనరోహితములు 2, అను నీపదునొకండును మాంసమర్మలు.

### సిరామర్మవివరణము.

సూ. నీలా ధమనీ మాతృకా శృఙ్గాటకాపాఙ్గ స్థపనీ ఫణ స్తనమూలా పలాపాప స్తమ్భ హృదయ నాభి పార్శ్వసన్ధి బృహతీ లోహితాక్షో ర్వ్యస్సిరామర్మాణి. 11

నీల ధమనులు 4, మాతృకలు 8, శృంగాటకములు 4, అపాంగములు 2, స్థపని 1, ఫణములు 2, స్తనమూలములు, 2, అపలాపములు 2, అప స్తంభములు 2, హృదయము 1, నాభి 1, పార్శ్వసంధులు 2, బృహతులు 2, లోహితాక్షములు, 4, ఊర్వులు 4 అనునీ 41 సిరామర్మలు.

### స్నాయుమర్మ వివరణము.

సూ. ఆణి విటప కక్షధర కూర్చ కూర్చశిరో వస్తి క్షిప్రాంస విధురో త్క్షేపాస్నాయుమర్మాణి. 12

ఆణులు 4, విటపములు 2, కక్షధరములు 2, కూర్చములు 4 కూర్చ శిరములు 4, వస్తి 1, క్షిప్రములు 4, అంసములు 2, విధురములు 2, ఉత్ క్షేపములు 2 అను నీ 27 ను స్నాయుమర్మలు.

### అస్థిమర్మవివరణము.

సూ. కటీకతరుణ నితమ్బాంసఫలక శఙ్ఖా స్త్వస్థిమర్మాణి. 13

కటీకతరుణములు 2, నితంబములు 2, అంసఫలకములు 2, శంఖములు 2 అనునీ 8 యు నస్థిమర్మలు.

### సంధిమర్మవివరణము.

సూ. జాను కూర్పర సీమ న్తాధిపతి గుల్ఫ మణిబన్ధ కుకున్దరావర్త కృకాటికాశ్చేతి సన్ధిమర్మాణి. 14

జానువులు 2, కూర్పరములు 2, సీమంతములు 5, అధిపతి 1 గుల్ఫములు 2, మణిబంధములు 2, కుకుందరములు 2, ఆవర్తములు, 2, కృకాటికలు 2 అను నీ 20 సంధిమర్మలు.

### పంచవిధమర్మసంఖ్య.

సూ. తాన్యేతాని పఞ్చ వికల్పాని మర్మాణి భవన్తి తద్యథా.—సద్యః ప్రాణహరాణి, కాలాన్తరప్రాణహరాణి, విశల్యఘ్నాని, వైకల్యకరాణి, రుజాకరాణీతి. తత్ర సద్యః ప్రాణహరాణ్యేకోనవింశతిః. కాలాన్తరప్రాణహరాణి త్రయస్త్రింశత్. త్రీణి విశల్యఘ్నాని చతుశ్చత్వారింశద్వైకల్యకరాణి. అష్టౌ రుజాకరాణీతి. 15

పైఁజెప్పంబడినమర్మలు సద్యఃప్రాణహరములు, కాలాంతరప్రాణహరములు, విశల్యఘ్నములు, వైకల్యకరములు, రుజాకరములని యైదువిధంబులు. వానిలో సద్యః ప్రాణహరంబులు (దెబ్బతగిలినది మొదలు 8, దినములలోఁ బ్రాణములఁ బోఁగొట్టఁదగిన మర్మలు) 19, కాలాంతర ప్రాణహరమర్మలు (దెబ్బతగిలిన నొకమాసములోఁగాని, లేక 15 దినములలోఁగాని ప్రాణములఁ బోఁగొట్టఁదగినమర్మలు) 33, విశల్యఘ్నమర్మలు (శల్యమును వెలిపఱచుటచేఁ బ్రాణములఁ బోఁగొట్టునవి) 3, వైకల్యకరమర్మలు (తగిలిన దెబ్బ బాగుగ స్వస్థముగాకుండ నాయంగమునకుఁ బ్రతిబంధకమునుగాని వికారమును గాని కలుగఁజేయఁదగినవి) 44, రుజాకరమర్మలు (దెబ్బవలన సంకటమును గలుగఁ జేయదగినమర్మలు) 8 అని తెలియవలయును.

## సద్యఃప్రాణహరాదిమర్మవివరణము.

భవన్తి చాత్ర —

శ్లో. శృఙ్గాటకాన్యధిపతిశ్శఙ్ఖౌ కణ్ఠసిరా గుదమ్,
హృదయం వస్తినాభీ చ ఘ్నన్తి సద్యోహతాని తు.
వక్షో మర్మాణి సీమన్తతలక్షిప్రేన్ద్రవస్తయః,
కటీకతరుణే సన్ధీ పార్శ్వజౌ బృహతీ చ యా.
నితమ్బావితి చైతాని కాలాన్తరహరాణి తు,
ఉత్క్షేపౌ స్థపనీ చైవ విశల్యఘ్నాని నిర్దిశేత్.
లోహితాక్షాణి జానూర్వీకూర్చావిటపకూర్పరాః,
కుకున్దరే కక్షధరే విధురే సకృకాటికే.
అంసాంసఫలకాపాఙ్గా నీలే మన్యే ఫణౌ తథా,
వైకల్యకరణాన్యాహురావర్తౌ ద్వౌ తథైవ చ,
గుల్ఫౌ ద్వౌ మణిబన్ధౌ ద్వౌ ద్వే ద్వే కూర్చసిరాంసి చ,
రుజాకరాణి జానీయాదష్టావేతాని బుద్ధిమాన్.
క్షిప్రాణి విద్ధమాత్రాణి ఘ్నన్తి కాలాన్తరేణ చ. 16

శృంగాటకములు, అధిపతి, శంఖములు, కంఠసిరలు, (మాతృకలు) గుదము, హృదయము, వస్తి, నాభి, అను 19 యు సద్యః ప్రాణహరమర్మంబులు. వక్షోమర్మలు (స్తనమూలములు, స్తనరోహితములు, అలాపములు, అపస్తంభములు), సీమంతములు, తలహృదయములు, క్షిప్రములు, ఇంద్రవస్తులు, కటీకతరుణములు, పార్శ్వసంధులు బృహతులు, నితంబములు, అనునీ 33, ను కాలాంతరప్రాణహరమర్మంబులు. ఉత్క్షేపములు, స్థపని, అనునీమూఁడును విశల్యఘ్నమర్మంబులు, లోహితాక్షములు, జానువులు, ఉర్వులు, కూర్చములు, విటపములు, కూర్పరములు, కుకుందరములు, కక్షధరములు,

విధురములు, కృకాటికలు, అంసములు, అంసఫలకములు, అపాంగములు, నీలలు, ధమనులు (మన్యలు) ఫణములు, ఆవర్తములు, అనునీ 44 ను వైకల్యకరమర్మంబులు, గుల్ఫములు, మణిబంధములు, కూర్చశిరస్సులు, అనునీ ౭ యు రుజాకరమర్మంబులు. క్షిప్రమర్మలు, దెబ్బతగిలి కొంతకాలముగడచిన పిదప మానవునిఁ జంపును.

## మర్మలక్షణము.

సూ. మర్మాణి నామ మాంస సిరా స్నాయ్వస్థి సన్ధి సన్నిపాతా స్తేషు స్వభావత ఏవ విశేషేణ ప్రాణా స్తిష్ఠన్తి తస్మాన్మర్మస్వభిహతా స్తాంస్తాన్భావానాపద్యన్తే. 17

మాంసము, సిరలు, స్నాయువులు, అస్థులు, సంధులు, అనువానియొక్క పరస్పర సంబంధమే మర్మలనఁబడును. అట్టిమర్మలయందుఁ బ్రాణములు స్వభావముగనే విశేషముగ సంచరించుచుండును. అట్లగుటచే వానియం దభిఘాతాదులు గలుగుటవలన భ్రమము, ప్రలాపము, పతనము, ప్రమోహము మొదలగునుపద్రవములు గలుగును.

## సద్యఃప్రాణహరాదిమర్మస్వరూపము.

సూ. తత్ర సద్యః ప్రాణహరాణ్యాగ్నేయాన్యగ్నిగుణేష్వాశు క్షీణేషు క్షపయన్తి. కాలాన్తరప్రాణహరాణి సౌమ్యాగ్నేయాన్యగ్నిగుణేష్వాశు క్షీణేషు క్రమేణ చ సోమగుణేషు కాలాన్తరేణ క్షపయన్తి. విశల్యప్రాణహరాణి వాయవ్యాని శల్యముఖనిరుద్ధో యావదన్తర్వాయు స్తిష్ఠతి తావజ్జీవత్యుద్ధృతమాత్రే తు శల్యే మర్మస్థానాశ్రితో వాయుర్నిష్క్రామతి; తస్మాత్సశల్యో జీవత్యుద్ధృతశల్యో మ్రియతే. వైకల్యకరాణి సౌమ్యాని; సోమో హి స్థిరత్వాచ్ఛైత్యాచ్చ ప్రాణావలమ్బనం కరోతి. రుజాకరాణ్యగ్నివాయుగుణభూయిష్ఠాని విశేషతశ్చ తౌ రుజాకరౌ. పాఞ్చభౌతికీం చ రుజామాహురేకే. 18

సద్యఃప్రాణహరమైనమర్మలు, అగ్నిసంబంధముగలవి యగుటవలన వానియందభిఘాతము కలిగినయెడలనగ్నిగుణములైన వేగాదులు శీఘ్రముగ క్షయమునుజెంది తత్క్షణముననే మనుజునిఁ జంపును. కాలాంతరప్రాణహరమర్మలు సోమాగ్నిసంబంధముగల వగుటవలన వానియందభిఘాతము గలిగినయెడల నగ్నిగుణమైన వేగాదులు శీఘ్రముగ క్షయించుచుండఁగ క్రమముగ సోమగుణములైన శీతాదులు క్షయించి కాలాంతరమున మనుజుం జంపును. విశల్యప్రాణహరమర్మలు, వాతసంబంధము గలవగుటవలన వానియం దభిఘాతము గలిగినయెడల శల్యముఖముచే నడ్డగింపఁ బడియుండువాతము ఆమర్మస్థానమునందుండువఱకును మనుజుఁడు జీవించియుండును. శల్యమును బయలుపరచినతోడనె

ఆమర్మ మాశ్రయించి వాతముకూడ బయలువెడలుటవలన మనుజుఁడు మృతిజెందును. వైకల్యకరమర్మలు సోమసంబంధము గలవగుటవలన వానియం దభిఘాతము గలిగినను సోమగుణముచే స్థిరత్వశైత్యములు ప్రాణములను ధారణము సేయుచుండును. అట్లగుటవలన వైకల్యమాత్రము గలుగును. రుజాకరమర్మలు అగ్నివాయుగుణబాహుళ్యము కలవి యగుటంజేసి వానియందభిఘాతముగలిగినయెడల విశేషముగ పీడను గలుగఁజేయును. మఱియు, ఈ రుజాకరమర్మలు పంచభూతసంబంధము గలవి యని కొందఱాచార్యులు వచించెదరు.

## సద్యః ప్రాణహరాదిమర్మవిషయమై యన్యమతము.

సూ. కేచిదాహుర్మాంసాదీనాం పఞ్చానామపి సమస్తానాం వివృద్ధానాం చ సమవాయాత్సద్యః ప్రాణహరాణి. ఏకహీనానామల్పానాం వా కాలాన్తరప్రాణహరాణి. ద్విహీనానాం విశల్యప్రాణహరాణి. త్రిహీనానాం వైకల్యకరాణి ఏకస్మిన్నేవ రుజాకరాణీతి. యతశ్చైవ మతోఽస్థిమర్మస్వప్యభిఘాతేషు శోణితాగమనం భవతి. 19

వృద్ధిఁజెందినమాంసము, సిరలు, స్నాయువులు, అస్థులు, సంధులు అనువానియొక్క కూటమిగలవి సద్యఃప్రాణహరమర్మలనియు, వృద్ధిఁజెందకుండునట్టి పైయైదింటికూటమిగాని, లేక నాల్గింటియొక్క కూటమిగాని గలవి కాలాంతరప్రాణహర మర్మలనియు, పైయైదింటిలో మూఁడింటియొక్క కూటమిగలవి విశల్యప్రాణహరమర్మలనియు, రెంటియొక్క కూటమిగలవి వైకల్యకరమర్మలనియు, పైయైదింటిలో నొకదానితోడనే చేరియుండునని రుజాకరమర్మలనియుఁ, గొందఱాచార్యులు వచించెదరు. సద్యఃప్రాణహరమర్మములైనగుదము, వస్తి, నాభి, హృదయము, అనువానియం దస్థి లేకుండుటవలన నభిఘాతముచేఁ దత్క్షణమున నెటుల మృతిఁ జెందెదరని కొందఱు శంకింపవచ్చును. అయినను వానియం దస్థి స్పష్టముగ గోచరము కాకుండినను దృశ్యమైనయస్థియొక్క యభిఘాతము వలననే తత్క్షణమున మరణము గలుగును. అట్లగుటంజేసి యస్థిమర్మయం దభిఘాతమువలన రక్తము బయలువెడలును కావున సర్వమర్మములందును పైఁజెప్పినమాంససిరాదులయొక్క పరస్పరసంబంధము గలిగియుండునని తెలియఁదగును.

## శల్యోద్ధరణక్రమము.

శ్లో. చతుర్విధా యాస్తు సిరాశ్శరీరే ప్రాయేణ తా మర్మసు సన్నివిష్టాః,
స్నాయ్వస్థిమాంసాని తథైవ సన్ధీస్సన్తర్ప్య దేహం ప్రతిపాలయన్తి.
తతః క్షతే మర్మణి తాః ప్రవృద్ధస్సమన్తతో వాయురభిస్తృణోతి,
వివర్ధమానస్తు స మాతరిశ్వా రుజస్సుతీవ్రాః ప్రతనోతి కాయే.

రుజాభిభూతం తు పునశ్శరీరం ప్రలీయతే నశ్యతి చాస్య సంజ్ఞా,
అతో హి శల్యం వినిహర్తుమిచ్ఛన్మర్మాణి యత్నేన పరీక్ష్య కర్షేత్.

వాత, పిత్త, శ్లేష్మ రక్తముల ధరించుచుండు చతుర్విధములైననాడులు విశేషముగ మర్మమధ్యమునందుండి స్నాయ్వస్థిమాంససంధులఁబెంచి శరీరమును బరిపాలనము సేయుచుండును. కావున మర్మయందు గాయము తగిలినయెడల వాతము ప్రకోపించి సిరలయందుఁ బ్రవేశించి సర్వశరీరమునందు వ్యాపించుటవలన శరీరమునఁ దీవ్రమగు వేదన కలుగును. అందువలన శరీరనాశముగాని, మూర్ఛగాని, గలుగును. కాఁబట్టి శల్యమును బైలుపఱచుటయం దిచ్ఛగలవైద్యుఁడు సర్వమర్మలఁ బ్రయత్న పూర్వకముగ బాగుగ పరీక్షించి పిదప శల్యమును బయలు పరుపవలయును.

## ప్రాణహరాద్యభిఘాతవికల్పము.

సూ. తత్ర సద్యః ప్రాణహర మర్మే విద్ధం కాలాన్తరేణ మారయతి. కాలాన్తరప్రాణహర మర్మే విద్ధం వైకల్య మాపాదయతి. విశల్య ప్రాణహరమర్మే విద్ధం కాలాన్తరేణ క్లేశయతి, రుజాం చ కరోతి. రుజాకరమతీవ్ర వేదనం భవతి. 21

సద్యఃప్రాణహరమర్మలయొక్క చివరయం దభిఘాతము కలిగినయెడల కాలాంతరమున మరణము గలుగును. కాలాంతరప్రాణహరమర్మలచివరయం దభిఘాతము కలిగినయెడల వైకల్యము గలుగును. విశల్యప్రాణహరమర్మలచివరయం దభిఘాతము గలిగిన యెడల సూక్ష్మముగ బాధ కలుగును.

## మర్మాభిఘాతకాలావధి.

సూ. తత్ర సద్యః ప్రాణహరాణి సప్తరాత్రాభ్యన్తరాన్మారయన్తి. కాలాన్తరప్రాణహరాణి పక్షాన్మాసాద్వా. తేష్వపి తు క్షిప్రాణి కదాచిదాశు మారయన్తి. విశల్యప్రాణహరాణి వైకల్యకరాణి చ కదాచిదత్యభిహతాని మారయన్తి. 22

సద్యఃప్రాణహరమర్మలయం దభిఘాతము గలిగినయెడల 7 దినములలో మరణము గలుగును. కాలాంతరప్రాణహరమర్మలయం దైనయెడల 15 దినములలోఁ గాని, ఒక మాసములోఁగాని మరణము గలుగును. కాలాంతరప్రాణహరమర్మలతోఁ జేరిన క్షిప్రసంజ్ఞకమర్మలయం దైనయెడల నొకానొకప్పుడు శీఘ్రముగనే మరణము గలుగును. విశల్యప్రాణహరమర్మలు, వైకల్యకరమర్మలు, వీనియందధికముగ నభిఘాతము గలిగిన యెడల నొకానొకప్పుడు మరణము గలుగును.

సూ. అత ఊర్ధ్వం ప్రత్యేకశో మర్మస్థానాన్యనువ్యాఖ్యాస్యామః. 23

ఇఁక మర్మస్థానములఁ బ్రత్యేకముగ వివరించెదము.

## క్షిప్రమర్మాభిఘాతోపద్రవము.

సూ. తత్ర పాదాఙ్గుష్ఠాంగుళ్యోర్మధ్యే క్షిప్రం నామ మర్మ; తత్ర విద్ధస్యాక్షేపకేణ మరణమ్. 24

పైఁజెప్పిన మర్మములలో కాలిబొటనవ్రేలికిని రెండవవ్రేలికిని మధ్యప్రదేశమునఁ గొంతపైభాగమునందు క్షిప్రమను మర్మయుండును. దానియం దభిఘాతము గలిగిన యెడల ఆక్షేపకవాతమువలన మరణము కలుగును.

## తలహృదయమర్మాభిఘాతోపద్రవము.

సూ. మధ్యమాఙ్గులీమనుపూర్వేణ మధ్యే పాదతలస్య తలహృదయం నామ; తత్రాపి రుజాభిర్మరణమ్. 25

కాలియొక్క మధ్యమాంగుళి కభిముఖముగ నరకాలిమధ్యప్రదేశమునందు తలహృదయమను మర్మముండును. దానియం దభిఘాతము కలిగినయెడల వేదనవలన మరణము గలుగును. (ఇయ్యది యర్ధాంగుళప్రమాణము గలది, మాంసమర్మలలో చేరినది, కాలాంతరప్రాణహరము.)

## కూర్చమర్మాభిఘాతోపద్రవము.

సూ. క్షిప్రస్యోపరిష్టాదుభయతః కూర్చో నామ; తత్ర పాదస్య భ్రమణవేపనే భవతః. 26

క్షిప్రమర్మకుపైప్రదేశమున నిరుపార్శ్వములు (క్రింద పైన) యందు కూర్చమను మర్మయుండును. దానియం దభిఘాతము కలిగినయెడల కాళ్లుతిరుగుట, కాళ్లువణకుట ఇవి కలుగును. (ఇదినాలుగంగుళముల ప్రమాణము గలది, స్నాయుమర్మలలోఁ జేరినది. వైకల్యకరము)

## కూర్చశిరోమర్మాభిఘాతోపద్రవము.

సూ. గుల్ఫసన్ధేరధ ఉభయతః కూర్చశిరో నామ; తత్ర రుజాశోఫౌ. 27

చీలమండసంధికిఁ క్రిందిభాగమున నిరుపార్శ్వములయందు కూర్చశిరమను మర్మయుండును. దానియం దభిఘాతము గలిగినయెడలఁ బోట్లు వాపులు కలుగును. (ఇదియొక యంగుళప్రమాణము గలది, స్నాయుమర్మలలో చేరినది, వైకల్యకరము.)

## గుల్ఫమర్మాభిఘాతోపద్రవము.

సూ. పదజఙ్ఘయోస్సన్ధానే గుల్ఫో నామ; తత్ర రుజస్స్తబ్ధపాదతా ఖఞ్జతా వా. 28

పాదము, పిక్క, వీనియొక్క సంధియందు గుల్ఫమను మర్మయుండును. దానియం దభిఘాతము గలిగినయెడల మిక్కుటమైనబాధ, పాదములయందు స్తబ్ధత్వము

కుంటితనము కలుగును. (ఇది రెండంగుళముల ప్రమాణముగలది. సంధిమర్మలో చేరి నది వైకల్యకరము.)

## ఇంద్రవస్తిమర్మాభిఘాతోపద్రవము.

సూ. పార్ష్ణిం ప్రతి జఙ్ఘామధ్యే ఇన్ద్రవస్తిర్నామ; తత్ర శోణితక్షయే మరణమ్. 29

చీలమండకు క్రిందిభాగము మొదలుకొని పదమూఁడు అంగుళములకుపైన పిక్క మధ్యమునందు నింద్రవస్తియను మర్మముండును. దానియం దభిఘాతమువలన రక్తము క్షయించినయెడల మరణము గలుగును. [ఇది అర్ధాంగుళప్రమాణము కలది. గ్రంథాంతరమునందు రెండంగుళముల ప్రమాణముగలదియని చెప్పఁబడియున్నది. మాంసమర్మము చేరినది. కాలాంతరప్రాణహరము.]

## జానుమర్మాభిఘాతోపద్రవము.

సూ. జఙ్ఘోర్వోస్సన్ధానే జాను నామ; తత్ర ఖఞ్జతా. 30

పిక్క, తొడ పీనిసంధియందు జానువను మర్మయుండును. దానియం దభిఘాతము కలిగిన యెడల కుంటితనము కలుగును. [ఇది రెండంగుళముల ప్రమాణముగలది, సంధిమర్మములోఁ జేరిన వైకల్యకరము.]

## ఆణిమర్మాభిఘాతోపద్రవము.

సూ. జానున ఊర్ధ్వ ముభయతస్త్ర్యఙ్గుళమాణిర్నామ; తత్ర శోఫాభివృద్ధిస్స్తబ్ధసక్థితా చ. 31

మోకాటిమూఁడంగుళములకు పై భాగమున నిరుపార్శ్వములయందు ఆణియను మర్మయుండును. దానియం దభిఘాతము గలిగినయెడల విశేషముగ వాపు, తొడలయందు స్తబ్ధత్వము కలుగును. [ఇయ్యది యర్ధాంగుళప్రమాణము గలది, స్నాయుమర్మలోచేరినది, వైకల్యకరము.]

## ఊర్వీమర్మాభిఘాతోపద్రవము.

సూ. ఊరుమధ్యే ఊర్వీ నామ; తత్ర శోణితక్షయాత్సక్థిశోషః. 32

తొడలయొక్క మధ్యప్రదేశమున నూర్వియను మర్మయుండును. దానియం దభిఘాతము గలిగినయెడల రక్తక్షయమువలన తొడలు యెండును. [ఇది యర్ధాంగుళ ప్రమాణముగలది, శిరామర్మములోఁ జేరినది, వైకల్యకరము.]

## లోహితాక్షమర్మాభిఘాతోపద్రవము.

సూ. ఊర్వ్యా ఊర్ధ్వమధో వఙ్క్షణసన్ధేరూరుమూలే లోహితాక్షం నామ; తత్ర లోహితక్షయేణ పక్షాఘాతః. 33

పైఁజెప్పఁబడిన యూర్వీమర్మమునకు పైభాగమున వంక్షణ (గజ్జల) సంధికి క్రింది భాగమున నూరుమూలస్థానమునందు లోహితాక్షమను మర్మముండును. దానియం దభిఘాతము గలిగినయెడల రక్తక్షయమువలన పక్షాఘాతము గలుగును. లేక తొడలు కాళ్లు యెండిపోవును. [యియ్యది యర్ధాంగుళ ప్రమాణము గలది, సిరామర్మములోఁ జేరినది, వైకల్యకరము.]

### విటపమర్మాభిఘాతోపద్రవము.

సూ. వఙ్క్షణవృషణయోరన్తరే విటపం నామ; తత్ర షాణ్డ్యమల్పశుక్రతా వా భవతి. 34

గజ్జలు, వృషణములు వీనిమధ్యమునందు విటప మను మర్మయుండును. దాని యం దభిఘాతము గలిగినయెడల నపుంసకత్వము, లేక, అల్పశుక్రత్వము గలుగును. [ఇయ్యది యర్ధాంగుళ ప్రమాణముగలది, స్నాయుమర్మలోఁ చేరినది, వైకల్యకరము.]

సూ. ఏవమేతాన్యేకాదశ సక్థిమర్మాణి వ్యాఖ్యాతాని. ఏతేనేతరసక్థి బాహూ చ వ్యాఖ్యాతౌ. 35

ఈప్రకార మొకకాలియందుండు 11 మర్మలు వివరింపఁబడియె. ఇటులనే మఱియొకకాలియందును, రెండు బాహువులయందు నుండుమర్మలఁ దెలియవలయును.

### హస్తగతవిశేషములు.

సూ. విశేషతస్తు యాని సక్థ్నిగుల్ఫజానువిటపాని, తాని బాహౌ మణిబన్ధకూర్పరకక్షధరాణి యథా వఙ్క్షణవృషణయోరన్తరే విటపమేవం వక్షఃకక్షయోర్మధ్యే కక్షధరం; తస్మిన్విద్ధే త ఏవోపద్రవాః. విశేషతస్తు మణిబన్ధే కుణ్ఠతా. కూర్పరాఖ్యే కుణిః. కక్షధరే పక్షాఘాతః. ఏవమేతాని చతుశ్చత్వారింశచ్ఛాఖాసు మర్మాణి వ్యాఖ్యాతాని.

పైఁ జెప్పినప్రకారము పాదహస్తములయందు మర్మలు సమానంబులుగ నుండినను పాదమునందలి గుల్ఫ (చీలమండ), జాను (మోకాలు), విటపమర్మలకు బదులు హస్తమునందలి మణికట్టు, కూర్పరము (మోచేయి), కక్షధరము అను మర్మలను, గజ్జలు, వృషణములు వీని మధ్యమునందుండు విటపమర్మములకు బదులు ఱొమ్ము, చంక, వీనిమధ్యమునందుండు కక్షధరమను మర్మమును గ్రహించవలయును. వానియం దభిఘాతము గలిగినయెడల గుల్ఫాదిమర్మవిషయమునందుఁ జెప్పఁబడిన యుపద్రవములే కలుగును. మణిబంధమునందైనయెడల కుంఠత (పనిచేయుటకు వీలులేకపోవుట) కూర్పరమర్మయందైన యెడల కుంటితనము, కక్షధరమర్మమునందైన యెడల పక్షాఘాతము కలుగును. ఈప్రకారము హస్తపాదములయందలి 44 మర్మలు వివరింపఁబడియె.

### గుదమర్మాభిఘాతోపద్రవము.

సూ. అత ఊర్ధ్వముదరోరసోర్మర్మస్థానాన్యనువ్యాఖ్యాస్యామః. తత్ర వాతవర్చోనిరసనం స్థూలాన్త్రప్రతిబద్ధం గుదం నామ మర్మ ; తత్ర సద్యోమరణమ్. 37

ఇక కడుపు, ఱొమ్ము అనువానియందలి మర్మస్థానముల వివరించెదము. వానిలో గుద మనుమర్మ అపానవాతము, మలము వీనిని వెలిపరచునదియును లావులగుప్రేవులచేఁ గట్టఁబడినదియు నైయుండును. దానియం దభిఘాతము గలిగినయెడల తత్క్షణముననే మరణము కలుగును. [ఇది నాలుగంగుళముల ప్రమాణముగలది.]

### వస్తిమర్మాభిఘాతోపద్రవము.

సూ. అల్పమాంసశోణితోఽభ్యన్తరతః కట్యాం మూత్రాశయో వస్తిర్నామ; తత్రాపి సద్యోమరణ మశ్మరీవ్రణాదృతే. తత్రాప్యుభయతో భిన్నే న జీవత్యేకతో భిన్నే మూత్రస్రావీ వ్రణో భవతి, సతు యత్నేనోపక్రాన్తో రోహతి. 38

నడుముక్రిందితొడలమీది లోభాగములో నల్పమై మాంసరక్తములతోఁ గూడియుండునట్టిమూత్రస్థానమైన వస్తియనుమర్మ పృష్ఠము, వృషణములు, గుదము, శిశ్నము అనువానియం దధోముఖముగ వ్యాపించియుండును. దానియం దభిఘాతము గలిగినను లేక, యిరుప్రక్కల నశ్మరీవ్రణమువలనఁ దప్ప మఱిదేనివలనేని యభిఘాతముగలిగినను దత్క్షణముననే మరణము గలుగును. ఒకప్రక్క ఛిద్రము గలిగినయెడల మూత్రమును స్రవింపఁ జేయఁనట్టి వ్రణము గలుగును. దానియందు కడుజాగ్రత్తతోఁ జికిత్సఁజేసిన నది మానును. [ఇయ్యది నాలుగంగుళముల ప్రమాణము గలది, స్నాయుమర్మలలోఁ జేరినది.]

### నాభిమర్మాభిఘాతోపద్రవము.

సూ. పక్వామాశయయోర్మధ్యే సిరాప్రభవా నాభిర్నామ; తత్రాపి సద్య ఏవ మరణమ్. 39

పక్వాశయము, ఆమాశయము, వీనిమధ్యభాగమున సర్వసిరల కుత్పత్తిస్థానమగు నాభియను మర్మయుండును. దానియం దభిఘాతము గలిగినయెడల తత్క్షణముననే మరణము గలుగును. [ఇయ్యది నాలుగంగుళముల ప్రమాణముగలది. సిరామర్మలలోఁ జేరినది.]

### హృదయమర్మాభిఘాతోపద్రవము.

సూ. స్తనయోర్మధ్యమధిష్ఠాయోరస్యామాశయద్వారం సత్త్వరజస్తమసామధిష్ఠానం హృదయం నామ; తత్ర సద్య ఏవ మరణమ్. 40

సత్త్వరజస్తమోగుణంబున కధిష్ఠానంబై ఱొమ్మునందలి స్తనమధ్యము నాశ్రయించి యామాశయమునకు ద్వారమైయుండునట్టి హృదయమను మర్మ యుండును. దానియం దభిఘాతము గలిగినయెడల తత్క్షణముననే మరణము గలుగును. [ఇయ్యది నాలుగంగుళముల ప్రమాణముగలదై తామరమొగ్గవలె నధోముఖముగనుండును. సిరామర్మలలోఁ జేరినది.]

## స్తనమూలమర్మాభిఘాతోపద్రవము.

సూ. స్తనయోరధస్తాద్ద్వ్యఙ్గులముభయత స్తనమూలే నామ మర్మణీ; తత్ర కఫపూర్ణకోష్ఠతయా కాసశ్వాసాభ్యాం చ మ్రియతే. 41

స్తనముల క్రింద నిరుపార్శ్వములయందు రెండంగుళముల ప్రమాణముగల స్తనమూలము లను మర్మ లుండును. వానియం దభిఘాతము కలిగినయెడల కోష్ఠము కఫపూరితమై కాసశ్వాసములవలన మరణము గలుగును. [ఇయ్యవి సిరామర్మలలోఁ జేరినవి. కాలాంతరప్రాణహరములు.]

## స్తనరోహిత మర్మాభిఘాతోపద్రవము.

సూ. స్తనచూచుకయోరూర్ధ్వం ద్వ్యఙ్గులముభయత స్తనరోహితౌ నామ; తత్ర లోహితపూర్ణకోష్ఠతయా కాసశ్వాసాభ్యాం చ మ్రియతే. 42

స్తనాగ్రములకుఁ బైన నిరుపార్శ్వములయందు రెండంగుళముల ప్రదేశమున స్తనరోహితము లను మర్మ లుండును. వానియం దభిఘాతము గలిగినయెడల కోష్ఠము రక్తపూరితమై కాసశ్వాసములవలన మరణము గలుగును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణము గలవి. మాంసమర్మలలోఁ జేరినవి.]

## అపలాపమర్మాభిఘాతోపద్రవము.

సూ. అంసకూటయోరధస్తాత్పార్శ్వోపరిభాగయోరపలాపౌ నామ; తత్ర రక్తేన పూయభావం గతేన మరణమ్. 43

భుజశిరముల క్రింద ప్రక్కలకుఁ బైభాగమున నపలాపము లను మర్మ లుండును. వానియం దభిఘాతముగలిగినయెడల రక్తము చీముపలెనై మరణము కలుగును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణముగలవి. సిరామర్మలలోఁ జేరినవి. కాలాంతర ప్రాణహరములు.]

## అపస్తంభమర్మాభిఘాతోపద్రవము.

సూ. ఉభయత్రోరసో నాడ్యౌ వాతవహే అపస్తమ్భౌ నామ; తత్ర వాతపూర్ణకోష్ఠతయా కాసశ్వాసాభ్యాం చ మరణమ్. 44

ఱొమ్మున కిరుపార్శ్వములయందు వాతమును వహించునట్టి రెండునాడు లుండును. అయ్యవి యపస్తంభమర్మము లనఁబడును. వానియందభిఘాతము గలిగినయెడల

కోష్ఠము వాతపూరితమై కాసశ్వాసములవలన కాలాంతరమున మరణము గలుగును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణము గలవి, సిరామర్మలలోఁ జేరినవి.]

సూ. ఏవమేతాన్యుదరోరసోర్ద్వాదశమర్మాణి వ్యాఖ్యాతాని 45

ఈప్రకారము కడుపు, ఱొమ్ము, వీనియందలి పన్నెండు మర్మలు వివరింపఁబడియె.

సూ. అత ఊర్ధ్వం పృష్ఠమర్మాణ్యనువ్యాఖ్యాస్యామః. 46

ఇఁక వీఁపుయందుండు మర్మలు వివరించెదము.

### కటీకతరుణమర్మాభిఘాతోపద్రవము.

సూ. తత్ర పృష్ఠవంశముభయతః, ప్రతిశ్రోణికాణ్డమస్థినీ కటీకతరుణే నామ మర్మణీ; తత్ర శోణితక్షయాత్పాణ్డుర్వివర్ణో హీనరూపశ్చ మ్రియతే. 47

వెన్నెముకకొన కిరుపార్శ్వములయందుండు రెండుయెముకలు కటీకతరుణ మర్మ లనఁబడును. వానియం దభిఘాతమువలన రక్తము క్షయించినయెడల శరీరమునఁ బాండురవర్ణము, వికారవర్ణము, దుర్బలము గలిగి కొన్నిదినములకుఁ బైన మరణము గలుగును.

### కుకుందరమర్మాభిఘాతోపద్రవము.

సూ. పార్శ్వజఘనబహిర్భాగే పృష్ఠవంశముభయతో నాతినిమ్నే కుకున్దరే నామ మర్మణీ; తత్ర స్పర్శాజ్ఞానమధఃకాయే చేష్టోపఘాతశ్చ. 48

పార్శ్వము, పిఱుఁదు వీనికి వెలుపల వెన్నెముక కిరుపార్శ్వములయందు స్వల్పమైన పల్లము గలిగియుండు కుకుందరము లనుమర్మ లుండును. వానియం దభిఘాతము గలిగినయెడల నడుముకు క్రిందిభాగమునందు స్పర్శము తెలియకుండుట, చచ్చుపడుట గలుగును. [ఇయ్యవి సంధిమర్మలలోఁ జేరినవి.]

### నితంబమర్మాభిఘాతోపద్రవము.

సూ. శ్రోణికాణ్డయోరుపర్యాశయాచ్ఛాదనౌ పార్శ్వాన్తరప్రతిబద్ధౌ నితమ్బౌ నామ; తత్ర అధఃకాయశోషో దౌర్బల్యాచ్చ మరణమ్. 49

కటీకతరుణమర్మలకుఁ బైభాగమున నామాశయమున కాచ్ఛాదకమైనవియు పార్శ్వసంధిచేఁ గట్టఁబడినవియు నైన నితంబములను మర్మలుండును. వానియం దభిఘాతము గలిగినయెడల నడుముకుఁ గ్రిందిభాగము శోషించి బలహీనమువలన మరణము గలుగును. [ఇయ్యవి యస్థిమర్మలలోఁ జేరినవి.]

### పార్శ్వసంధిమర్మాభిఘాతోపద్రవము.

సూ. అధఃపార్శ్వాన్తరప్రతిబద్ధౌ జఘనపార్శ్వమధ్యయో స్తిర్యగూర్ధ్వం చ జఘనాత్పార్శ్వసన్ధీ నామ; తత్ర లోహితపూర్ణకోష్ఠతయా మ్రియతే. 50

పిఱుఁదు, యిరుపార్శ్వములు, వీనిమధ్యప్రదేశమునందు నధఃపార్శ్వసంధివలన నడ్డముగఁ బొడవుగఁ గట్టఁబడిన పార్శ్వసంధియను మర్మలుండును. వానియం దభిఘాతము గలిగినయెడల కోష్ఠము రక్తపూరితమై కాలాంతరమున మరణము గలుగును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణము గలవి. సిరామర్మలలోఁ జేరినవి.]

### బృహతీమర్మాభిఘాతోపద్రవము.

సూ. స్తనమూలాదుభయతః పృష్ఠవంశస్య బృహత్యౌ నామ ; తత్ర శోణితాతిప్రవృత్తినిమిత్తై రుపద్రవైర్మ్రియతే. 51

స్తనమూలమర్మమునుండి వెన్నెముక కిరుపార్శ్వములవఱకును బృహతియను మర్మలుండును. వానియం దభిఘాతము గలిగినయెడల రక్తమధికముగ బయలువెడలి యుపద్రవములచే మృతిఁజెందును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణము గలవి. సిరామర్మలలోఁ జేరినవి.]

### అంసఫలకమర్మాభిఘాతోపద్రవము.

సూ. పృష్ఠోపరి పృష్ఠవంశముభయతస్త్రికసమ్బద్ధే అంసఫలకే నామ; తత్ర బాహ్వోశ్శోషో వా. 52

వీఁపునకుఁ బైభాగమున వెన్నెముక కిరుపార్శ్వములఁ ద్రికసంధియందుఁ గట్టఁబడియుండునట్టి యంసఫలకములను మర్మలుండును. వానియం దభిఘాతము గలిగినయెడలఁ జేతులు పడిపోవును. లేక శోషమైనను జెందును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణముగలవి. అస్థిమర్మలలోఁ జేరినవి వైకల్యకరములు.]

### అంసమర్మాభిఘాతోపద్రవము.

సూ. బాహుమూర్ధగ్రీవామధ్యేఽంసపీఠస్కన్ధనిబన్ధనావంసౌ నామ; తత్ర స్తబ్ధబాహుతా. 53

భుజశిరస్సులు, మెడ, వీనిమధ్యమునందు నంసఫలకముతోఁ జేర్చి స్నాయువులతో భుజశిరస్సులయందు కట్టఁబడియుండు నంసము లనుమర్మ లుండును. వానియం దభిఘాతము గలిగినయెడల బాహువులు స్తంభించును. [ఇయ్యవి యర్ధాంగుళ ప్రమాణముగలవి, స్నాయుమర్మలలోఁ జేరినవి, వైకల్యకరములు.]

సూ. ఏవమేతాని చతుర్దశ పృష్ఠమర్మాణి వ్యాఖ్యాతాని. 54

ఇటుల వీఁపునందుండు 14 మర్మలు వివరింపఁబడియె.

సూ. అత ఊర్ధ్వం జత్రుగతాని వ్యాఖ్యాస్యామః. 55

ఇఁక మెడకొంకులకు పైభాగమునందుండు మర్మలను వివరించెదము.

## నీలమన్యమర్మాభిఘాతోపద్రవము.

సూ. తత్ర కణ్ఠనాడీముభయతశ్చతస్రో ధమన్యః—ద్వే నీలే ద్వే చ మన్యే వ్యత్యాసేన; తత్ర మూకతాస్వరవైకృతమరసగ్రాహితా చ.

కంఠ నాడి కిరుపార్శ్వములయందు నీల మనుపేరం బరఁగు 2 ధమనులు, మన్య లనుపేరం బరఁగు 2 ధమనులు. ఇటుల నాలుగు ధమనులలో నొకపార్శ్వమునందు నీల 1, మన్య 1, మఱియొకపార్శ్వమునందు నీల 1, మన్య 1, ఇటుల వ్యత్యాసముగ నుండును. వానియం దభిఘాతము గలిగినయెడల మూగతనము, స్వరవికారము నాలుకయందు మధురాదిరసముల గ్రహించుశక్తి లేకుండుట ఇవి కలుగును. [ఇయ్యవి నాలుగంగుళముల ప్రమాణముగలవి. సిరామర్మలలోఁ జేరినవి. వైకల్యకరములు.]

## మాతృకమర్మాభిఘాతోపద్రవము.

సూ. గ్రీవాయాముభయతశ్చతస్రస్సిరామాతృకాః; తత్ర సద్యోమరణమ్. 57

మెడ కిరుపార్శ్వములయందు 4-4, చొప్పున నెనిమిది సిరలుండును. అయ్యవి మాతృకలనఁబడును. వానియం దభిఘాతముగలిగినయెడలఁ దత్క్షణముననే మరణము కలుగును. [ఇయ్యవి నాలుగంగుళముల ప్రమాణము గలవి. సిరామర్మలలోఁ జేరినవి.]

## కృకాటికామర్మాభిఘాతోపద్రవము.

సూ. శిరోగ్రీవయోస్సన్ధానే కృకాటికే నామ; తత్ర చలమూర్ధతా. 58

శిరస్సు, మెడ, వీనియొక్క సంధిమధ్యమునందు కృకాటికములను రెండుమర్మలుండును. వానియం దభిఘాతముగలిగినయెడల తల వణకును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణముగలవి, సంధిమర్మలలోఁ జేరినవి. యీ మర్మలు వెన్నెముకకు పైభాగమునఁ గంఠమునకు వెనుకటిప్రదేశమున నుండును.]

## విధురమర్మాభిఘాతోపద్రవము.

సూ. కర్ణపృష్ఠతోఽధస్సంశ్రితే విధురే నామ, తత్ర బాధిర్యమ్. 59

చెవులకు వెనుక ప్రక్క కొంచము క్రిందుగ కొంచము లోఁతుగ విధురములను మర్మలుండును. వానియం దభిఘాతము గలిగినయెడలఁ జెవిటితనము గలుగును. [ఇయ్యవి స్నాయుమర్మలలోఁ జేరినవి, వైకల్యకరములు.]

## ఫణమర్మాభిఘాతోపద్రవము.

సూ. ఘ్రాణమార్గముభయతస్స్రోతోమార్గప్రతిబద్ధే అభ్యన్తరతః ఫణే నామ ; తత్ర గన్ధాజ్ఞానమ్. 60

ఘ్రాణరంధ్రముల యిరుపార్శ్వములలోఁ లోభాగములోఁ స్రోతస్సులయొక్క మార్గముకడఁ గట్టఁబడిన ఫణము లను మర్మలుండును. వానియం దభిఘాతము గలిగిన యెడల గంధజ్ఞానము శూన్యమగును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణముగలవి. సిరామర్మలలోఁ జేరినవి. వైకల్యకరములు.]

**అపాంగమర్మాభిఘాతోపద్రవము.**

సూ. భ్రూపుచ్ఛాన్తయోరధోఽక్ష్ణో ర్బాహ్యతోఽపాఙ్గౌ నామ; తత్రాన్ధ్యం దృష్ట్యుపఘాతో వా. 61

కనుబొమల చివరలయొక్క క్రిందిభాగమున కనులకు వెనుకటిభాగమున నపాంగము లనుమర్మలుండును. వానియం దభిఘాతము గలిగినయెడల గ్రుడ్డితనము లేక నేత్రవికారము గలుగును. [ఇయ్యవి యర్ధాంగుళ ప్రమాణము గలవి. సిరామర్మలలోఁ జేరినవి. వైకల్యకరములు.]

**ఆవర్తమర్మాభిఘాతోపద్రవము.**

సూ. భ్రువోరుపరి నిమ్నయోరావర్తౌ నామ; తత్రాన్ధ్యం దృష్ట్యుపఘాతశ్చ. 62

కనుబొమలకు పైభాగమునందలి పల్లములయందు ఆవర్తము లను మర్మలుండును. వానియం దభిఘాతము గలిగినయెడల గ్రుడ్డితనము, లేక దృష్టివికారము కలుగును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణముగలవి. సంధిమర్మలలోఁ జేరినవి, వైకల్యకరములు.]

**శంఖమర్మాభిఘాతోపద్రవము.**

సూ. భ్రువోః పుచ్ఛాన్తయోరుపరి కర్ణలలాటయోర్మధ్యే శఙ్ఖౌ నామ; తత్ర సద్యోమరణమ్. 63

కనుబొమలయొక్క చివరలకు పైభాగమున కర్ణములును వీనిమధ్యమునందు శంఖము లను మర్మలుండును. వానియం దభిఘాతము కలిగినయెడలఁ దత్క్షణమున మరణము గలుగును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణముగలవి, అస్థిమర్మలలోఁ జేరినవి.]

**ఉత్క్షేపమర్మాభిఘాతోపద్రవము.**

సూ. శఙ్ఖయోరుపరి కేశాన్త ఉత్క్షేపౌ నామ; తత్ర సశల్యో జీవతి పాకాత్పతితశల్యో వా, నోద్ధృతశల్యః. 64

శంఖములకు పైభాగమున కేశములపర్యంతము ఉత్క్షేపము లను మర్మలుండును. వానియం దభిఘాతము కలిగినయెడల శల్యముండువఱకు జీవించియుండును. మఱియు నాశల్యము పరిపక్వమై పడిపోయినను లేక బయలుపఱచఁబడినను తత్క్షణముననే మరణము గలుగును. [ఇయ్యవి యర్ధాంగుళప్రమాణము గలవి. అస్థిమర్మలలోఁ జేరినవి, విశల్యఘ్నములు.]

### స్థపనీమర్మాభిఘాతోపద్రవము.

సూ. భ్రువోర్మధ్యే స్థపనీ నామ; తత్రోత్క్షేపవత్. 65

కనుబొమలమధ్యమున స్థపనియను మర్మ యుండును. దానియం దభిఘాతము గలిగినయెడల పైఁజెప్పిన యుత్క్షేపమర్మమువలెనే శల్యముండువఱకు జీవించియుండును. మఱియు నాశల్యము పరిపక్వమై పడిపోయినను, లేక, బైలుపఱచఁబడినను దత్క్షణముననే మరణము గలుగును. (ఇయ్యది సిరామర్మలలోఁ జేరినది.

### సీమంతమర్మాభిఘాతోపద్రవము.

సూ. పఞ్చసన్ధయశ్శిరసి విభక్తాస్సీమన్తా నామ; తత్రోన్మాదభయచిత్తనాశైర్మరణమ్. 66

శిరమునందు భాండముయొక్క సంధులవలె ప్రత్యేకప్రత్యేకముగ నైదుసంధు లుండును. అవి సీమంతము లనఁబడును. వానియం దభిఘాతము గలిగినయెడల నున్మాదము, భయము, వీనివలన మరణము గలుగును. (ఇవి నాలుగంగుళముల ప్రమాణము గలవి. సంధిమర్మలలోఁ జేరినవి. కాలాంతరప్రాణహరములు.)

### శృంగాటకమర్మాభిఘాతోపద్రవము.

సూ. ఘ్రాణశ్రోత్రాక్షిజిహ్వాసన్తర్పణీనాం సిరాణాం మధ్యే సిరాసన్నిపాతశ్శృఙ్గాటకాని తాని చత్వారి మర్మాణి తత్రాపి సద్యోమరణమ్.

నాసికము, కర్ణములు, నేత్రములు, జిహ్వ, వీనిని తృప్తిపఱచునట్టి సిరలయొక్క మధ్యమున సిరలొకదానితోనొకటి గూడుకొనియుండుస్థలమునందు శృంగాటకములను ౪ మర్మలుండును. వానియం దభిఘాతముగలిగినయెడల తత్క్షణముననే మరణములు గలుగును. (ఇయ్యవి సిరామర్మలలోఁ జేరినవి.)

### అధిపతిమర్మాభిఘాతోపద్రవము.

సూ. మస్తకాభ్యన్తరతోపరిష్టాత్సిరాసన్నిపాతో రోమావర్తోఽధిపతిః, తత్రాపి సద్యో మరణమ్. 68

శిరమునకు లోపలిభాగమున సర్వసిరములయొక్క సంధులు కూడియుండునట్టియు వెండ్రుకలసుడి కలిగియుండునట్టియు స్థలము అధిపతిమర్మ యనఁబడును. దానియం దభిఘాతము గలిగినఁ దత్క్షణముననే మరణముగలుగును. (ఇయ్యది యర్ధాంగుళప్రమాణము గలది, సంధిమర్మలలోఁ జేరినది.)

సూ. ఏవమేతాని సప్తత్రింశదూర్ధ్వం జత్రుగతాని మర్మాణి వ్యాఖ్యాతాని. 69

ఈప్రకారము మెడకొంకులకు పైభాగమునందు 37 మర్మలు వివరింపఁబడియె.

భవన్తి చాత్ర.—

శ్లో. ఊర్వ్యశ్శిరాంసి విటపే చ సకక్షపార్శ్వే
ఏకైకమఙ్గుళమితా స్తనపూర్వమూలమ్,
విద్ధ్యఙ్గుళద్వయమితం మణిబన్ధగుల్ఫం
త్రీణ్యేవ జాను సపరం సహ కూర్పరాభ్యామ్.
హృద్వస్తికూర్చగుదనాభి వదన్తి మూర్ధ్ని
చత్వారి పఞ్చ చ గళే దశ యాని చ ద్వే,
తాని స్వపాణితలకుఞ్చితసమ్మితాని
శేషాణ్యవేహి పరివిస్తరతోఽఙ్గుళార్ధమ్. 70

ఊర్వ్యలు, కూర్చశిరములు, విటపములు, కక్షధరములు, అను నాలుగువిధములగు మర్మలు నొక్కయంగుళప్రమాణవిస్తారమును, మణిబంధములు, గుల్ఫములు, స్తనమూలములు, అనునివి రెండంగుళముల ప్రమాణవిస్తారమును, జాను, కూర్పరములు, అనునవి మూఁడంగుళముల ప్రమాణవిస్తారమును, హృదయము, వస్తి, కూర్చము, గుదము, నాభి, శృంగాటకములు, సీమంతములు, మాతృకలు, మన్యలు, నీలధమనులు, నియ్యవి నాలుగంగుళముల ప్రమాణవిస్తారమును, తక్కినమర్మస్థానముల ర్ధాంగుళ ప్రమాణవిస్తారమును కలవై యుండును.

శ్లో. ఏతత్ప్రమాణమభివీక్ష్య వదన్తి తజ్జ్ఞా
శ్శస్త్రేణ కర్మకరణం పరిహృత్య మర్మ,
పార్శ్వాభిఘాతితమపీహ నిహన్తి మర్మ
తస్మాద్ధి మర్మసదనం పరివర్జనీయమ్. 71

మర్మస్థానసమీపమునం దభిఘాతముగలిగినను మరణం బాసన్నంబగును గాన పైఁజెప్పినప్రకారము వైద్యుఁడు మర్మస్థానములప్రమాణముల నెఱింగి మర్మలను విడచి శస్త్రకర్మను జేయవలయును.

శ్లో. ఛిన్నేషు పాణిచరణేషు సిరా నరాణాం
సఙ్కోచమీయురసృగల్పమతో నిరేతి,

ప్రాప్యామితవ్యసనముగ్రమతో మనుష్యా
స్సంఛిన్నశాఖతరువన్నిధనం న యాన్తి.
క్షిప్రేషు తత్ర సతలేషు హతేషు రక్తం
గచ్ఛత్యతీవ పవనశ్చ రుజం కరోతి,
ఏవం వినాశముపయాన్తి హి తత్ర విద్ధా
వృక్షా ఇవాయుధవిఘాతనికృత్తమూలాః.
తస్మాత్తయోరభిహతస్య తు పాణిపాదం
ఛేత్తవ్యమాశు మణిబన్ధనగుల్ఫదేశే. 72

మనుజుల హస్తపాదములు ఛేదింపఁబడినయెడల వానియందలి సిరాముఖములు సంకుచితంబులై రక్తము స్వల్పముగ స్రవించును. దానంజేసి మనుజుఁ డధికమైనట్టియుఁ, దీవ్రమైనట్టియు, నుపద్రవముల ననుభవించి శాఖలు ఛేదింపఁబడినవృక్షము జీవించి యుండునటులనే, మృతిఁజెందక జీవించియుండును. హస్తపాదములు విరుగునపుడు క్షిప్రము, తలహృదయము, అనుమర్మలయం దభిఘాతము గలిగినయెడల మిక్కుటముగ రక్తము స్రవించును. అందువలన వాతము ప్రకోపించి మిక్కుటముగ బాధగలిగి మూలము ఛేదింపఁబడిన వృక్షమువలె మానవుఁడు మృతిఁజెందును. కావున, తలహృదయము, అనుమర్మలయం దభిఘాతము గలిగినవానియొక్క హస్తపాదములను మణిబంధగుల్ఫములయందు తీవ్రముగ ఛేదింపవలయును.

శ్లో. మర్మాణి శల్యవిషయార్ధముదాహరన్తి
యస్మాచ్చ మర్మసు హతా న భవన్తి సద్యః,
జీవన్తి తత్ర యది వైద్యగుణేన కేచి
త్తే ప్రాప్నువన్తి వికలత్వమసంశయం హి. 73

మర్మస్థానములయం దభిఘాతము గలిగినయెడల సద్యోమరణము గలుగును. కావున, నట్టిమర్మలయందు లక్ష్యమునుంచి బాణములు మొదలగువానిచేఁ గొట్టెదరు. వానియందభిఘాతము గలిగియుండునపుడు వైద్యునికుశలత్వమువలనఁ గొందఱు జీవించి యుండినను అట్టివారికి వైకల్యము నిస్సందేహముగఁ గలుగును.

శ్లో. సమ్భిన్నజర్ఝరితకోష్ఠశిరఃకపాలా
జీవన్తి శస్త్రనిహతైశ్చ శరీరదేశైః,
ఛిన్నైశ్చ సక్థిభుజపాదకరైరశేషై
ర్యేషాం న మర్మపతితా వివిధాః ప్రహారాః. 74

శరీరమునందు శస్త్రమువలన నభిఘాతము గలిగినను తొడలు, భుజములు, పాదములు, హస్తములు, అనునవి శస్త్రమువలననే ఛేదింపఁబడినను, కోష్ఠము, శిరము, కపా

లము, అనునవి భిన్నమైనను మర్మస్థానములయందు మాత్రము దెబ్బతగలకుండిన నరుఁడు జీవించును.

శ్లో. సోమమారుత తేజాంసి రజస్సత్త్వతమాంసి చ,
మర్మసు ప్రాయశః పుంసాం భూతాత్మా చావతిష్ఠతే,
మర్మస్వభిహతాస్తస్మాన్న జీవన్తి శరీరిణః 75

ఐదువిధములైన కఫములు, ఐదువిధములైన వాతములు, ఐదువిధములైన పిత్తములు, రజస్సత్త్వతమోగుణములు, జీవుఁడు ఇవన్నియు మనుజులయొక్క మర్మస్థలముల విశేషముగ నాశ్రయించి యుండును. కావున, వానియందు దెబ్బతగిలినయెడల మరణము గలుగును.

సద్యఃప్రాణహరమర్మాభిఘాతోపద్రవము.

శ్లో. ఇన్ద్రియార్థేష్వసంప్రాప్తిర్మనోబుద్ధివిపర్యయః,
రుజశ్చ వివిధాస్తీవ్రా భవన్త్యాశు హరే హతే. 76

సద్యఃప్రాణహరమర్మలయం దభిఘాతము గలిగినయెడల సర్వేంద్రియముల యందు స్వస్వవిషయగ్రహణమునం దశక్తి, మనస్సు, బుద్ధి, వీనియందు వ్యత్యాసము పలువిధములగు నుగ్రమైన బాధలు గలుగును.

కాలాంతరప్రాణహరమర్మాభిఘాతోపద్రవము.

శ్లో. హతే కాలాన్తరఘ్నే తు ధ్రువో ధాతుక్షయో నృణామ్,
తతో ధాతుక్షయాజ్జన్తుర్వేదనాభిశ్చ నశ్యతి. 77

కాలాంతరప్రాణహర మర్మములయం దభిఘాతము గలిగినయెడల రక్తమాంసాదిధాతువులు క్షయించి వేదనవలన మానవుఁడు మృతిఁజెందును.

వైకల్యకరవిశల్యఘ్నమర్మాభిఘాతోపద్రవము.

శ్లో. హతే వైకల్యజననే కేవలం వైద్యనైపుణాత్,
శరీరం క్రియయా యుక్తం వికలత్వమవాప్నుయాత్,
విశల్యఘ్నేషు విజ్ఞేయం పూర్వోక్తం యచ్చ కారణమ్. 78

వైకల్యకరమర్మములయం దభిఘాతము గలిగినయెడల నందలియుపద్రవములు వైద్యునినైపుణ్యమువలన శమించినను అంగవైకల్యము మాత్రము గలుగును. విశల్యఘ్నమర్మలయం దభిఘాతముగలిగినయెడల శల్యముండుపఱకు సజీవితుఁడై బయలుపఱచిన తోడనే మృతిఁజెందును.

రుజాకరమర్మాభిఘాతోపద్రవము.

శ్లో. రుజాకరాణి మర్మాణి క్షతాని వివిధా రుజః,

కుర్వన్త్యన్తే చ వైకల్యం కువైద్యవశగో యది. 79

రుజాకరకర్మలయం దభిఘాతము గలిగియుండునపు డందుఁ బలువిధములైన బాధలు గలుగుటయే గాక కువైద్యునిచికిత్సకు లోఁబడినశరీరములుకూడ క్షయించును.

శ్లో. ఛేదభేదాభిఘాతేభ్యో దహనాద్దారణాదపి,
ఉపఘాతం విజానీయాన్మర్మణాం తుల్యలక్షణమ్ 80

ఛేదనము. భేదనము, అభిఘాతము, అగ్నికర్మ, బ్రద్దలు సేయుట, అను వానివలన మర్మలయందుఁ దత్తుల్యలక్షణములైన యుపఘాతములు గలుగునని తెలియవలయు.

శ్లో. మర్మాభిఘాతశ్చనకశ్చిదస్తియోఽల్పాత్యయోవాపినిరత్యయోవా,
ప్రాయేణ మర్మస్వభితాడితాస్తు వైకల్యమృచ్ఛన్త్యథ వామ్రియన్తే.

స్వల్పదోషముగాని, దోషాభావముగాని గలమర్మాభిఘాతము లెవ్వియును గానంబడవు. కావున మర్మలయం దభిఘాతము గలిగినయెడల తరుచుగ మరణము గలుగును. నైపుణ్యముకల వైద్యుని చికిత్సవలన నొకానొకప్పుడు మరణము గలుగకపోయినను వైకల్యముమాత్రము నిశ్చయముగఁ గలుగును.

శ్లో. మర్మాణ్యధిష్ఠాయహియేవికారామూర్ఛన్తికాయేవివిధానరాణామ్,
ప్రాయేణ తే కృచ్ఛ్రతమా భవన్తి నరస్య యత్నైరపి సాధ్యమానాః.

ఇతి శ్రీసుశ్రుతాచార్యవిరచితే ఆయుర్వేదశాస్త్రే సుశ్రుతే
తృతీయే శారీరస్థానే షష్ఠోఽధ్యాయః.

మర్మలనాశ్రయించి యుండునట్టి పలువిధములైన వికారములు శరీరమునందంతట వ్యాపించును. కావున, వానిని బహుయత్నముతోఁ జికిత్సించినను కడుసాధ్యముగనే యగును.

---

# సప్తమాధ్యాయము.

సూ. అథాత స్సిరావర్ణవిభక్తం నామ శారీరం వ్యాఖ్యాస్యామః. 1

ప్రత్యేకమర్మనిర్దేశానంతరము సిరావర్ణన (గుణకర్మాభిధాన) మును సిరలవిభాగము అనువానిని బోధించు నీసిరావర్ణనవిభక్త మనుయధ్యాయమును వివరించెదము.

## సిరాసంఖ్యాదివివరణము.

సూ. సప్త సిరాశతాని భవన్తి; యాభిరిదం శరీరమారామ ఇవ జలహారిణీభిః కేదార ఇవ చ కుల్యాభిరుపస్నిహ్యతే ఽనుగృహ్యతే.

చాకుఞ్చనప్రసరణాదిభిర్విశేషైః ద్రుమపత్రసేవనీనామివ చ తాసాం ప్రతానాః. తాసాం నాభిర్మూలం, తతశ్చ ప్రసరన్త్యూర్ధ్వమధస్తిర్యక్చ. 2

శరీరమునందు 700 సిరలుండు నయ్యవి పాదము మొదలుకొని శిరస్సు పర్యంతము వ్యాపించి మనుజులచే భుజింపఁబడు నన్నపానాదులరసము నాకర్షించుకొని "కాలువ ఆరామము, (తోట) చేను వీనియం దుదకమును వ్యాపింపఁజేసి యందలి సస్యాదుల వృద్ధిఁ బరచుచందంబున" సర్వశరీరమునందును సిరలచే వ్యాపింపఁజేసి శరీరమునందు ఆకుంచనము (ముడుచుట), ప్రసారణము (చాచుట), భాషణము, నిద్ర, జాగరణాదులవలన శరీరపోషణము సేయుచుండును. "వృక్షములయొక్క పత్రముల నాశ్రయించియుండు సేవనుల (ఈనె) కనేకశాఖలు గలిగియుండునటులనే" శరీరమునందలి సిరలకును గూడ ననేకశాఖలు గలిగియుండును. అట్టి సిరలు మూలస్థానమైన నాభినుండి బయలువెడలి పొడవుగ, క్రిందుగ, నడ్డముగ సర్వశరీరమునందు వ్యాపించి యుండును.

భవతశ్చాత్ర—

శ్లో. యావన్త్యస్తు సిరాః కాయే సమ్భవన్తి శరీరిణామ్,
నాభ్యాం సర్వా నిబద్ధా స్తాః ప్రతన్వన్తి సమన్తతః.
నాభిస్థాః ప్రాణినాం ప్రాణాః ప్రాణాన్నాభిర్వ్యుపాశ్రితా,
సిరాభిరావృతా నాభిశ్చక్రనాభిరివారకైః. 3

శరీరమునందలి సిరలన్నియు నాభిస్థానమునఁ గట్టఁబడి సర్వశరీరమునందును వ్యాపించి యుండును. సర్వప్రాణులయొక్కయుఁ బ్రాణములు నాభిని, నాభిప్రాణములను పరస్పర మాశ్రయించియుండును. చక్రనాభి (బండికంటినడిమితూము) అరములచేఁ జుట్టఁబడియుండునటులనే ప్రాణులయొక్క నాభికూడ సిరలచేఁ జుట్టఁబడియుండును.

## వాతవాహిన్యాదిసిరావివరణము.

సూ. తాసాం మూలసిరాశ్చత్వారింశత్—తాసాం వాతవాహిన్యో దశ, పిత్తవాహిన్యో దశ, కఫవాహిన్యో దశ, దశ రక్తవాహిన్యః. తాసాం తు వాతవాహినీనాం వాతస్థానగతానాం పఞ్చసప్తతిశతం భవతి, తావత్య ఏవ పిత్తవాహిన్యః పిత్తస్థానే, కఫవాహిన్యశ్చ కఫస్థానే, రక్తవాహిన్యశ్చ యకృత్ప్లీహ్నోః—ఏవమేతాని సప్తసిరాశతాని. 4

పైఁజెప్పినప్రకారము నాభి నాశ్రయించియుండు 700 సిరలలో వాతమును వహించునవి 10, పిత్తమును వహించునవి 10, కఫమును వహించునవి 10, రక్తమును వహించునవి 10, ఇటుల 40 సిరలు ప్రధానంబులుగ నుండును. వానిలో వాతస్థానము నాశ్రయించి వాతమును వహించుచుండునట్టి యుపసిరలు 175, పిత్తస్థానము నాశ్రయించి పిత్తమును వహించుచుండునట్టి యుపసిరలు 175, కఫస్థానము నాశ్రయించి కఫమును వహించుచుండునట్టి యుపసిరలు 175, రక్తస్థానములైన యకృత్ప్లీహముల నాశ్రయించి రక్తమును వహించుచుండునట్టి యుపసిరలు 175 యిటుల సిరలన్నియు 700 అని తెలియఁదగును.

## హస్తపాదగతవాతవాహినీసిరాసంఖ్య.

సూ. తత్ర వాతవాహిన్యస్సిరా ఏకస్మిన్సక్థ్ని పఞ్చవింశతిః. ఏతేనేతరసక్థి బాహూ చ వ్యాఖ్యాతౌ. 5

పైఁజెప్పిన వాతవాహినీసిరలలో నొకకాలియందు వాతమును వహించునట్టిసిరలు 25 ఇటులనే మఱియొకకాలియందును, రెండుచేతులయందును 25 చొప్పున రెండు కాళ్లయందును, రెండుచేతులయందును 100 సిరలుండునని తెలియవలయును.

## కోష్ఠగతవాతవాహినీసిరాసంఖ్య.

సూ. విశేషతస్తు కోష్ఠే చతుస్త్రింశత్; తాసాం గుదమేఢ్రాశ్రితాశ్శ్రోణ్యామష్టౌ; ద్వే ద్వే పార్శ్వయోః, షట్పృష్ఠే, తావత్యేవ చోదరే, దశ వక్షసి. 6

గుదము మేఢ్రము వీని నాశ్రయించి శ్రోణిమధ్యమున వ్యాపించియుండుసిరలు 8, ఒక్కొకపార్శ్వమునందు 2-2 చొప్పున రెండుపార్శ్వములయందు వ్యాపించి వాతమును వహించుచుండునట్టి సిరలు 4, వీఁపుయందు 6, ఉదరమునందు 6, ఱొమ్మునందు 10, ఇటుల 34 సిరలు కోష్ఠప్రదేశమునందు విశేషముగ వాతమును వహించుచుండును.

## మెడకు పైభాగమునందలి వాతవాహినీసిరాసంఖ్య.

సూ. ఏకచత్వారింశ జ్జత్రుణ ఊర్ధ్వం; తాసాం చతుర్దశ గ్రీవాయామ్, కర్ణయోశ్చతస్రః, నవ జిహ్వాయామ్. షణ్ణాసికాయామ్, అష్టౌ నేత్రయోః, ఏవమేతత్పఞ్చసప్తత్యధికశతం వాతవహానాం సిరాణాం వ్యాఖ్యాతమ్.

మెడయందు 14, కర్ణములయందు 4, నాలుకయందు 9, నాసికయందు 6,

నేత్రములయందు 8, ఇటుల మెడకొంకులకుపైన వాతమును వహించునట్టి సిరలు 41 ఇటుల వాతమును వహించునట్టి సిరలన్నియు 175 అని వివరింపఁబడియె.

### పిత్తవాహిన్యాదిసిరావిభాగము.

సూ. ఏష ఏవ విభాగశ్శేషాణామపి. విశేషతస్తు పిత్తవాహిన్యో నేత్రయోర్దశ, కర్ణయోర్ద్వే ఏవం రక్తవహాః కఫవహాశ్చ. ఏవమేతాని సప్త సిరాశతాని సవిభాగాని వ్యాఖ్యాతాని. 8

పైప్రకారమే తక్కిన పిత్త, కఫ, రక్తవాహినీసిరలవిభాగము నెఱుంగవలయును. అయినను, నేత్రములయందు మాత్రము, 10 పిత్తవాహినీసిరలు, 10 కఫవాహినీ సిరలు, 10 రక్తవాహినీసిర లుండును. ఇటులనే కర్ణములయందు 2 పిత్తవహాసిరలు, 2 రక్తవహాసిరలు, 2 కఫవహాసిరలుండును. ఈప్రకారమే యావచ్ఛరీరమునందు విభాగపూర్వకముగ 700 సిరలు వివరింపఁబడియె.

### వాతసంచారగుణము.

భవన్తి చాత్ర.—

శ్లో. క్రియాణామప్రతీఘాతమమోహం బుద్ధికర్మణా,
కరోత్యన్యాన్గుణాంశ్చాపి స్వాస్సిరాః పవనశ్చరన్. 9
యదా తు కుపితో వాయుస్స్వాస్సిరాః ప్రతిపద్యతే,
తదాస్య వివిధా రోగా జాయన్తే వాతసమ్భవాః. 10

వాతము తనను వహించు సిరలయందు స్వభావముగ సంచరించుచుండునపుడు హస్తపాదములయందు ఆకుంచనప్రసారణాదిక్రియలను, చక్షురాదిజ్ఞానేంద్రియములయందు తమతమదర్శనాదివ్యాపారశక్తిని, శరీరోద్వాహనము, పూరణము మొదలగు గుణములను గలుగంజేయుచుండును. వాతము ప్రకోపించి తనను వహించుసిరలయందు సంచరించుచుండునపుడు శరీరమునందు నానావిధము లగువాతరోగములను గలుగఁజేయును.

### పిత్తసంచారగుణము.

శ్లో. భ్రాజిష్ణుతామన్నరుచిమగ్నిదీప్తిమరోగతామ్,
సంసర్పత్స్వాస్సిరాః పిత్తం కుర్యాచ్చాన్యాన్గుణానపి.
యదా ప్రకుపితం పిత్తం సేవతే స్వవహాస్సిరాః,
తదాఽస్య వివిధా రోగా జాయన్తే పిత్తసమ్భవాః. 11

పిత్తము, తనను వహించుసిరలయందు స్వభావముగ సంచరించుచుండునపుడు శరీరమందుఁ గాంతి, యన్నమునందు రుచి, జఠరాగ్నిదీపనము, ఆరోగ్యము, తేజస్సు మొద

లగు గుణములు గలుగఁజేయును. పిత్తము ప్రకోపించి తనను వహించుచుండు సిరలయందు సంచరించుచుండునపుడు శరీరమునందు నానావిధపిత్తరోగములను గలుగఁజేయును.

### కఫసంచారగుణము.

శ్లో. స్నేహమఙ్గేషు సన్ధీనాం స్థైర్యం బలముదీర్ణతామ్,
కరోత్యన్యాన్గుణాంశ్చాపి బలాసస్స్వాస్సిరాశ్చరన్.
యదా తు కుపితశ్శ్లేష్మా స్వాస్సిరాః ప్రతిపద్యతే,
తదాఽస్య వివిధా రోగా జాయన్తే శ్లేష్మసమ్భవాః. 12

కఫము తనను వహించుసిరలయందు స్వభావముగ సంచరించుచుండునపుడు శరీరము మినమినలాడుట, సంధులు స్థిరముగనుండుట, బలము, ఉత్సాహము మొదలగు గుణములఁ గలుగఁజేయును. కఫము ప్రకోపించి స్వవాహినీసిరలయందు సంచరించుచుండునపుడు శరీరమునఁ గఫజనితమైన నానావిధములగు కాసశ్వాసములు, సిరాపూరణము, స్పర్శము తెలియకుండుట మొదలగు రోగములఁ గలుగఁజేయును.

### రక్తసంచారగుణము.

శ్లో. ధాతూనాం పూరణం వర్ణం స్పర్శజ్ఞానమసంశయమ్,
స్వాస్సిరాస్సఞ్చరద్రక్తం కుర్యాచ్చాన్యాన్గుణానపి.
యదా తు కుపితం రక్తం సేవతే స్వవహాస్సిరాః,
తదాఽస్య వివిధా రోగా జాయన్తే రక్తసమ్భవాః. 13

రక్తము స్వవాహినీసిరలయందు స్వభావముగ సంచరించుచుండునపుడు సప్తధాతువులయందుఁ బూరణము, స్పర్శజ్ఞానము, కాంతి, అన్నమునందు రుచి, జాఠరాగ్నిదీపనము, ఆరోగ్యము మొదలగుగుణములఁ గలుగఁజేయును. రక్తము ప్రకోపించి స్వవాహినీసిరలయందు సంచరించునపుడు శరీరమందు రక్తజనితమైన నానావిధరోగములఁ గలుగఁజేయును.

### సిరలకు సర్వవహత్వము.

శ్లో. న హి వాతం సిరాః కాశ్చిన్న పిత్తం కేవలం తథా,
శ్లేష్మాణం వా వహన్త్యేతా అతస్సర్వవహాస్స్మృతాః. 14

సిరలు కేవలవాతమునుగాని, పిత్తమునుగాని, శ్లేష్మమునుగాని వహింపక నంశభేదముచే వాతపిత్తశ్లేష్మముల వహించుచుండును.

శ్లో. ప్రదుష్టానాం హి దోషాణాముచ్ఛ్రితానాం ప్రధావతామ్,
ధ్రువమున్మార్గగమనమతస్సర్వవహాస్స్మృతాః. 15

ప్రకోపించినవియు, వృద్ధిఁజెందినవియు, నతితీవ్రము కలవియు నైనవాతాది దోషముల నంశభేదముచే గ్రహించునట్టి సర్వసిరలకు దుష్టగమనము సిద్ధంబు. కావున సిరలు సర్వవహములని చెప్పంబడును.

వాతవహాదిసిరావర్ణాదివిభాగము.

శ్లో. తత్రారుణా వాతవహాః పూర్యన్తే వాయునా సిరాః,
పిత్తాదుష్ణాశ్చ నీలాశ్చ శీతా గౌర్యస్స్థిరాః కఫాత్,
అసృగ్వహాస్తు రోహిణ్యస్సిరా నాత్యుష్ణశీతలాః. 16

వానిలో వాతవాహినీసిరలు రక్తవర్ణముగలవియై వాతపూరితంబులుగ నుండును. పిత్తవాహినీసిరలు ఉష్ణము, నీలవర్ణముగలవిగ నుండును. శ్లేష్మవాహినీసిరలు శీతలము, స్థిరత్వముగలవియై గౌరవర్ణముగ నుండును. రక్తవాహినీసిరలు అత్యుష్ణము, అతిశీతలము లేకుండ మధ్యస్థములై రక్తవర్ణముగ నుండును.

శ్లో. అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి న విధ్యేద్యాస్సిరా భిషక్,
వైకల్యం మరణం చాపి వ్యధాత్తాసాం ధ్రువం భవేత్. 17

వైద్యుఁడేసిరలయందు శస్త్రకర్మను జేసిన వైకల్యము, మరణము నిశ్చయముగ గలుగునో అట్టిసిరల నిఁక వివరించెదము.

శస్త్రముచే వేధింపఁదగనిసిరాసంఖ్య.

శ్లో. సిరాశతాని చత్వారి విద్యాచ్ఛాఖాసు బుద్ధిమాన్,
షట్త్రింశచ్చ శతం కోష్ఠే చతుష్షష్టిం చ మూర్ధని.
శాఖాసు షోడశ సిరాః కోష్ఠే ద్వాత్రింశదేవ తు,
పఞ్చాశజ్జత్రుణశ్చోర్ధ్వమవేధ్యాః పరికీర్తితాః. 18

హస్తపాదములయందు 400, కోష్ఠప్రదేశమునందు 136, శిరస్సుయందు 164 సిరలుండును. వానిలో హస్తపాదములయందలి 16 సిరలను, కోష్ఠమునందలి 32 సిరలను, మెడకొంకులకు పైభాగమున 50 సిరలను వేధింపఁజనదు.

హస్తపాదములయందవేధ్యసిరాసంఖ్య.

సూ. తత్ర సిరాశతమేకైకస్మిన్సక్థ్ని భవతి. తాసాం జాలధరా త్వేకా, తిస్రశ్చాభ్యన్తరాః—తత్రోర్వీసంజ్ఞే ద్వే, లోహితాక్షసంజ్ఞా చైకా, ఏతాస్త్వవేధ్యాః. ఏతేనేతరసక్థి బాహూ చ వ్యాఖ్యాతౌ. ఏవమ శస్త్రకృత్యాష్షోడశ శాఖాసు. 19

ఒక్కొక కాలియందు 100 సిరలుండును. వానిలో జాలధరము 1, లోపల నుండు ఊర్వులు 2, లోహితాక్షము 1 అను నీనాలుగు సిరలకు శస్త్రముచే వేధింపఁ జనదు. ఇటులనే మఱియొక కాలియందుండు సిరలను, ఒక్కొక బాహువునందు 4 సిరలుచొప్పున రెండుబాహువులయందు 8 సిరలను వేధింపంజనదు. ఈ ప్రకారము హస్తపాదములయందు శస్త్రకర్మ సేయందగని సిరలు 16.

—— కోష్ఠప్రదేశమునందవేధ్యసిరాసంఖ్య. ——

సూ. ద్వాత్రింశచ్ఛ్రోణ్యాం. తాసామష్టావశస్త్రకృత్యాః—ద్వే ద్వే విటపయోః కటీకతరుణయోశ్చ. అష్టావష్టావేకైకస్మిన్పార్శ్వే తాసామేకైకామూర్ధ్వగాం పరిహరేత్పార్శ్వసన్ధిగతే చ ద్వే. చతస్రో వింశతిశ్చ పృష్ఠవంశముభయతః. తాసామూర్ధ్వగామిన్యౌ ద్వే ద్వే పరిహరేద్బృహతీ సిరే. తావత్య ఏవోదరే. తాసాం మేఢ్రోపరి రోమరాజీముభయతో ద్వే ద్వే పరిహరేత్. చత్వారింశద్వక్షసి. తాసాం చతుర్దశాశస్త్రకృత్యాః, హృదయే ద్వే, ద్వే ద్వే స్తనమూలే, స్తనరోహితాపలాపాపస్తమ్భేషూభయతోఽష్టౌ—ఏవం ద్వాత్రింశదశస్త్రకృత్యాః పృష్ఠోదరోరస్సు భవన్తి. 20

శ్రోణియందు 31 సిరలుండును. వానిలో నొక్కొకవిటపమునందు 2 సిరలచొప్పున రెండు విటపములయందు 4, కటీకతరుణములయందు 4, ఇటుల 8 సిరలుండును. వీనిని శస్త్రముచే వేధింపంజనదు. ఒక్కొకపార్శ్వమునందు 8 సిరలుండును. వానిలో నిరుపార్శ్వసంధులయందును నూర్ధ్వముగ వ్యాపించియుండు రెండు సిరలను శస్త్రముచే వేధింపంజనదు. వెన్నెముక కిరుపార్శ్వములయందు 24 సిరలుండును. వానిలో నొక్కొకపార్శ్వమునం దూర్ధ్వముగ వ్యాపించియుండు బృహతి యను2 సిరలచొప్పున నిరుపార్శ్వములయందుండు బృహతులను 4 సిరలను శస్త్రకర్మయందు వర్జించవలయు. ఉదరమునందు 24 సిరలుండును. వానిలో మేఢ్రమునకు పైన రోమపంక్తి కిరుపార్శ్వములయందు నొక్కొక పార్శ్వమున రెండురెండు చొప్పున 4 సిరలను శస్త్రకర్మయందు వర్జించవలయు. ఱొమ్మున 40 సిరలుండును. వానిలో హృదయమునందు 2, ఒక్కొక స్తనమూలమునందు రెండు రెండు చొప్పున రెండు స్తనమూలములయందు 4, స్తనరోహితములందు 4, అపలాప, అపస్తంభములయందు 4, యీ పదునాలుగుసిరలను శస్త్రకర్మయందు వర్జించవలయు. ఇటుల పృష్ఠము, ఉదరము, ఱొమ్ము అనువానియందు వేధింపఁదగని సిరలు 32 అని తెలియందగు.

—జత్రూర్ధ్వమునందవేధ్యసిరాసంఖ్య.—

సూ. చతుష్షష్టిసిరాశతం జత్రుణ ఊర్ధ్వం భవతి. తత్ర షట్పఞ్చాశ చ్ఛిరోధరాయాం; తాసామష్టౌ చతస్రశ్చ మర్మసంజ్ఞాః పరిహరేత్, ద్వే కృకాటికయోః, ద్వే విధురయోః. ఏవం గ్రీవాయాం షోడశావధ్యాః. 21

మెడకొంకులకు పైభాగమున 164 సిరలుండును. వానిలో కంఠమునందు 56 సిరలుండును. వానిలో మాతృకలు 8, మన్యలు 2, నీలలు 2, అనుమర్మసంజ్ఞగల సిరలు 12, కృకాటికలయందు 2, విధురములయందు 2, వెరసి 16 సిరలను శస్త్రముచే వేధింపం జనదు.

—హనువులయందవేధ్యసిరాసంఖ్య.—

సూ. హన్వోరుభయతోఽష్టావష్టౌ; తాసాం తు సన్ధిధమన్యౌ ద్వే ద్వే పరిహరేత్. 22

రెండు కటిమర్లయందు నొక్కొకపార్శ్వమున నెనిమిదియెనిమిది చొప్పున 16 సిరలుండును, వానియొక్క ప్రతిపార్శ్వమునందు రెండు రెండు సంధినాడుల చొప్పున రెండు పార్శ్వములయందుండు 4 సంధినాడులను శస్త్రకర్మయందు వర్జించవలయును.

—నాలుకయందు వేధింపఁదగనిసిరాసంఖ్య.—

సూ. షట్త్రింశజ్జిహ్వాయాం. తాసామధష్షోడశాశస్త్రకృత్యాః—రసవహే ద్వే, వాగ్వహే చ ద్వే. 23

నాలుకయందుఁ గ్రిందిభాగమున 16, పైభాగమున 20 ను గలసి 36 సిరలు నాలుకయందుండును. వానిలో రసమును వహించునట్టిసిరలు 2, వాగ్వహసిరలు 2, యీ నాలుగుసిరలను శస్త్రముచే వేధింపంజనదు.

—నాసికయందు వేధింపఁదగనిసిరాసంఖ్య.—

సూ. ద్విర్ద్వాదశ నాసాయాం. తాసామౌపనాసిక్యశ్చతస్రః పరిహరేత్, తాసామేవ చ తాలున్యేకాం మృదావుద్దేశే. 24

నాసికయందు 14 సిరలుండును. వానిలో నాసాసమీపమునందు 4, నోటిలోపలి దౌడయందు మృదువైన ప్రదేశమున 1, ఈయైదు సిరలను శస్త్రకర్మయందు విడువవలయును.

—నేత్రమందు వేధింపఁదగనిసిరాసంఖ్య.—

సూ. అష్టాత్రింశదుభయోర్నేత్రయోః తాసామేకైకామపాఙ్గయోః పరిహరేత్. 25

నేత్రములయందు 28 సిరలుండును. వానిలో అపాంగములయందలి యొక్కొక సిరను శస్త్రకర్మయందు వర్జించవలయును.

చెవులయందు వేధింపం దగని సిరాసంఖ్య.

సూ. కర్ణయోర్దశ. తాసాం శబ్దవాహినీమేకైకాం పరిహరేత్. 26

కర్ణములయందు 10 సిరలుండును. వానిలో శబ్దవాహినియగు నొక్కొక నాడిని శస్త్రకర్మయందు వర్జించవలయును.

లలాటము (నుదురు). నందు వేధింపందగని సిరాసంఖ్య.

సూ. నాసానేత్రగతాస్తు లలాటే షష్టిః. తాసాం కేశాన్తానుగతాశ్చతస్రః. ఆవర్తయోరేకైకా స్థపన్యాం చైకా పరిహర్తవ్యా. 27

లలాటమునందు నాసికము, నేత్రములు వీనియందు వ్యాపించియుండునట్టి సిరలు 60. వానిలో కేశాంతమువఱకు వ్యాపించియుండు సిరలు 4, ఆవర్తములయందు నొక్కొక్కటి, స్థపనియం దొక్కటి, ఈ 7 సిరలను శస్త్రకర్మయందుఁ బరిహరించవలయును.

కణతలయందు వేధింపఁదగని సిరాసంఖ్య.

సూ. శఙ్ఖయోర్దశ. తాసాం శఙ్ఖసన్ధిగతామేకైకాం పరిహరేత్. 28

శంఖము (కణత)లయందు 10 సిరలుండును. వానిలో శంఖసంధులయందు వ్యాపించిన యొక్కొక సిరను శస్త్రకర్మయందు వర్జించవలయును.

శిరమునం దవేధ్యసిరాసంఖ్య.

సూ. ద్వాదశ మూర్ధ్ని. తాసాముత్క్షేపయోర్ద్వే పరిహరేత్, సీమన్తేష్వేకైకామేకామధిపతావితి. ఏవమశస్త్రకృత్యాః పఞ్చాశజ్జత్రుణ ఊర్ధ్వమితి. 29

శిరస్సుయందు 12 సిరలుండును. వానిలో నుత్క్షేపమర్మలయందు 2, సీమంతములయందు 5, అధిపతిమర్మలయందు 1, ఈ యెనిమిది సిరలను శస్త్రకర్మయందు వర్జించవలయును. ఈప్రకారము మెడకొంకులకు పైభాగమునందు వేధింపం దగని సిరలు 50 యని తెలియందగు.

భవతి చాత్ర —

శ్లో. వ్యాప్నువన్త్యభితో దేహం నాభితః ప్రసృతాస్సిరాః,
ప్రతానాః పద్మినీకన్దాద్బిసాదీనాం యథా జలమ్. 30

ఇతి శ్రీసుశ్రుతాచార్యవిరచితే ఆయుర్వేదశాస్త్రే సుశ్రుతే తృతీయే శారీరస్థానే సప్తమోఽధ్యాయః.

తామరకాడలు మొదలగునవి గడ్డనుండి బయలువెడలి యుదకమునం దంతట వ్యాపించునటులనే సిరలు నాభినుండి బయలువెడలి సర్వశరీరమునందును వ్యాపించును.

---

# అష్టమాధ్యాయము.

సూ. అథాతస్సిరావ్యధవిధిశారీరం వ్యాఖ్యాస్యామః. 1

పైఁజెప్పంబడినయధ్యాయమున సిరావర్ణనము, వానివిభాగము, అవేధ్యమగు సిరల వివరణము మున్నగు విషయంబులం దెలిసికొనినను సిరావేధనక్రమము, (సిరల నెటుల వేధించవలయు? నేయేరోగంబులం దెయ్యవి వేధ్యంబులు? మున్నగువిషయంబులను) దెలియఁజేయుట ముఖ్యంబగుటచే నీ "సిరావ్యధవిధి" అను అధ్యాయమును వివరించెదము.

## శస్త్రకర్మయం దనర్హులు.

సూ. బాలస్థవిరరూక్షక్షతక్షీణభీరుపరిశ్రాన్తస్త్రీమద్యాధ్వకర్శితమత్తవాన్తవిరిక్తాస్థాపితానువాసితజాగరితక్లీబకృశగర్భిణీనాం కాసశ్వాసశోషప్రవృద్ధజ్వరాక్షేపకపక్షాఘాతోపవాసపిపాసా మూర్ఛాప్రపీడితానాం చ సిరాం న విధ్యేత్, యాశ్చావ్యధ్యావ్యధ్యాశ్చాదృష్టాః, దృష్టాశ్చాయన్త్రితాః, యన్త్రితాశ్చానుత్థితా ఇతి. 2

బాలురు, వృద్ధులు రూక్షమగు శరీరముగలవారు, క్షతక్షీణులు, భయశీలురు, బడలినవారు, స్త్రీసంభోగము, మద్యపానము, త్రోవనడుచుట వీనివలన కృశించినవారు, మదించినవారు, వమనముఁ జేసికొనినవారు, విరేచనపీడితులు, నిరూహవస్తి, అనువాసనవస్తి, వీనినిఁజేయించుకొనినవారు, రాత్రులయందు నిద్రమేలుకొనినవారు, నపుంసకులు, కృశులు, గర్భిణీస్త్రీలు, కాసము, శ్వాసము, శోష, మహాజ్వరము, ఆక్షేపకవాతము, పక్షాఘాతము, ఉపవాసము, దప్పి, మూర్ఛ వీనివలనఁ బీడింపఁబడినవారు, ఇట్టివారలకు సిరావేధఁ జేయంజనదు. ఏలనఁగా, క్షతక్షీణునికి సిరావ్యధఁజేసినయెడల వాతముచే పీడగలుగును. భయస్వభావముగలవానికిఁ దమోగుణవృద్ధిచే మూర్ఛగలుగును. స్త్రీసంభోగము చేసినవారికి వాతము ప్రకోపించును. మద్యపానముచేసినవానికి మిక్కుటముగ మూర్ఛగలుగును. మార్గాయాసముఁ జెందినవానికి, నిరూహవస్తి జేయఁబడినవానికి వాతము ప్రకోపించును. అనువాసనవస్తిఁ జేయించుకొనినవానికి మిక్కుటముగ నగ్ని

మాంద్యము గలుగును. నపుంసకునికి ప్రధానమైన ధాతువు క్షీణించి మరణము గలుగును. కృశించినవారికి, గర్భిణులకు ధాతుక్షయమువలన దేహము నశించును. కాసము, శ్వాసము, శోషము, ఇవిగలవారికైన ధాతుక్షయమువలన మరణము గలుగును. మహాజ్వరము, ఆక్షేపకవాతము, పక్షాఘాతము ఇవి గలవారికి వాతప్రకోపమువలన భయము గలుగును. మఱియుఁ బూర్వాధ్యాయమునందుఁ జెప్పంబడినప్రకారము శస్త్రకర్మఁ జేయఁదగని సిరలను, శస్త్రకర్మయందు యోగ్యమైనను యదృష్టములుగనుండు సిరలను కాన్పించినను యథావిధిగ గట్టంబడని సిరలను, విధిప్రకారము గట్టంబడినను పైకి లేవక నుండుసిరలను, శస్త్రముచే వేధింపంజనదు.

### త్వగ్దోషాదులయందు సిరావేధనక్రమము.

సూ. శోణితావసేకసాధ్యాశ్చ వికారాః ప్రాగభిహితాస్తేషు చాపక్వేష్వన్యేషు చానుక్తేషు యథాభ్యాసం యథాన్యాయం చ సిరాం విధ్యేత్. 3

రక్తస్రావమువలన సాధ్యంబై శోణితవర్ణనాధ్యాయమునందుఁ జెప్పంబడిన త్వగ్దోషము, గ్రంథి, వాపు, రక్తవికారము అనునవి పక్వంబై యుండునపుడును, ఆ యధ్యాయమునందుఁ జెప్పంబడనివియు, రక్తస్రావసాధ్యంబులును నగు గుల్మప్లీహాదుల యందు పక్వమైయుండునపుడును, అభ్యాసము నతిక్రమించక యథోక్తస్నేహస్వేదాద్యుపచారపూర్వకముగ సిరావేధం జేయవలయును.

### సర్పాదులయందు సిరావేధనావశ్యకత్వము.

సూ. ప్రతిషిద్ధానామపి చ విషోపసర్గ ఆత్యయికేషు సిరావ్యధనమప్రతిషిద్ధమ్. 4

సిరావేధవిషయమునందు నిషేధింపఁబడిన బాలస్థవిరాదుల కత్యంతోపద్రవకరమగువ్యాధి జనించియుండునపుడును, రక్తమోక్షణసాధ్యంబులుగనుండి మృత్యుకరంబులుగ నుండు సర్పవిషాదులయందును, విసర్పాదిరోగంబులయందును సిరావేధను నిషేధము సేయంజనదు.

### సిరావేధనక్రమము.

సూ. తత్ర స్నిగ్ధస్విన్నమాతురం యథాదోషప్రత్యనీకం ద్రవప్రాయమన్నం భుక్తవన్తం యవాగూం పీతవన్తం వా యథాకాలముపస్థాప్యాసీనం స్థితం వా ప్రాణానబాధమానో వస్త్రపట్టచర్మాన్తర్వల్కలలతానామన్యతమేన యన్త్రయిత్వా నాతిగాఢం నాతి

శిథిలం శరీరప్రదేశమాసాద్య యథోక్తం శస్త్రం గృహీత్వా సిరాం విధ్యేత్. 5

మొదట రోగిని స్నేహస్వేదాద్యుపచారంబులచే నుపచరించి ఆమాదోషహరమై ద్రవప్రాయముగనుండు నన్నముఁగాని, గంజినిగాని, యుక్తమగుకాలమునందు భుజింపఁజేసి మేఘాచ్ఛాదనము, వర్షము ఇవి లేనిసమయంబున రోగిని లలాటాదిసిరల వేధించు నపుడు, కూర్చుండఁబెట్టియు, పాదాదిసిరావేధఁ జేయునపుడు నిలుపఁబెట్టియు నుత్సాహపఱచి ప్రాణస్థానంబుల నొప్పి గలుగకుండ వేధింపఁదగిన సిరాప్రదేశమును, వస్త్రపట్టము, చర్మము, నార, తీఁగలు వీనిలోఁ దేనిచేనైనను, మిగుల బిగువుగను, మిక్కిలి వదులుగను గాకుండఁ గట్టి మర్మస్థలములను విడచి యథోక్తముగ శస్త్రముచే సిరావేధం జేయవలయు.

### సిరావేధననిషిద్ధకాలము.

శ్లో. నైవాతిశీతే నాత్యుష్ణే న ప్రవాతే న చాభ్రితే,
సిరాణాం వ్యధనం కార్యమరోగే వా కదాచన. 6

మిక్కిలి చల్లఁదనము, మిక్కిలి యుష్ణము, అధికముగ గాలి, మేఘాడంబరము ఇవి గలిగియుండు కాలమునను, రోగములేనియపుడును సిరావేధం జేయంజనదు.

### శిరోగతసిరావేధనక్రమము.

సూ. తత్ర వ్యధ్యసిరం పురుషం ప్రత్యాదిత్యముఖమరత్నిమాత్రోచ్ఛ్రితే ఉపవేశ్యాసనే సక్థ్నోరాకుఞ్చితయోరుపరి కూర్పరసన్ధిద్వయం నివేశ్య హస్తావన్తర్గూఢాఙ్గుష్ఠకృతముష్టిమన్యయోస్థాపయిత్వా యన్త్రిణశాటకం గ్రీవాముష్ట్యోరుపరి పరిక్షిప్యాన్యేన పురుషేణ పశ్చాత్స్థితేన వామహస్తేనోత్తానేన శాటకాన్తద్వయం గ్రాహయిత్వా తతో వైద్యో బ్రూయాద్దక్షిణహస్తేన సిరోత్థాపనార్థం నాత్యాయితశిథిలం యన్త్రమావేష్టయేత్యసృక్స్రావణార్థం యన్త్రం పృష్ఠమధ్యే చ పీడయేతి, కర్మపురుషం చ వాయుపూర్ణముఖం స్థాపయేదేష ఉత్తమాఙ్గగతానామన్తర్ముఖవర్జ్యానాం సిరాణాం వ్యధనే యన్త్రణవిధిః. 7

సిరావ్యధకర్మ్మండగువానిని అరత్ని(మూర)మాత్ర మెత్తుగలపీఠమునందు సూర్యున కభిముఖముగఁ గూర్చుండఁబెట్టి వానికాళ్లను ముడుచునటులంజేసి వానిపై మోఁచేతుల నునిచి చేతిబొట్టనవ్రేలు లోపలనుండునట్లు పిడికిలిపట్టించి దానిని కంఠమునకు వెనుక ప్రక్కనుండు మన్యసిరలయం దునిచి రెండువ్రేళ్ల వెడల్పుగల దృఢమైనబట్టతోఁగాని

వారు పట్టతోగాని కంఠమును, దానిపైనుండు పిడికిళ్లను గలియునట్లు దృఢముగ బంధించి దానిని వెనుకభాగమున నెడమచేతితోఁ బట్టుకొని నిలచియుండునటుల మఱియొకని నియమించి రోగియొక్క సిరోత్థాపనార్థమై మిక్కిలి బిగువుగ శిథిలము గాకుండునటుల యంత్రమును కుడిచేతితో వేష్టనము చేయించి (మెడకుచుట్టును వస్త్రమును జుట్టి) రక్తము బాగుగ స్రవించుటకై పృష్ఠమధ్యస్థానమునందు యంత్రమును బాగుగ మెలియఁబెట్టి శ్వాసోచ్ఛ్వాసములు ముఖమునుండి బైలువెడలకుండునటులం జేసి సిరావేధం జేయవలయు. ఈ చెప్పినక్రమము ముఖమునం దుండుసిరలకుఁ దప్ప శిరమునందుండు సిరలకుమాత్ర ముపయోగించును.

### పాదగతసిరావేధనక్రమము.

సూ. తత్ర పాదవ్యధ్యసిరస్య పాదం సమే స్థానే సుస్థిరం స్థాపయిత్వా ఉన్యం పాదమీషత్సఙ్కుచితముచ్చైః కృత్వా వ్యధ్యపాదం జానుసన్ధేరధశ్శాటకేనావేష్ట్య హస్తాభ్యాం ప్రపీడ్యాగుల్ఫం వ్యధ్యప్రదేశస్యోపరి చతురఙ్గుళం పట్టాదీనామన్యతమేన బధ్వా పాదసిరాం విధ్యేత్. 8

పాదమునందు సిరావేధనం బావశ్యకం బగునేని రోగిపాదమును సమభూమియందు దృఢముగ నునిచి మఱియొకపాదము నొకింత వంచి యున్నతమైనప్రదేశమునం దునిచి సిరావ్యధఁ జేయగలపాదముయొక్క మోకాటిక్రింద గట్టిగ బట్టనుజుట్టి చేతులతో గుల్ఫప్రదేశము వఱకు బాగుగ పిసికి వేధించఁబోయెడిస్థానమునకు పైభాగమున నాలుగంగుళముల ప్రదేశమునందు వస్త్రపట్టము మొదలగువానిలో దేనిచేనైనను గట్టి పాదసిరను వేధింపవలయు.

### హస్తగతసిరావేధనక్రమము.

సూ. అథోపరిష్టాద్ధస్తౌ గూఢాఙ్గుష్ఠకృతముష్టీ సమ్యగాసనే స్థాపయిత్వా సుఖోపవిష్టస్య పూర్వసద్యన్త్రం బధ్వా హస్తసిరాం విధ్యేత్. 9

హస్తమునందలి సిరావేధన మావశ్యకంబగునెడ పూర్వమువలెనే బొటనవేళ్లు లోపలనుండునట్లు పిడికిలి పట్టించి సుఖముగఁ గూర్చుండఁబెట్టి వానిహస్తముల నున్నతమైన యాసనమునందు బాగుగనునిచి వ్యధ్యప్రదేశమునకు పైన నాలుగంగుళములు విడిచి పట్టతో బంధించి హస్తములయందు సిరావ్యధఁ జేయవలయు.

### గృధ్రస్యాములయందు సిరావేధనక్రమము.

సూ. గృధ్రసీవిశ్వాచ్యోస్సఙ్కుచితజానుకూర్పరస్యావ్యత్. 10

గృధ్రసి, విశ్వాచి అను వాతరోగములయందు మోకాళ్లు, మోచేతులు ముడుచుకొని యుండునటులఁ జేసి పైఁ జెప్పినప్రకారమే బంధసంధులఁ జేసి సిరావ్యధఁ జేయవలయు.

### శ్రోణ్యాదిగతసిరావేధనక్రమము.

సూ. శ్రోణీపృష్ఠస్కన్ధేషూన్నామితపృష్ఠస్యావాక్ఛిరస్కస్యోపవిష్టస్య విస్ఫూర్జితపృష్ఠస్య విధ్యేత్. 11

శ్రోణి, వీఁపు, భుజములు వీనియందలి సిరల వేధించవలసియుండునెడల నెత్తఁబడిన వీఁపుగలవానిగ, వంచఁబడిన శిరముగలవానిగ, విస్ఫూర్జితమైన (ఊద్వఁబడిన) పృష్ఠముగలవానిగఁ జేసి కూర్చుండఁబెట్టి సిరల వేధించవలయు.

### ఉదరాదిగతసిరావేధనక్రమము.

సూ. ఉదరోరసోః ప్రసారితోరస్కస్యోన్నమితశిరస్కస్య విస్ఫూర్జితదేహస్య. 12

ఉదరము, ఱొమ్ము, వీనియందు సిరావ్యధఁ జేయునెడ విరిచికొనియుండు ఱొమ్ముగలవానిగ, పొడవుగ నెత్తఁబడినశిరముగలవానిగ, విస్ఫూర్జితమైన దేహముగలవానిగఁ జేసి సిరలను వేధించవలయును.

### పార్శ్వాదిగతసిరావేధనక్రమము.

సూ. బాహుభ్యామవలమ్బ్యమానదేహస్య పార్శ్వయోః. అవనామితమేఢ్రస్య మేఢ్రే, ఉన్నామితవివిదష్టజిహ్వాగ్రస్యాధో జిహ్వాయామ్. అతివ్యాత్తాననస్య తాలుని దన్తమూలేషు చ. 13

రెండుచేతులచేతను ప్రక్కలను బట్టుకొని యుండునటులఁ జేసి పార్శ్వసంధిసిరలను, మేఢ్రము నధోభాగముగ వంచి మేఢ్రమునందు సిరలను, నాలుకను కఱచికొనియుండునపుడు పైకెత్తునటులం జేసి క్రిందిభాగమున నాలుకయందు సిరలను, నోరును బాగుగ దెఱచునటులం జేసి నోటిలోని దౌడయందును, దంతమూలములయందును, సిరావేధం జేయవలయు.

### సిరాసామాన్యవేధనవిధి.

సూ. ఏవం యన్త్రోపాయానన్యాంశ్చ సిరోత్థాపనహేతూన్బుద్ధ్వాఽవేక్ష్య శరీరవశేన వ్యాధివశేన చ విదధ్యాత్. మాంసలేష్వవకాశేషు యవమాత్రం శస్త్రం నిదధ్యాదతోఽన్యేష్వర్ధయవమాత్రం వ్రీహిమాత్రం వా వ్రీహిముఖేన. అస్థ్నాముపరి కుఠారికయా విధ్యేదర్ధయవమాత్రమ్. 14

పైఁజెప్పిన సిరోత్థాపన హేతువులైన యంత్రోపాయములను, మఱియు ననేక విధములగు యంత్రోపాయములను వైద్యుఁడు బుద్ధివిశేషముచే నెఱింగి శరీరవ్యాధి బలానుగుణ్యముగ సిరావ్యధఁ జేయవలయు. మాంసమెక్కుడుగనుండు ప్రదేశములందు వ్రీహి ముఖశస్త్రముచే యవప్రమాణమును, ఇతరస్థలములందైనయెడల నర్ధయవప్రమాణముగాని, వ్రీహి (వడ్లగింజ) ప్రమాణముగాని, సిరావ్యధఁ జేయవలయు. అస్థులు విశేషముగనుండు ప్రదేశములందు అర్ధయవప్రమాణము కుఠారికయను నాయుధముచే సిరావ్యధఁ జేయవలయు.

## సిరావేధనోచితకాలము.

భవన్తి చాత్ర.—

శ్లో. వ్యభ్రే వర్షాసు విధ్యేత గ్రీష్మకాలే తు శీతలే,
హేమన్తకాలే మధ్యాహ్నే శస్త్రకాలాస్త్రయస్స్మృతాః. 15

వర్షాకాలమునందు మేఘాడంబరము లేనియపుడును, గ్రీష్మకాలమునందుఁ జల్లఁగ నుండునపుడును, హేమంతకాలమునందు మధ్యాహ్నమునందును సిరావ్యధఁ జేయవలయు.

## సువిద్ధసిరాలక్షణము.

శ్లో. సమ్యక్శస్త్రనిపాతేన ధారయా యా స్రవేదసృక్,
ముహూర్తం రుద్ధ్వా తిష్ఠేచ్చ సువిద్ధాం తాం వినిర్దిశేత్. 16

బాగుగ శస్త్రకర్మ జేసినపిదప ముహూర్తకాలము రక్తము ధారగా స్రవించి పిదప దానియందుఁ జేలిక చుట్టినతోడనే రక్తము స్రవించక నిలిచిపోయినయెడల సువిద్ధ (బాగుగ శస్త్రకర్మ జేయఁబడినది) యని తెలియవలయు.

## దుష్టరక్తస్వరూపము.

శ్లో. యథా కుసుమ్భపుష్పేభ్యః పూర్వం స్రవతి పీతికా,
తథా సిరాసు విద్ధాసు దుష్టమగ్రే ప్రవర్తతే. 17

కుసుంభపుష్పముల నుదకమునఁ దడిపినవానినుండి మొదట పసుపుచాయగల యుదకము వెడలి పిదప మంచిచాయ వెడలునటులనే సిరల వేధించినపుడు మొదట దుష్టరక్తము వెడలి మంచిరక్తము వెడలును.

## సిరావేధనమునందు రక్తనిర్గమాభావకారణము.

శ్లో. మూర్ఛితస్యాతిభీతస్య శ్రాన్తస్య తృషితస్య చ,
న వహన్తి సిరా విద్ధాస్తథాఽనుత్థితయన్త్రితాః. 18

సిరావేధనకాలమందు మూర్ఛ, మిక్కుటముగ భయము, శ్రమ, దప్పి, వీనిలో నేదైనగలవానికి బాగుగ రక్తము స్రవించకుండును. ఏలననఁగా:— మూర్ఛాదులవలన

వాతము ప్రకోపించి సిరాముఖముల నడ్డగించును. సిరోత్థాపనము బాగుగఁజేయక వేధించినయెడల రక్తము సిరలయందు ప్రవాహాభిముఖము కాకుండుటచే స్రవించకుండును.

మూర్ఛితాదులయందు రక్తస్రావక్రమము.

శ్లో. క్షీణస్య బహుదోషస్య మూర్ఛయాఽభిహతస్య చ,
భూయోఽపరాహ్ణే విస్రావ్యో అపరేద్యుస్త్ర్యహేఽపి వా. 19

వాతాదిదోషములు ప్రకోపము నొంది మిక్కుటముగ కృశించినవానికిని, మూర్ఛనొందినవానికిని, ఏకకాలమునందే రక్తమును స్రవింపఁజేయం జనదు. మఱియు, నపరాహ్ణమునందును, మరుదినమునందును, మూఁడవదినమునందును గొంచెము కొంచెముగ మరల రక్తమును స్రవింపం జేయవలయు.

అధికరక్తస్రావనిషేధము.

శ్లో. రక్తం సశేషదోషం తు కుర్యాదపి విచక్షణః,
న చాతిప్రస్రుతం కుర్యాచ్ఛేషం సంశమనైర్జయేత్. 20

నేర్పరియగు వైద్యుఁడు దుష్టరక్తమును సశేషముగ స్రవింపం జేయఁదగునే కాని, యధికముగమాత్రము స్రవింపఁజేయం జనదు. అయినను, దోషశేషంబగు రక్తమును సంశమనౌషధములవలన శమింపఁ జేయవలయు. సంశమనౌషధమనఁగా:—"న శోధయతి న ద్వేష్టి సమాన్ దోషాంస్తథోద్ధతాన్, సమీకరోతి విషమాఞ్ఛమనం తద్యథాఽమృతా" సమదోషంబులకు వైకల్యమును, విరోధమును గలిగించక ప్రకోపమును జెంది విషమంబులుగనుండు దోషములనుమాత్రము సమముగఁజేయుఁ తిప్పతీఁగె మొదలగునవి సంశమనౌషధములని తెలియందగు.

శోణితమోక్షణప్రమాణము.

శ్లో. బలినో బహుదోషస్య వయస్థస్య శరీరిణః,
పరం ప్రమాణమిచ్ఛన్తి ప్రస్థం శోణితమోక్షణే. 21

శరీరమున బలము గలిగి వాతాదిదోషములచేఁ బీడింపఁబడి వయోవంతుఁడు నగు పురుషునికిఁ బ్రస్థపరిమితముకంటె నధికముగ రక్తమును స్రవింపఁజేయంజనదు. ఇచ్చట ప్రస్థమనఁగా:—శ్లో. "వమనే చ విరేకే చ తథాశోణితమోక్షణే. సార్ధత్రయోదశపలం ప్రస్థమాహుర్మనీషిణః." అనుటవలన పదమూఁడున్నర పలములని తెలియుచున్నది. అయినను కొందఱు రక్తమోక్షణమునందు రెండుపలములే పరిమితమని చెప్పుచున్నారు.

పాదదాహాదులయందు సిరావేధనక్రమము.

సూ. తత్ర పాదదాహపాదహర్షచిప్పవిసర్పవాతశోణితవాతకణ్టకవిచర్చికాపాదదారీప్రభృతిషు క్షిప్రమర్మణ ఉపరిష్టాద్ద్వ్యఙ్గులే వ్రీహి

ముఖేన సిరాం విధ్యేత్. శ్లీపదే తచ్చికిత్సితే యథా వక్ష్యతే. క్రోష్టుకశిరఃఖఞ్జపఙ్గులవాతవేదనాసు జఙ్ఘాయాం గుల్ఫస్యోపరి చతురఙ్గులే. 22

పాదదాహము, పాదహర్షము, చిప్పము, విసర్పము, వాతశోణితము, వాతకంటకము, విచర్చిక, పాదదారి మొదలగు రోగములయందు క్షిప్రమర్మము పైభాగమున రెండంగుళములు విడచి వ్రీహిముఖశస్త్రముచేసిరను వేధించవలయు. శ్లీపదరోగమునందు సుశ్రుత ఉత్తరఖండమునఁ జెప్పఁబడిన శ్లీపదరోగచికిత్సాప్రకరణమునం దుండునటుల సిరావేధఁ జేయవలయును. మఱియు, క్రోష్టుకశీర్షము, ఖంజము, పంగు మొదలగు వాతరోగములందు పిక్కయందు గుల్ఫప్రదేశమునకు పైన నాలుగంగుళములు వదలి సిరను వేధించవలయు.

## అపచియందు సిరావేధనక్రమము.

సూ. అపచ్యామిన్ద్రవస్తేరధస్తాద్ద్వ్యఙ్గులే. 23

అపచియను రోగమునందు నింద్రవస్తిమర్మము క్రిందిభాగమున రెండంగుళముల ప్రదేశమునందలి సిరను వేధించవలయు. ఈయపచిరోగము జనించిన వెంటనే సిరావేధఁ జేయవలయు.

## గృధ్రస్యాదులయందు సిరావేధనక్రమము.

సూ. జానుసన్ధేరుపర్యధో వా చతురఙ్గులే గృధ్రస్యామ్. ఊరుమూలసంశ్రితాం తు గళగణ్డే. ఏతేనేతరసక్థిబాహూ చ వ్యాఖ్యాతౌ. 24

గృధ్రసియను వాతరోగమునందు మోకాలికి పైభాగమునఁ గాని, క్రిందిభాగమునఁ గాని నాలుగంగుళముల ప్రదేశమునం దుండుసిరను, గలగండరోగమునందు తొడమొదలు నాశ్రయించి యుండుసిరను వేధించవలయును. ఈప్రకారమే మఱియొక కాలియందును, రెండు చేతులయందును, పైఁ జెప్పిన రోగములు జనించియుండునపుడు సిరావేధం జేయవలయు.

## ప్లీహాదులయందు సిరావేధనక్రమము.

సూ. విశేషతస్తు వామబాహౌ కూర్పరసన్ధేరభ్యన్తరతో బాహుమధ్యే ప్లీహ్ని కనిష్ఠికానామికయోర్మధ్యే వా. ఏవం దక్షిణబాహౌ యకృద్దాల్యే తామేవ చ కాసశ్వాసయోరప్యాదిశన్తి. 25

పాదములకంటె హస్తములం దొకవిశేషము గలదు. ఎటులన:—ప్లీహారోగమునందు నెడమచేతి కూర్పరసంధి (మోచె

కెనవ్రేలికి దర్భవ్రేలికి (అనామికకు)

ఇటులనే యకృద్దాల్యుదరమునందును కుడిచేతియందు సిరను వేధించవలయు. కాస శ్వాసములయందును పైఁ జెప్పినప్రకారము కుడిచేతియందు సిరను వేధించవలయునని కొంద ఱాచార్యులు వచించెదరు. కాసశ్వాసములయందు పూర్వము సిరావ్యధ నిషేధింపఁబడి యుండినను నయ్యవి స్వల్పముగ నుండునపుడు వానిమార్గమును వివృతము సేయుటకు మాత్రము సిరావ్యధఁ జెప్పఁబడినదని కొందఱి యభిప్రాయము.

విశ్వాచ్యాదులయందు సిరావేధనక్రమము.

సూ. గృధ్రస్యామివ విశ్వాచ్యామ్. శ్రోణీం ప్రతి సమన్తాద్ద్వ్యఙ్గులే ప్రవాహికాయాం శూలిన్యామ్. 26

గృధ్రసి యనురోగమునందుఁ జెప్పఁబడిన సిరనే విశ్వాచియందును వేధించవలయు. శూలతోఁగూడి చిరకాలానుబంధియగు ప్రవాహికారోగమునందు శ్రోణిభాగమునకు నలుప్రక్కల రెండంగుళములందుండు సిరను వేధించవలయు.

పరివర్తికాదులయందు సిరావేధనక్రమము.

సూ. పరివర్తికోపదంశశూకదోషశుక్రవ్యాపత్సు మేఢ్రమధ్యే. 27

పరివర్తిక, ఉపదంశము, శూకదోషము, శుక్రదోషము, ఈ రోగములయందు మేఢ్రమధ్యమునందలి సిరను వేధించవలయు.

విద్రధ్యాదులయందు సిరావేధనక్రమము.

సూ. వామపార్శ్వే కక్షాస్తనయోరన్తరేఽన్తర్విద్రధౌ పార్శ్వశూలే చ. 28

అంతర్విద్రధి, పార్శ్వశూల ఇవి జనించియుండు పార్శ్వమునందు కక్షప్రదేశము, స్తనము వీనిమధ్యమునందలి సిరను వేధించవలయు. సూత్రమునందుండు వామపార్శ్వమను శబ్ద ముభయపార్శ్వంబుల కుపలక్షణము. ఇచట నంతర్విద్రధి యనఁగా కఫజవిద్రధి యని తెలియనగు. ఈ విషయమున "యథోద్దిష్టాం సిరాం విధ్యేత్ కఫజే విద్రధౌ" అని గ్రంథాంతరమునఁ జెప్పఁబడి యున్నది.

బాహుశోషాదులయందు సిరావేధనక్రమము.

సూ. బాహుశోషాపబాహుకయోరప్యేకే వద న్త్యంసయోరన్తరే. 29

బాహుశోషము, అపబాహుకము అను రోగంబులయందు భుజశిరముల మధ్యప్రదేశమునందు సిరను వేధించవలయునని కొందఱాచార్యులు వచించెదరు. వాతము వలన మాత్రము జనించిన బాహుశోషాపబాహుకములందు సిరావేధఁ జేయంజనదని మఱికొందఱి మతము. అయినను కేవలవాతజనితములైన బాహుశోషాపబాహుకము

లందు స్నేహస్వేదాద్యుపచారపూర్వకమైన సిరావేధ నిషేధింపఁబడియుండినను వానియం దుష్టామ్లలవణాదిపదార్థసేవనచేఁ బిత్తము ప్రకోపించి వాతసంబంధమగు తీవ్రమైన యుపద్రవములు గలిగియుండునపుడు వానిని శమింపఁజేయుటకు మాత్రమే సిరావేధఁ జేయందగునని కొందఱు వచించెదరు.

## తృతీయకజ్వరాదులయందు సిరావేధనక్రమము.

సూ. త్రికసన్ధిమధ్యగతాం తృతీయకే. అధస్స్కన్ధసన్ధిగతామన్యతర పార్శ్వసంస్థితాం చతుర్థకే. 30

తృతీయక జ్వరమునందు త్రికసంధి (ముడ్డిపూస) మధ్యప్రదేశమునందలి సిరను వేధించవలయు. చాతుర్థిక జ్వరమునందు భుజశిరముల కధోభాగమున నుభయపార్శ్వములయందుండు సిరలలో నేదైన నొకదానిని వేధించవలయు.

## అపస్మారమునందు సిరావేధనక్రమము.

సూ. హనుసన్ధిమధ్యగతామపస్మారే. 31

అపస్మారరోగమునందు హనుసంధి మధ్యమునందుండు సిరను వేధించవలయు.

సూ. శఙ్ఖకేశాన్తసన్ధిగతామురోపాఙ్గలలాటేషు చోన్మాదే అపస్మారే చ.

ఉన్మాదము, అపస్మారము అను సిరోగములయందు ఱొమ్ము, అపాంగములు లలాటము వీనియందలి సిరను, కణతలు, కేశాంతములు వీని సంధులయందలి సిరను వేధించవలయు.

## జిహ్వారోగములందు సిరావేధనక్రమము.

సూ. జిహ్వారోగేష్వధోజిహ్వాయాం దన్తవ్యాధిషు చ. 33

జిహ్వారోగమునందు, క్రిమిదంతాది దంతరోగమునందును నాలుకకు క్రింది భాగము నందుండు సిరను వేధించవలయు.

## తాలురోగమునందు సిరావేధనక్రమము.

సూ. తాలుని తాలవ్యేషు. 34

తాలురోగములందు నోటిలోపలి దౌడమధ్యమునందుండు సిరను వేధించవలయు.

## కర్ణశూలాదులయందు సిరావేధనక్రమము.

సూ. కర్ణయోరుపరి సమన్తాత్కర్ణశూలే తద్రోగేషు చ. 35

కర్ణశూలయందును, కర్ణసంబంధమగు నితరరోగములందును కర్ణములకు పైన నలుప్రక్కల వ్యాపించియుండు సిరను వేధించవలయు.

## నాసారోగములందు సిరావేధనక్రమము.

సూ. గన్ధాగ్రహణే నాసారోగేషు చ నాసాగ్రే. 36

గంధమును తెలియకుండునట్లు చేయు నాసారోగమునందును, ఇతరములైన నాసారోగములయందును, నాసాగ్రము నందుండు సిరను వేధించవలయును.

### తిమిరాదులయందు సిరావేధనక్రమము.

సూ. తిమిరాక్షిపాకప్రభృతిష్వామయేషూపనాసికే లలాట్యామపాఙ్గ్యాం వైతా ఏవ శిరోరోగాధిమన్థప్రభృతిషు రోగేష్వితి. ౬౭

తిమిరము, అక్షిపాకము మొదలైన నేత్రరోగము లందును శిరోరోగము, అధిమంథము మొదలగు రోగములందును, నాసిక సమీపమునందలి సిరనుగాని, లలాటస్థలమునందలి సిరనుగాని, అపాంగస్థలమునందలి సిరనుగాని వేధించవలయును.

### సిరావేధదోషవిభాగము.

సూ. అతఊర్ధ్వం దుష్టవ్యధన మనువ్యాఖ్యాస్యామః. తత్ర దుర్విద్ధా ఽతివిద్ధా కుఞ్చితా పిచ్చితా కుట్టితా ఽప్రస్రుతా ఽత్యుదీర్ణాఽన్తేఽభిహతా పరిశుష్కా కూణితా వేపితాఽనుత్థితవిద్ధా శస్త్రహతా తిర్యగ్విద్ధా అపవిద్ధా అవ్యధ్యా విద్రుతా ధేనుకా పునః పునర్విద్ధా మాంససిరాస్నాయ్వస్థిమర్మసు చేతి వింశతిర్దుష్టవ్యధాః. ౬౮

ఇక దుష్టములగు సిరావేధనల వివరించెదము. దుర్విద్ధము, అతివిద్ధము, కుఞ్చితము, పిచ్చితము, కుట్టితము, అప్రస్రుతము, అత్యుదీర్ణము, అంతేభిహతము, పరిశుష్కము, కూణితము, వేపితము, అనుత్థితవిద్ధము, అశస్త్రహతము, తిర్యగ్విద్ధము, అపవిద్ధము, అవ్యధ్యము, విద్రుతము, ధేనుకము, పునఃపునర్విద్ధము, మాంససిరాస్నాయ్వస్థిసంధిమర్మవిద్ధము అను నీ యిరువదియు సిరలయందు దుష్టవ్యధ లని తెలియవలయును.

### సిరావేధదోషస్వరూపము.

సూ. తత్ర యా సూక్ష్మశస్త్రవిద్ధా న వ్యక్తమసృక్స్రవతి రుజాశోఫవతీ చ సా దుర్విద్ధా. ప్రమాణాతిరిక్తవిద్ధాయామన్తఃప్రవిశతి శోణితం శోణితాతిప్రవృత్తిర్వా సాఽతివిద్ధా. కుఞ్చితాయామప్యేవమ్. కుణ్ఠశస్త్రప్రమథితాపృథులీభావమాపన్నా పిచ్చితా. అనాసాదితా పునః పునరన్తయోశ్చ బహుశశ్శస్త్రాభిహతా కుట్టితా. శీతభయమూర్ఛాభిరప్రవృత్తశోణితా అప్రస్రుతా. తీక్ష్ణమహాముఖశస్త్రవిద్ధా అత్యుదీర్ణా. అల్పరక్తస్రావిణ్యన్తే విద్ధా అన్తేఽభిహతా. క్షీణశోణితస్యానిలపూర్ణా పరిశుష్కా. చతుర్భాగావసాదితా కిఞ్చిత్ప్రవృత్తశోణితా కూణితా. దుఃస్థానబన్ధనా

ద్వేపమానాయాశ్శోణితసమ్మోహో భవతి సా వేపితా. అను
త్థితవిద్ధాయామప్యేవమ్. ఛిన్నాతిప్రవృత్తశోణితా క్రియాసఙ్గకరీ
శస్త్రహతా. తిర్యక్ప్రణిహితశస్త్రా కిఞ్చిచ్ఛేషా తిర్యగ్విద్ధా. బహుశః
క్షతా హీనశస్త్రప్రణిధానేనాపవిద్ధా. అశస్త్రకృత్యా అవ్యధ్యా.
అనవస్థితవిద్ధా విద్రుతా. ప్రదేశస్య బహుశోఽవఘట్టనాదారోహ
వ్యథా ముహుర్ముహుశ్శోణితస్రావా ధేనుకా. సూక్ష్మశస్త్రవ్యధనా
ద్బహుశో విచ్ఛిన్నా పునః పునర్విద్ధా. మాంసశిరాస్నాయ్వస్థిసన్ధి
మర్మసు విద్ధా వాయుజాం శోషం వైకల్యం మరణం వాపాదయతి. ఇతి

సూక్ష్మశస్త్రముచే వేధింపఁబడుటవలన బాగుగరక్తము స్రవింపక పోట్లు, వాపు ఇవిగలిగి యుండినసిరను దుర్విద్ధయనియు, ప్రమాణాతిరిక్తముగ వేధింపఁబడుటవలన రక్తమును లోపలఁ బ్రవేశింపఁ జేయునట్టిగాని, అధికముగ వెడలింపఁజేయునట్టిగాని సిరను అతివిద్ధయనియు, ఈయతివిద్ధతుల్యలక్షణములు గలది కుంచితయనియు, పదును లేని శస్త్రముచే వేధింపఁబడుటవలన నుబ్బియుండు సిర పిచ్చితయనియు, వేధ్యమగు సిర కనుపించక పోవుటచేఁ బలుమారు అంతములయందు శస్త్రముచే వేధింపఁబడిన సిర కుట్టితయనియు, వేధించునపుడు శీతబాధ, భయము, మూర్ఛ అనువానిచే బాగుగ రక్తము స్రవింపకుండునట్టి సిర అప్రస్రుతయనియు, తీక్ష్ణమైన మహాముఖశస్త్రముచే వేధింపఁబడినసిర అత్యుదీర్ణయనియు, వేధించునపు డల్పముగ రక్తమును స్రవింపఁజేయు నట్టిసిర అంతేభిహతయనియు, రక్తము క్షయించి వాతపూరితముగ నుండుసిర పరిశుష్కయనియు, నాలుగుస్థలములయందు వేధింపఁబడినను స్వల్పముగ రక్తమును స్రవింపఁజేయునట్టి సిర కూణితయనియు, దుష్టస్థానమునందు యంత్రశాటకము (పేలిక)చేఁ గట్టంబడుటవలన కంపయుక్తమై రక్తమును స్రవింపకుండునట్టి సిర వేపిత యనియు, యంత్రశాటకముచే యథావిధిగఁ గట్టంబడనందున బాగుగ నుత్థితముగాక మాటిమాటికి రక్తమును నిరోధించునట్టి సిర అనుత్థితవిద్ధయనియు, శస్త్రమువలన భిన్నంబై మిక్కుటముగ రక్తమును స్రవింపఁజేయుచు బంధనమును జేసినను రక్తము నిలువక శోణితవర్ణనీయాధ్యాయమునఁ జెప్పఁబడిన శిరోభితాపాదులఁ గలిగించునట్టి సిర శస్త్రహతయనియు, అడ్డముగ శస్త్రమును బ్రయోగించుటవలన బాగుగవేధింపఁ బడక నొకింత వేధింపఁబడియుండునట్టి సిర తిర్యగ్విద్ధయనియు, పలుమారు శస్త్రమును ప్రయోగించియు బాగుగ వేధింపఁబడనిసిర అపవిద్ధయనియు, స్థలాంతరమున వేధింపఁ బడిన సిర అవ్యధ్యయనియు, వ్యవస్థలేక బహుస్థలములయందు వేధింపఁబడినసిర విద్రుత యనియు, శస్త్రముచే నధికముగ వేధింపఁబడుటవలనఁ గలిగిన గాయము మానక పలు

మను రక్తమును స్రవించునట్టి సిర ధేనుకయనియు, సూక్ష్మములైన శస్త్రములచే వేధింపఁబడియు రక్తము స్రవింపనందున మరల వేధించుటచే ననేకస్థలములయందు చిత్రములతోఁ గూడియుండు సిర పునఃపునర్విద్ధయనియు, మాంస సిరా స్నాయ్వస్థి సంధిమర్మలయందు వేధింపఁబడుటవలన నొప్పులు, శోష, అంగవైకల్యము, లేక మరణము వీనిని గలుగఁజేయు సిర మర్మవిద్ధయనియు తెలియవలయు.

భవన్తి చాత్ర.—

శ్లో. సిరాసు శిక్షితో నాస్తి చలా హ్యేతాస్స్వభావతః,
మత్స్యవత్పరివర్తన్తే తస్మాద్యత్నేన తాడయేత్. 40

సిరలు చంచలస్వభావము గలవియగుటంజేసి మత్స్యములవలె నెగురుచుండును. అట్టిసిరలను వేధించుటయందు నేర్పు గలిగియుండుట దుర్లభము. కావున, వైద్యుఁడు మిగుల జాగరూకుఁడై సిరల వేధించవలయును.

శ్లో. అజానతా గృహీతే తు శస్త్రే కాయనిపాతితే,
భవన్తి వ్యాపదశ్చైతా బహవశ్చాప్యుపద్రవాః. 41

వైద్యుఁడు సిరావిషయకజ్ఞానములేక శస్త్రముచే సిరల వేధించినయెడల ననేకోపద్రవములును, వ్యాపదలును గలుగును.

శ్లో. స్నేహాదిభిః క్రియాయోగైర్న తథా లేపనైరపి,
యాన్త్యాశు వ్యాధయశ్శాన్తిం యథా సమ్యక్సిరావ్యధాత్. 42

శాస్త్రోక్తముగఁ జేయంబడిన సిరావేధనవలన రోగములు కడుశీఘ్రముగ శాంతి నొందునటుల, స్నేహస్వేదాదిక్రియలచేతను, లేపనాదులచేతనుగూడ కడుశీఘ్రముగ శాంతిఁ జెందకుండును.

శ్లో. సిరావ్యధశ్చికిత్సార్ధం శల్యతన్త్రే ప్రకీర్తితః,
యథా ప్రణిహితస్సమ్యగ్వస్తిః కాయచికిత్సితే. 43

కాయచికిత్సయందు వస్తికర్మ ప్రధానముగ నుండునటులనే శల్యతంత్రమునందు సిరావ్యధ అర్ధాంగముగ నున్నదని చెప్పఁబడియున్నది.

### సిరావేధనాద్యనంతరవర్జనీయధర్మములు.

సూ. తత్ర స్నిగ్ధస్విన్నవాన్తవిరిక్తాస్థాపితానువాసితసిరా విద్ధైః పరిహర్తవ్యాని క్రోధాయాసమైథునదివాస్వప్నవాగ్వ్యాయామయానోత్థానాసనచఙ్క్రమణ శీతవాతాతపవిరుద్ధాసాత్మ్యాజీర్ణాన్యాబల

లాభాన్మాసమేకే మన్యన్తే. ఏతేషాం విస్తరముపరిష్టాద్వక్ష్యామః. 44

స్నేహము (తైలాదికము), స్వేదము, వమనము, విరేచనము, నిరూహవస్తి (కషాయాదులచేఁ జేయునది,) అనువాసనవస్తి (స్నేహాదులచేఁ జేయునది), సిరావేధ ఇవి చేయించుకొనినవారలు, క్రోధము, ఆయాసము, మైథునము, పగటినిద్ర, పెద్దగ మాటలాడుట, లేక పఠనము, అశ్వాదులపై నెక్కి సంచరించుట, చాలకాలము నిలుచుండుట, ఎక్కువకాలము కూర్చుండుట, దుముకుట, శీతము, వాతము, ఎండ, విరుద్ధము, అసాత్మ్యము, అజీర్ణమునగుయన్నము, అనువానిని మరల బలముగలుగువఱకు వర్జించవలయును. పైఁ జెప్పినవానిని యొకమాసమువఱకు వర్జించవలయునని కొందఱాచార్యులు వచించెదరు. ఈవిషయమున విశేషముగ నుత్తరతంత్రమున వివరించెదము.

## దుష్టరక్తమోక్షణక్రమము.

శ్లో. సిరావిషాణతుమ్బైస్తు జలౌకాభిః పదై స్తథా,
అవగాఢం యథాపూర్వం నిర్హరేద్దుష్టశోణితమ్.
అవగాఢే జలౌకాస్స్యాత్ప్రచ్ఛానం పిణ్డితే హితమ్,
సిరాఙ్గవ్యాపకే రక్తే శృఙ్గాలాబూత్వచి స్థితే. 45

ఇతి శ్రీ సుశ్రుతాచార్యవిరచితే ఆయుర్వేదశాస్త్రే సుశ్రుతే
తృతీయే శారీరస్థానే అష్టమోఽధ్యాయః.

శరీరమునందుండు దుష్టశోణిత మత్యవగాఢతమముగ నుండినయెడ సిరావేధనముచేతను, గాఢతమముగ నుండినయెడ శృంగములచేతను, గాఢతరముగనుండినచో సొరకాయబుఱ్ఱలచేతను, గాఢముగనుండిన జలగలచేతను, అనవగాఢము (చర్మగతము)గ నుండిన శలాకుచేతను రక్తమును స్రవింపఁజేయవలయు. మఱియు, పక్షాంతరమునందు దుష్టరక్తము లోతు (అవగాఢము)గ నుండినయెడల జలగలవలనను, గడ్డకట్టియుండిన యెడల శలాకచేతను, సర్వశరీరమునందు వ్యాపించియుండినయెడల సిరావేధనమువలనను, చర్మము నాశ్రయించియుండినయెడల శృంగములు, సొరకాయబుఱ్ఱలు అనువానిచేతను, స్రవింపఁజేయవలయు నని చెప్పఁబడియున్నది. ఈయర్థమునే విస్పష్టముగ వాగ్భటాచార్యుఁ డిట్లు నుడివెను.—'ప్రచ్ఛానం పిండితే వా స్యాదవగాఢే జలౌకసః, త్వక్స్థేఽలాబుఘటీ శృంగం శిరైవ వ్యాపకేఽసృజి' అనియున్నందునఁ బక్షాంతరము కూడ శ్రేష్ఠంబని తెలియవలయు.

# నవమాధ్యాయము.

సూ. అథాతో ధమనీవ్యాకరణం శారీరం వ్యాఖ్యాస్యామః. 1

ఇఁకను ధమనీవర్ణనంబను నీయధ్యాయమును వివరించెదము.

సూ. చతుర్వింశతిర్ధమన్యో నాభిప్రభవా అభిహితాః. తత్ర కేచి ద్బాహుస్సిరాధమనీస్రోతసామవిభాగ, స్సిరావికారా ఏవ ధమన్య స్స్రోతాంసి చేతి. తత్తు న సమ్యక్. అన్యా ఏవ హి ధమన్య స్స్రోతాంసి చ సిరాభ్యః. కస్మాత్ ? వ్యఞ్జనాన్యత్వాన్మూలసన్నియ మాత్కర్మవైశేష్యాదాగమాచ్చ. కేవలం తు పరస్పరసన్నికర్షాత్స దృశాగమకర్మత్వాత్సౌక్ష్మ్యాచ్చ విభక్తకర్మణామప్యవిభాగ ఇవ కర్మసు భవతి. 2

ధమనీనిరూపణము.

నాభివలనజనించిన 24 ధమనులు శోణితవర్ణనీయాధ్యాయమునఁ జెప్పఁబడి యున్నవి. కొందఱు, సిరా, ధమనీ, స్రోతస్సులకు భేదములేదనియు, సిరావికారములే ధమనీస్రోతస్సులనియుఁ జెప్పిరి. కాని, అయ్యవి సయుక్తికము గాదు. ఏలయన:— సిరలు నలుపు, యెఱుపు, తెలుపు మొదలగువర్ణములుగలవిగను, ధమనులువహించునట్టి ధాతువర్ణముతో తుల్యమైనవర్ణముగలవిగను, స్రోతస్సులు "స్వధాతుసమవర్ణాని వృత్త స్థూలాన్యణూనిచ, స్రోతాంసి దీర్ఘాణ్యాకృత్యా" అనువచనప్రకారము వహించునట్టి ధాతువర్ణ తుల్యవర్ణములుగలవియై గుండ్రముగ, లావుగ, సన్నముగ, పొడవుగ నుండుటంజేసి సిరాధమనీస్రోతస్సులలక్షణములు పరస్పరము భేదించుటవలనను, 'తాసాంమూల సిరాశ్చతుశ్చత్వారింశత్ చతుర్వింశతి ర్ధమన్యః స్రోతసాం పున ర్ద్వావింశతిః' అను సూత్రమువలన మూలభూతసిరలు 44, ధమనులు 24, స్రోత స్సులు 22 అని ప్రత్యేక ప్రత్యేకముగ విభాగముఁ జేసియుండుటచేతను, సిర లతి ఘాతాదికర్మవిశేషమును, ధమనులు శబ్దాదివహనకర్మవిశేషమును, స్రోతస్సులు ప్రాణాన్నరసరక్తమాంసమేదోవహనరూపకర్మవిశేషమును గలవియగుటంజేసి సిరా ధమనీస్రోతస్సులు పరస్పరము కర్మభేదము గలవియగుటవలనను, 'సిరాధమన్యో స్రోతాంసి' సిరలు, ధమనులు, స్రోతస్సులని ప్రత్యేకముగ విభాగముఁజేసి యుండుటవలనను, 'సిరాస్నాయుధమనీక్షపరిహరన్' అని గ్రంథాంతరమునందును సిరలకంటె ధమనీస్రోతస్సులు ప్రత్యేకముగఁ జెప్పియుండుటవలనను, సిరల కంటె ధమనీస్రోతస్సులు భిన్నంబులుగానున్నవి. మఱియు సిరలు, ధమనులు, స్రోతస్సులు నియ్యవి పరస్పర మతిసమీపముగనుండుటవలనను ప్రాణుల శరీర

మునందలి ఆకాశసంబంధమైన యవకాశములే సిరాస్రోతోధమనులుగఁ బరిణమిల్లినను నాగమప్రమాణమును, రసాదివహనకర్మమును సమానములుగ నుండుటవలనను, అతి సూక్ష్మములుగ నుండుటవలనను, తమతమకర్మలయందు నిజముగ విభక్తములైయుండినను నానావిధములైన పదార్థములు భిన్నంబులైనను పాకవిశేషమువలన నవిభక్తముగ గనుపించునటులనే కర్మయందవి విభక్తములవలెనే గనుపడుచుండును. కావున పైఁజెప్పిన మతము యుక్తియుక్తము గాదు.

## ఊర్ధ్వాధస్తిర్యగ్గతధమనీసంఖ్య.

సూ. తాసాం తు నాభిప్రభవానాం ధమనీనామూర్ధ్వగా దశ దశ చాధోగామిన్యశ్చతస్రస్తిర్యగ్గాః. 3

నాభినుండి జనించిన 24 ధమనులలో 10 ధమనులు ఊర్ధ్వభాగమునను, 10 ధమనులు అధోభాగమునను, 4 ధమనులు అడ్డముగను వ్యాపించి యుండును.

## ఊర్ధ్వగతధమనీవిభాగక్రియావివరణము.

సూ. ఊర్ధ్వగాశ్శబ్దస్పర్శరూపరసగన్ధప్రశ్వాసోచ్ఛ్వాసజృమ్భితక్షుద్ధసితకథితరుదితాదీన్విశేషానభివహన్త్యశ్శరీరం ధారయన్తి. తాస్తు హృదయమభిప్రపన్నాస్త్రిధా జాయన్తే—తాస్త్రింశత్. తాసాం తు వాతపిత్తకఫశోణితరసాన్ద్వే ద్వే వహతః—తా దశ. శబ్దరూపరసగన్ధానష్టాభిర్గృహ్ణీతే, ద్వాభ్యాం భాషతే, ద్వాభ్యాం ఘోషం కరోతి, ద్వాభ్యాం స్వపితి, ద్వాభ్యాం ప్రతిబుధ్యతే. ద్వే చాశ్రువాహిన్యౌ. ద్వే స్తన్యం స్త్రియా వహతస్స్తనసంశ్రితే. తే ఏవ శుక్రం నరస్య స్తనాభ్యామభివహతః. తాస్త్వేతాస్త్రింశత్సవిభాగా వ్యాఖ్యాతాః. ఏతాభిరూర్ధ్వం నాభేరుదరపార్శ్వపృష్ఠోరస్స్కన్ధగ్రీవాబాహవో ధార్యన్తే యాప్యన్తే చ. 4

ఊర్ధ్వభాగమున వ్యాపించియుండుధమనులు శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, నిశ్వాసము, ఉచ్ఛ్వాసము, ఆవలింత, తుమ్ము, నవ్వు, భాషణము, రోదనము, మొదలగు క్రియావిశేషముల వహించుచు, శరీరధారణము సేయుచుండును. మఱియు, నూర్ధ్వభాగమున వ్యాపించియుండు 10, ధమనులు నాభినుండి వెడలి హృదయమును జెంది మూఁడువిధంబులుగనై 30 గ నగుచున్నవి. వానిలో రెండు వాతమును, రెండు పిత్తమును, రెండు కఫమును, రెండు రక్తమును, రెండు అన్నాదిరసమును వీక్షించుచుండును. ఇటుల వాతాదుల వహించుధమనులు 10. రెండు శబ్దమును, రెండు రూపమును, రెండు రసమును, రెండు గంధమును వహించుచుండును. ఇటు లాత్మగతశబ్దాదికముల

వహించుధమనులు 8. మఱియు రెండుధమనులు భాషణమును, రెండుధమనులు ఘోషమును, రెండుధమనులు నిద్రను, రెండుధమనులు జాగరణమును, రెండుధమనులు నేత్రాశ్రువులను, రెండుధమనులు స్త్రీల స్తనముల నాశ్రయించి స్తన్యవృద్ధిని, ఈరెండుధమనులే పురుషుల స్తనముల నాశ్రయించి రేతోవృద్ధిని గలుగఁ జేయుచుండును. ఈప్రకార మూర్ధ్వభాగమున వ్యాపించియుండు 30, ధమనులను నాభికి పైభాగమునందలి ఉదరము, ప్రక్కలు, వీఁపు, ఱొమ్ము, భుజములు, మెడ, హస్తములు అనువానిని ధరించుచు వాని వాని క్రియల బాగుగ నెఱవేర్చుచుండును.

భవతి చాత్ర.—

శ్లో. ఊర్ధ్వం గతాస్తు కుర్వన్తి కర్మాణ్యేతాని సర్వశః,
అధోగమాస్తు వక్ష్యామి కర్మ తాసాం యథాయథమ్. 5

నాభికి పైభాగమున వ్యాపించియుండు 10 ధమనులు పైఁజెప్పిన ప్రకారము శబ్దాదివహనరూప సర్వకర్మలఁ గ్రమముగఁ జేయుచుండును. అధోగతధమనుల స్వరూపము, విభాగము, కర్మము వీనినిఁ గ్రమముగ వివరించెదము.

## అధోగతధమనీవిభాగకర్మవివరణము.

సూ. అధోగమాస్తు వాతమూత్రపురీషశుక్రార్తవాదీన్యధో వహన్తి. తాస్తు పిత్తాశయమభిప్రపన్నాస్తత్రస్థమేవాన్నపానరసం విపక్వమౌష్ణ్యాద్వివేచయన్త్యోఽభివహన్త్యశ్శరీరం తర్పయన్తి, అర్పయన్తి చోర్ధ్వగతానాం, తిర్యగ్గతానాం రసస్థానం చాభిపూరయన్తి, మూత్రపురీషస్వేదాంశ్చ విరేచయన్త్యామపక్వాశయాన్తరే చ త్రిధా జాయన్తే—తాస్త్రింశత్. తాసాం తు వాతపిత్తకఫశోణితరసాన్ద్వే ద్వే వహన్తస్తా దశ, ద్వే అన్నవాహిన్యావన్త్రాశ్రితే, తోయవహే ద్వే, మూత్రవస్తిమభిప్రపన్నే మూత్రవహే ద్వే, శుక్రవహే ద్వే శుక్రప్రాదుర్భావాయ, ద్వే విసర్గాయ, తేఏవ రక్తమభివహతో నారీణామార్తవసంజ్ఞమ్. ద్వే వర్చోనిరసన్యౌ స్థూలాన్త్రప్రతిబద్ధే, అష్టావన్యాస్తిర్యగ్గాణాం ధమనీనాం స్వేదమర్పయన్తి తాస్త్వేతాస్త్రింశత్సవిభాగా వ్యాఖ్యాతాః. ఏతాభిరధో నాభేః పక్వాశయకటీమూత్రపురీషగుద వస్తి మేఢ్రసక్థీనిధార్యన్తే యాప్యన్తే చ. 6

అధోభాగమున వ్యాపించియుండుధమనులు వాతము, మూత్రము, పురీషము, శుక్రము, ఆర్తవము మొదలగువాని నధోభాగమున వహించుచుండును. అవి పిత్తాశ

యమును జెంది యందలి జాఠరాగ్నియొక్క వేడిమివలన పరిపక్వమైన యన్నపానరస మును విభజించి ఆయాస్థలములకుఁ దగినటుల నన్నరసమును దీసికొనిపోయి యూర్ధ్వ ముగ, నడ్డముగ వ్యాపించియుండు ధమనులరసస్థానమును అన్నాదిరసముచే పూరింపఁ జేసి సర్వశరీరమును బోషించుచుండును. అనఁగా:—అధోగతధమనులు ఆమాశయపక్వా శయస్థానములందుండు అన్నరసముచుట్టు వ్యాపించి రసస్థానమును బూరణము సేయు చుండునని భావము. అటులనే, ఊర్ధ్వభాగమున వ్యాపించియుండుధమనులుకూడ పూర ణము చేసిన స్థానమునందలి యన్నరసమును నాభికి పైభాగమునందుండు ప్రదేశములకుఁ దీసికొనిపోయి సర్వశరీరమును బోషించుచుండును. కావున, నధోగతధమనులే సర్వశరీ రపోషణమున కాధారం బనుఫలితార్థ మేర్పడుచున్నయది. మఱియు నధోగతధమనులు మూత్ర, పురీష, స్వేదముల వెవ్వేఱుగ విభజనఁజేసి యామపక్వాశయమధ్యమునందు మూఁడువిధములుగనై 30 ధమనులుగఁ బరిణమిల్లును. ఈ 30 ధమనులలో రెండు వాత మును, రెండు పిత్తమును, రెండు శ్లేష్మమును, రెండురక్తమును, రెండు రసమును వహించు చుండును. ఇటుల వాతాదుల వహించు ధమనులు 10. అన్నమును వహించునవి 2. అంత్రము (ప్రేగుల) నాశ్రయించి యుదకమును వహించునవి 2. మూత్రవస్తినాశ్ర యించి మూత్రమును వహించునవి 2. శుక్రమును వహించునవి 2. శుక్రోత్పత్తికి కారణములగునవి 2. శుక్రమును విసర్జింపఁజేయునవి 2. పూర్వోక్తశుక్రప్రాదుర్భావ విసర్గ కారణములగు 2. ధమనులే స్త్రీలయార్తవరక్తవహనవిసర్జనముఁల జేయించుచుండును. స్థూలాంత్రములచేఁ గట్టఁబడి మలవిసర్జనముఁజేయించునవి 2. తక్కిన 8 ధమనులు తిర్య గ్గతధమనుల ముఖమును జెంది స్వేదమును బయలువెడలింపఁ జేయును. ఈ 30 ధమ నులును నాభి కధోభాగమునందలి పక్వాశయము, కటి ప్రదేశము, మూత్రము, పురీ షము, గుదము, వస్తి, మేఢ్రము, తొడలు వీనిని ధారణము సేయుచు వాతాదివహన క్రియల నెఱవేర్చుచుండును. ఇటుల నధోగతములగు 30 ధమనులు విభాగపూర్వక ముగ వివరింపఁబడియె.

భవతి చాత్ర —

శ్లో. అధోగమాస్తు కుర్వన్తి కర్మాణ్యేతాని సర్వశః,
తిర్యగ్గాస్సమ్ప్రవక్ష్యామి కర్మ తాసాం యథాయథమ్. 7

నాభికధోభాగమున వ్యాపించియుండు పైఁ జెప్పిన 30 ధమనులు వాతమూత్ర వహనాదికర్మలఁ జేయుచుండును. అడ్డముగ వ్యాపించియుండు ధమనులయొక్క విభాగ కర్మవిశేషముల నిఁక వివరించెదము.

### తిర్యగ్గతధమనీవిభాగ కర్మవివరణము.

సూ. తిర్యగ్గతానాం తు చతసృణాం ధమనీనామేకైకా శతధా సహ

స్రధా చోత్తరోత్తరం విభజ్యన్తే, తాస్త్వసఙ్ఖ్యేయాః. తాభిరిదం శరీరం గవాక్షితం విబద్ధమాతతం చ. తాసాం ముఖాని రోమకూపప్రతిబద్ధాని; యైస్స్వేదమభివహన్తి రసం చాపి సన్తర్పయన్త్యన్తర్బహిశ్చ, తైరేవ చాభ్యఙ్గపరిషేకావగాహాలేపనవీర్యాణ్యన్తశ్శరీరమభిప్రతిపద్యన్తే త్వచి విపక్వాని, తైరేవ స్పర్శసుఖమసుఖం వా గృహ్ణాతి. తాస్త్వేతాశ్చతస్రో ధమన్యస్సర్వాఙ్గగతాస్సవిభాగా వ్యాఖ్యాతాః.

నాభినుండి యడ్డముగ వ్యాపించియుండు 4 ధమనులలో ప్రతిధమనియుఁ గ్రమక్రమముగ నూఱుగ, వేయిగనై యసంఖ్యేయములై సర్వశరీరమునందు వ్యాపించుటవలన శరీరమును గవాక్షాకారముగ బంధించియుండును. ఆధమనీముఖములు రోమకూపములయందుఁ గట్టఁబడి స్వేదమును వహించుటయేగాక సర్వశరీరబాహ్యాభ్యంతరములయందు త్వగాదిప్రాంతమునందును అన్నాదిరసమును వ్యాపింపఁజేసి చర్మమున పక్వమైన అభ్యంగపరిషేకావగాహనస్నానలేపనాదులసారాంశమును శరీరములోనఁ బ్రవేశింపఁజేసి స్పర్శసుఖదుఃఖములను గ్రహించుచుండును. (అనఁగా మనస్సంయుక్తమైన తిర్యగ్గతధమనీముఖమూలముగ చర్మమునందలి స్పర్శసుఖదుఃఖముల నాత్మ యనుభవించుచుండునని తాత్పర్యము.) ఇటుల సర్వాంగములయందు నడ్డముగ వ్యాపించియుండు 4 ధమనులు విభాగపూర్వకముగ వివరింపఁబడియె.

భవతశ్చాత్ర.—

శ్లో. యథా స్వభావతః ఖాని మృణాలేషు బిసేషు చ,
ధమనీం వా తథా ఖాని రసో యైరుపచీయతే. 9

తామరగడ్డలయందును, తామరతూండ్లయందును, స్వభావముగ ఛిద్రములు గలిగియుండునటులనే, ధమనులయందును స్వభావముగ ఛిద్రములు గలిగియుండును. వానిచేతనే అన్నాదిరసములు శరీరమునందు వ్యాపించును.

శ్లో. పఞ్చాభిభూతాస్త్వథ పఞ్చకృత్వః
పఞ్చేన్ద్రియం పఞ్చసు భావయన్తి,
పఞ్చేన్ద్రియం పఞ్చసు భావయిత్వా
పఞ్చత్వమాయాన్తి వినాశకాలే. 10

పృథివ్యాది పంచభూతములచే వ్యాప్తమైయుండుధమనులు కర్మపురుషునియొక్క త్వగాదిపంచేంద్రియముల నైదుగ విభజించి శబ్దాదిపంచవిషయములందుఁ బ్రవర్తింపఁజేయును. అనఁగా:—త్వగింద్రియముచే స్పర్శజ్ఞానమును చక్షురింద్రియముచే రూపజ్ఞానమును, రసనేంద్రియముచే రసజ్ఞానమును, ఘ్రాణేంద్రియముచే గంధజ్ఞానమును, శ్రోత్రేం

ద్రియముచే శబ్దజ్ఞానమును గలుగఁజేయునని భావము) "పంచాభిభూతా" అనుపద మునకు పంచశబ్దస్పర్శరూపరసగంధములచే వ్యాప్తంబులగు ధమనులని కొందఱు వ్యాఖ్యానముఁ జేయుచున్నారు. మఱియు, నాధమనులు నిర్యాణకాలమునందు శ్రోత్రాదీంద్రియముల నాకాశాదిపంచభూతస్థానములయందు వెవ్వేఱుగఁ జేర్చి యవియును లయమును జెందును.

సూ. అత ఊర్ధ్వం స్రోతసాం మూలవిద్ధలక్షణముపదేక్ష్యామః. 11

ధమనీనిరూపణానంతరము స్రోతస్సులయొక్క మూలవేధలక్షణముల వివరించెదము.

## స్రోతోమూలాదివివరణము.

సూ. తాని తు ప్రాణాన్నోదకరసరక్తమాంసమేదోమూత్రపురీష శుక్రార్తవవహాని, యేష్వధికారః, ఏకేషాం బహూని. 12

స్రోతస్సులు ప్రాణము, అన్నము, ఉదకము, రసము, రక్తము, మాంసము, మేదస్సు, మూత్రము, పురీషము, శుక్రము, ఆర్తవము అనువానిని వహించుచుండును. వీనియందె చికిత్సంజేయవలయు. పైఁజెప్పిన ప్రాణవహాదిస్రోతస్సులకంటె నధికములైనమజ్జాస్థిస్వేదోవహాదిస్రోతస్సులు గ్రంథాంతరములయందుఁ గనఁబడుచుండిన నయ్యవి సర్వశరీరమునందు వ్యాపించియుండుటవలనను, వానిమూలవేధలక్షణము సాధ్యాసాధ్యాదిజ్ఞానవిషయమునందనావశ్యకమగుటవలనను వానియొక్క మూలవేధలక్షణములు చెప్పంబడవయ్యె. నియతదేశమునందుండు ప్రాణవహాదిస్రోతస్సుల మూలవేధజ్ఞానము, సాధ్యాసాధ్యజ్ఞానవిషయమునం దావశ్యకమగుటవలన స్రోతస్సు లనేకములని కొందఱిమతము. అయినను, వానియందు చికిత్సాధికారము లేకుండుటంజేసి యవి యిచట నిరూపింపఁ బడవయ్యె.

## ప్రాణవహస్రోతోమూలాదివివరణము.

సూ. ఏతేషాం విశేషా బహవః తత్ర ప్రాణవహే ద్వే, తయోర్మూలం హృదయం రసవాహిన్యశ్చ ధమన్యః. తత్ర విద్ధస్య క్రోశనవినమనమోహనభ్రమణవేపనాని మరణం వా భవతి. 13

పైఁజెప్పబడిన ప్రాణవహాది 22 స్రోతస్సులయొక్క విశేషము ఇచ్చటఁ జెప్పంబడెను. పూర్వోక్తమగు 22 స్రోతస్సులలోఁ బ్రాణమును వహించునట్టి స్రోతస్సులు 2. వీనికి హృదయమునందు రసవాహినీధమనులును మూలాధారము. ఆమూలమునందు అభిఘాతము గలిగినయెడల ఆర్తస్వరయుక్తరోదనము, వక్రగతి, మోహము, భ్రమణము, కంపము మొదలైన యుపద్రవములుగాని, మరణముగాని కలుగును.

## అన్నవహస్రోతోమూలాదివివరణము.

సూ. అన్నవహే ద్వే తయోర్మూలమామాశయోఽన్నవాహిన్యశ్చ

ధమన్యః. తత్ర విద్ధస్యాధ్మానం శూలాన్నద్వేషౌ ఛర్దిః పిపాసాఽఽన్ధ్యం మరణం వా. 14

అన్నమును వహించునట్టి స్రోతస్సులు 2. వానికి ఆమాశయము, అన్నవాహినీ ధమనులు మూలము. వానియందభిఘాతము గలిగినయెడల కడుపుబ్బరము, శూల, అన్నద్వేషము, వాంతి, దప్పి, గ్రుడ్డితనము (లేక మరణము) గలుగును.

### ఉదకవహస్రోతోమూలాదివివరణము.

సూ. ఉదకవహే ద్వే, తయోర్మూలం తాలు క్లోమ చ. తత్ర విద్ధస్య పిపాసా శ్వాసావాస్యతా సద్యో మరణం చ. 15

ఉదకమును వహించునట్టి స్రోతస్సులు 2. వానికి దౌడలు, పిపాసాస్థానమైన క్లోమము మూలము. వానియం దభిఘాతము గలిగినయెడల దప్పి, తత్క్షణమే మరణము ఇవి గలుగును.

### రసవహస్రోతోమూలాదివివరణము.

సూ. రసవహే ద్వే, తయోర్మూలం హృదయం రసవాహిన్యశ్చ ధమన్యః. తత్ర విద్ధస్య శోషః ప్రాణవహావిద్ధవచ్చ మరణం తల్లిఙ్గాని చ. 16

రసమును వహించునట్టి స్రోతస్సులు 2. వానికి హృదయమును, వాహినీధమనులు మూలము. వానియం దభిఘాతము గలిగినయెడల శరీరమందు శోష, పైఁ జెప్పిన ప్రాణవహస్రోతస్సునందు వేధించుటవలనఁ గలుగు ఉపద్రవములు, మరణము ఇవి గలుగును.

### రక్తవహస్రోతోమూలాదివివరణము.

సూ. రక్తవహే ద్వే, తయోర్మూలం యకృత్ప్లీహానౌ రక్తవాహిన్యశ్చ ధమన్యః. తత్ర విద్ధస్య శ్యావాఙ్గతా జ్వరో దాహః పాణ్డుతా శోణితాతిగమనం రక్తనేత్రతా చేతి. 17

రక్తమును వహించునట్టి స్రోతస్సులు 2. వానికి యకృత్తు, ప్లీహము, రక్తవాహినీ ధమనులు మూలము. వానియం దభిఘాతము గలిగినయెడల శరీరమందు నలుపువర్ణము, జ్వరము, తాపము, పాండువర్ణము, ఊర్ధ్వాధోభాగములవలన మిక్కుటముగ రక్తస్రావము, నేత్రములయం దెఱుపువర్ణము ఇవి గలుగును.

### మాంసవహస్రోతోమూలాదివివరణము.

సూ. మాంసవహే ద్వే, తయోర్మూలం స్నాయుత్వచం రక్తవహాశ్చ ధమన్యః. తత్ర విద్ధస్య శ్వయథుర్మాంసశోషస్సిరాగ్రన్థయో మరణం వా. 18

మాంసమును వహించునట్టి స్రోతస్సులు రెండు. వానికి స్నాయువులు, చర్మము (లేక త్వగాశ్రితరసము), రక్తవాహినీధమనులు మూలము. వానియం దభిఘాతము గలిగినయెడల వాపు, మాంసమునందు శోష, సిరలయందు గ్రంథులు, (మరణము) ఇవి గలుగును.

## మేదోవహస్రోతోమూలాదివివరణము.

సూ. మేదోవహే ద్వే, తయోర్మూలం కటీవృక్కౌ చ. తత్ర విద్ధస్య స్వేదాగమనం స్నిగ్ధాఙ్గతా తాలుశోషస్థ్సూలశోఫతా పిపాసా చ.

మేదస్సును వహించునట్టి స్రోతస్సులు 2. వానికి కటిప్రదేశము, వృక్కలు మూలము. వానియం దభిఘాతము గలిగినయెడల మిక్కుటముగ చెమట, శరీరమందు స్నిగ్ధత్వము, తాలుశోషము, శరీరస్థౌల్యము, వాపు, దప్పి ఇవి గలుగును.

## మూత్రవహస్రోతోమూలాదివివరణము.

సూ. మూత్రవహే ద్వే, తయోర్మూలం వస్తిర్మేఢ్రం చ. తత్ర విద్ధస్యానద్ధవస్తితా మూత్రనిరోధస్తబ్ధమేఢ్రతా చ. 20

మూత్రమును వహించునట్టి స్రోతస్సులు 2. వీనికి వస్తి, మేఢ్రము మూలము. వీనియం దభిఘాతము గలిగినయెడల మూత్రాశయమునందు ఈడ్పు, మూత్రప్రతిబంధము, శిశ్నమునందు స్తబ్ధత్వము ఇవి గలుగును.

## పురీషవహస్రోతోమూలాదివివరణము.

సూ. పురీషవహే ద్వే, తయోర్మూలం పక్వాశయో గుదం చ. తత్ర విద్ధస్యానాహో దుర్గన్ధతా గ్రథితాన్త్రతా చ. 21

పురీషమును వహించునట్టి స్రోతస్సులు 2. వీనికి పక్వాశయము, గుదము మూలము. వీనియం దభిఘాతము గలిగినయెడల ఆనాహమను వాతరోగము, దుర్గంధము, ప్రేగులయందు గ్రంథులు ఇవి గలుగును.

## శుక్రవహస్రోతోమూలాదివివరణము.

సూ. శుక్రవహే ద్వే, తయోర్మూలం స్తనౌ వృషణౌ చ. తత్ర విద్ధస్య క్లీబతా చిరాత్ప్రసేకో రక్తశుక్రతా చ. 22

శుక్రమును వహించునట్టి స్రోతస్సులు 2. వానికి స్తనములు,వృషణములు మూలము. వానియం దభిఘాతము గలిగినయెడల నపుంసకత్వము, దీర్ఘకాలమునకు శుక్రస్రావము, రక్తముతోఁగూడిన శుక్రము గలుగును.

## ఆర్తవవహస్రోతోమూలాదివివరణము.

సూ. ఆర్తవవహే ద్వే, తయోర్మూలం గర్భాశయ ఆర్తవవాహిన్య
శ్చ ధమన్యః. తత్ర విద్ధాయాం వన్ధ్యాత్వం మైథునాసహిష్ణుత్వ
మార్తవనాశశ్చ. 23

ఆర్తవమును వహించునట్టి స్రోతస్సులు 2. వానికి గర్భాశయము, ఆర్తవమును వహించు ధమనులు మూలము. వానియం దభిఘాతము గలిగినయెడల వంధ్యాత్వము (గొడ్డుతనము), మైథునమును సహింపకుండుట, ఆర్తవనాశము ఇవి గలుగును.

సూ. సేవనీచ్ఛేదాద్రుజాప్రాదుర్భావః. వస్తిగుదవిద్ధలక్షణం ప్రాగుక్త
మితి. 24

శుక్రవహస్రోతస్సుకు సమీపమున సేవని యను స్రోతస్సు ఉండును. దానియం దభిఘాతము గలిగినయెడల రోగము (నొప్పి) గలుగును. సేవనియొక్క లక్షణము అశ్మరీరోగచికిత్సయందు వస్తిప్రకరణమునఁ జెప్పంబడియున్నది. మఱియు, వస్తి, గుదము వీనియందు వేధించుటచేఁ గలుగు ఉపద్రవములు పూర్వమే చెప్పంబడియున్నవి.

## స్రోతోవేధనాసాధ్యత్వము.

సూ. స్రోతోవిద్ధం తు ప్రత్యాఖ్యాయోపచరేదుద్ధృతశల్యం తు క్షత
విధానేనోపచరేత్. 25

పైఁజెప్పిన స్రోతస్సులయం దభిఘాతము గలిగినయెడల చికిత్సించుట కసాధ్యము. కావున వానిని వర్జించవలయును. శల్యము తీయఁబడినవానికి క్షతవిధానప్రకారము చికిత్సఁ జేయవలయు.

## స్రోతస్స్వరూపము.

శ్లో. మూలాత్ఖాదన్తరం దేహే ప్రసృతం త్వభివాహి యత్,
స్రోతస్తదితి విజ్ఞేయం సిరాధమనివర్జితమ్. 26

ఇతి శ్రీ సుశ్రుతాచార్యవిరచితే ఆయుర్వేదశాస్త్రే సుశ్రుతే
తృతీయే శారీరస్థానే నవమోఽధ్యాయః.

హృదయ ఛిద్రమునుండి శరీరములోన వ్యాపించి రక్తాదుల వహించుచు ''స్వధాతుసమవర్ణాని వృత్తస్థూలాన్యణూనిచ, స్రోతాంసి దీర్ఘాణ్యాకృత్యా ప్రతానసదృశానిచ'' అను వచనప్రకారము తామువహించునట్టిధాతువర్ణముతోఁ దుల్యమైన వర్ణముగలవియై గుండ్రముగ, లావుగ, సన్నముగ, పొడవుగనుండినవై తామరతంతువులవలె సర్వశరీరమందు వ్యాపించి సిరాధమనులకంటె భిన్నముగ నుండునాడులే స్రోతస్సులని చెప్పంబడెను.

# దశమాధ్యాయము.

సూ. అథాతో గర్భిణీవ్యాకరణం శారీరం వ్యాఖ్యాస్యామః. 1

ఇఁక గర్భిణీవ్యాకరణమను (గర్భిణియొక్క ఆహారాచారాదులను దెలుపు) నీ యధ్యాయమును వివరించెదము.

## గర్భిణీసామాన్యనియమము.

సూ. గర్భిణీ ప్రథమదివసాత్ప్రభృతి నిత్యం ప్రహృష్టా శుచ్యలఙ్కృతా శుక్లవసనా శాన్తిమఙ్గళదేవతాబ్రాహ్మణగురుపరా చ భవేన్మలిన వికృతహీనగాత్రాణి న స్పృశేద్దుర్గన్ధదుర్దర్శనాని పరిహరే దుద్వేజ నీయాశ్చ కథాశ్శుష్కం పర్యుషితం కుథితం క్లిన్నం చాన్నం నోపభుఞ్జీత, బహిర్నిష్క్రమణం శూన్యాగారచైత్యశ్మశానవృక్షా శ్రయాన్క్రోధభయసఙ్కరాంశ్చ భావానుచ్చైర్భాష్యాదికం పరి హరేద్యాని చ గర్భం వ్యాపాదయన్తి, న చాభీక్ష్ణం తైలాభ్యఙ్గో త్సాదనాదీని నిషేవేత, న చాయాసయేచ్ఛరీరం, పూర్వోక్తాని చ పరిహరేత్. శయనాసనం మృద్వాస్తరణం నాత్యుచ్చమపాశ్రయో పేతమసంబాధం విదధ్యాత్. హృద్యం ద్రవం మధురప్రాయం స్నిగ్ధం దీపనీయసంస్కృతం చ భోజనం భోజయేత్సామాన్య మేతదాప్రసవాత్. 2

గర్భిణి గర్భమును ధరించిన దినము మొదలుకొని యెల్లపుడు సంతోషము, శుచి ఆభరణాద్యలంకారము, తెల్లని వస్త్రముల ధరించుట; శాంతికరమైనట్టియు, మంగళ కరములైనవియునగు కార్యములందు ఆసక్తియు, దేవతలు, బ్రాహ్మణులు, గురువులు వీరియందు భక్తియు, మలినులు, వికృతరూపులు, హీనులు (నీచులు) నగువారి శరీరమును స్పృశించకుండుట; దుర్గంధము, భయంకరపదార్థదర్శనము, వీనిని మానుట; చిత్తమును వ్యాకులము సేయుకథల వినకుండుట; ఎండినది, పర్యుషితము (చద్ది), కుథితము (పాసి నది), తడిసినదియునగు యన్నమును భుజింపకుండుట; బైటసంచారము, పాడుపడిన గృహము శ్రాద్ధాలయములు, శ్మశానము, పిశాచాదులు వసించువృక్షములు (శ్మశాన మందలి వృక్షములు), క్రోధము, భయము, వీనిని గలిగించుభావమును, పెద్దగ మాట లాడుట; వీనిని వర్జించుట, గర్భమునకు వ్యాపదను గలిగించుపనులు, ప్రత్యహము తైలా భ్యంగము, నలుగుపెట్టుకొనుట; శరీరమున కాయాసకరమైన పనులు, గర్భావక్రాంత్య

ధ్యాయమున నిషేధింపఁబడిన మైథునాయాసాదులు, వీని వర్జించుట; మొదలగునియమములను నాచరించవలయు. మఱియు గర్భిణికి మృదువైన మెత్తలు, బాలీసు మొదలగు ఆనుకొను దిండ్లు, విశాలముగనుండి మిక్కిలి పొడవులేకుండు శయనాసనములఁ గల్పించవలయు. ప్రియముగ, ద్రవముగ, మధురముగ, స్నిగ్ధముగ, అగ్నిదీప్తిని జేయుపదార్థములచే సంస్కృతములగు నన్నాదుల సేవింపఁజేయవలయు. ఈ చెప్పిన నియమముల ప్రసవపర్యంతము నాచరించుచుండవలయును.

### గర్భిణీప్రథమమాసాద్యాహారనియమము.

సూ. విశేషతస్తు గర్భిణీ ప్రథమద్వితీయతృతీయమాసేషు మధురశీతద్రవప్రాయమాహారముపసేవేత. విశేషతస్తు తృతీయే షష్టికౌదనం పయసా భోజయేచ్చతుర్థే దధ్నా, పఞ్చమే పయసా, షష్ఠే సర్పిషా, చేత్యేకే. చతుర్థే పయోనవనీతసంసృష్టమాహారయేజ్జాఙ్గలమాంససహితం హృద్యమన్నం భోజయేత్. పఞ్చమే క్షీరసర్పిస్సంసృష్టం, షష్ఠే శ్వదంష్ట్రాసిద్ధస్య సర్పిషో మాత్రాం పాయయేద్యవాగూం వా సప్తమే సర్పిః పృథక్పర్ణ్యాదిసిద్ధమేవమాప్యాయ్యతే గర్భః. అష్టమే బదరోదకేన బలాతిబలశతపుష్పపలలపయోదధిమస్తుతైలలవణమదనఫలమధుఘృతమిశ్రేణాస్థాపయేత్పురాణపురీషశుద్ధ్యర్థమనులోమనార్థం చ వాయోః. తతః పయోమధురకషాయసిద్ధేన తైలేనానువాసయేదనులోమే హి వాయౌ సుఖం ప్రసూయతే నిరుపద్రవా చ భవతి. అత ఊర్ధ్వం స్నిగ్ధాభిర్యవాగూభిర్జాఙ్గలరసైశ్చోపక్రమేదా ప్రసవకాలా దేవముపక్రాన్తా స్నిగ్ధా బలవతీ సుఖమనుపద్రవా ప్రసూయతే. 3

గర్భిణి ప్రథమ, ద్వితీయ, తృతీయ మాసములయందు మిక్కిలి మధురముగ, శీతముగ, ద్రవముగనుండు నాహారమును సేవించవలయు. మఱియు, అఱువది దినములకు ఫలించు వరిఅన్నమును విశేషముగ మూఁడవమాసమునందు పాలతోడను, నాలవమాసమందు పెరుగుతోడను, ఐదవమాసమునందు పాలతోడను, ఆఱవమాసమునందు నేయితోడను భుజించవలయునని కొందఱాచార్యులు వచించెదరు. నాలవమాసమందు పాలు, వెన్న వీనితో మిశ్రమమైనట్టియు, జాంగల (కవుఁజు)మాంసయుక్తమైనట్టియు, ప్రియమైనదియు నగు యన్నమును భుజించవలెను. ఐదవమాసమునందు పాలు, నెయ్యి వీనితోఁ గూడినయన్నమును భుజించవలెను. ఆఱవమాసమునందు పల్లేరుకషాయముతో సిద్ధము చేయఁబడిన ఘృతమును గాని, యవాగువును (గంజిని) గాని పానము చేయించ

వలెను. ఏడవమాసమునందు పృథక్పర్ణ్యాదుల (నేలగుమ్ముడు, ఆముదపువేరు, తేలుమణి చెట్టు, గలిజేరు, దేవదారు, ముద్గపర్ణి, మాషపర్ణి, దురదగొండి, పిల్లిపీచర, పెద్దగుమ్మడి, పాలతూర, జీవకము, ఋషభకము, ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్ద ములక, పల్లేరు, సుగంధిపాల, హంసపాది) ప్రేళ్లకషాయముతో సిద్ధముచేయఁబడిన ఘృతమును త్రాగించవలయు. ఈ యుపచారముచే గర్భము వృద్ధిఁజెందును. ఎనిమిదవ మాసమునందు గర్భిణికి ప్రాచీనమలశుద్ధికొఱకును, వాత మనులోమముగ సంచరించుట కును రేగుపండ్లకషాయమునందు పిన్నముత్తవపులగము, పెద్దముత్తవపులగము, పెద్ద సదాప,మాంసము, పాలు, పెరుఁగు, మీగడ, నూనె, సైంధవలవణము (ఉప్పు), మ్రంగ కాయలు, తేనె, నెయ్యి, వీనిని గలిపి నిరూహవస్తిఁ జేయవలయు. పిమ్మట, పాలు, మధురద్రవ్యములు, వీని కషాయముచే సిద్ధముచేసినతైలముచే ననువాసనవస్తిని జేయ వలయు. ఈ యుపచారమువలన వాతమునకు అనులోమగమనము గలిగి యుపద్రవ ములు లేక సుఖముగఁ బ్రసవించును. యెనిమిదవమాసము గడచిన పిదప స్నిగ్ధమైన యవాగు, జాంగలమాంసరసము వీనితో ప్రసవకాలమువఱకు నుపచరించినయెడ గర్భిణి స్నిగ్ధము, బలమును గలిగినదై యుపద్రవములు లేక సుఖముగ ప్రసవించును.

## నవమమాసగర్భిణీనియమము.

సూ. నవమే మాసి సూతికాగారమేనాం ప్రవేశయేత్ప్రశస్తతిథ్యాదౌ. తత్రారిష్టం బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాణాం శ్వేతరక్తపీతకృష్ణేషు భూమిప్రదేశేషు బిల్వన్యగ్రోధతిన్దుకభల్లాతకనిర్మితం సర్వాగారం యథాసఙ్ఖ్యం తన్మయపర్యఙ్కముపలిప్తభిత్తిం సువిభక్తపరిచ్ఛదం ప్రాగ్ద్వారం దక్షిణద్వారం వాఽష్టహస్తాయతం చతుర్హస్తవిస్తృతం రక్షామఙ్గళసమ్పన్నం విధేయమ్. 4

తొమ్మిదవమాసమందుఁ బ్రశస్తమైన తిథివారనక్షత్రములతోఁ గూడియుండు దినమున గర్భిణిని సూతికాగృహమునందుఁ బ్రవేశింపఁ జేయవలయు. నాసూతికా గృహము బ్రాహ్మణులకైనయెడలఁ దెలుపు వర్ణము గల ప్రదేశమునందు మారేడు మ్రానులచేతను, క్షత్రియులకైనయెడల నెఱుపు వర్ణముగల ప్రదేశమునందు మఱ్ఱి మ్రానులచేతను, వైశ్యులకైనయెడల పసుపువర్ణముగల ప్రదేశమునందు నల్ల తుమికి మ్రానులచేతను, శూద్రులకైనయెడల నలుపువర్ణముగల ప్రదేశమునందు నల్లజీడి మ్రానులచేతను నిర్మింపఁబడి, వర్ణోచితముగ బిల్వాదికృతమంచములతోఁ గూడి పూయఁ బడిన గోడలుగలిగి, పరజాలు మొదలగు సామగ్రులతోఁ గూడి, ప్రత్యేకప్రదేశములు గలిగి, తూర్పునగాని, దక్షిణమునగాని ద్వారముగలిగి, యెనిమిదిమూరల పొడవు,

ఫాలఁగుమూరల వెడల్పుగలిగి, తెల్లఆవాలు మొదలగునవి మంత్రోపమంత్రితోదక కుంభములు, మంగళకరతోరణాదులు ఇవి గలిగినదిగ నుండవలయు.

### ఆసన్నప్రసవాలక్షణము.

శ్లో. జాతే హి శిథిలే కుక్షౌ ముక్తే హృదయబన్ధనే,
 సశూలే జఘనే నారీ జ్ఞేయా సా తు ప్రజాయినీ.

సూ తత్రోపస్థితప్రసవాయాః కటీపృష్ఠం ప్రతి సమన్తాద్వేదనా భవత్యభీక్ష్ణం పురీషప్రవృత్తిర్మూత్రం ప్రసిచ్యతే యోనిముఖా చ్ఛ్లేష్మా చ. 5

కుక్షిప్రదేశము జారి హృదయబంధము (యోనిముఖబంధము) వీడి జఘనము నందు (పిఱుఁదులముందు ప్రక్కలయందు) శూలగలిగినయెడల గర్భిణి శీఘ్రముననె ప్రసవించునని తెలియందగు. గర్భిణికి ప్రసవకాలము సమీపించినపుడు కటిప్రదేశము, పృష్ఠము వీనియందంతట వేదన ప్రతిక్షణమునందు విరేచనములు గలిగి యోనిద్వారము నుండి మూత్రము, ప్రతిక్షణమున శ్లేష్మము బయలు వెడలుచుండును.

### ఆసన్నప్రసవోపచారము.

సూ. ప్రజనయిష్యమాణాం కృతమఙ్గళస్వస్తివాచనాం కుమారపరివృతాం పున్నామఫలహస్తాం స్వభ్యక్తాముష్ణోదకపరిషిక్తామథైనాం సమ్భృతాం యవాగూమాకణ్ఠాత్పాయయేత్. తతః కృతోపధానే మృదువిస్తీర్ణే శయనే స్థితామాభుగ్నసక్థీముత్తానామశఙ్కనీయాః శ్చతస్రః స్త్రియః పరిణతవయసః ప్రజననకుశలాః పరికర్తితనఖాః పరిచరేయురితి. 6

గర్భిణికి ప్రసవకాలము సమీపించి యుండునపుడు ఉష్ణోదకముతో నభ్యంగ స్నానముఁ జేయించి ప్రియమైన బాలుర (బాలికల) తో నావృతురాలుగఁ జేసి మామిడి, టెంకాయ మొదలగు పున్నామధేయ ఫలములను హస్తములందునిచి మంగళ క్రియలు, ఆశీర్వచనము వీనిని జేయించి బలముకొఱకు క్షీరమిశ్రిత మగు యవాగువును సంపూర్ణముగ త్రాగించి మృదువు, విస్తీర్ణముగల శయనమునందు బాలీసుదిండు మొదలగువానిని వైచి గర్భిణిస్త్రీ తొడల నొకింత ముడుచుకొని వెలకిలఁ బరుండి ఆనుకొని యుండునటులఁ జేయవలయు. ప్రసవకాలమందు నమ్మదగినవారు, వృద్ధురాండ్రు, ప్రసవవిషయమునందుఁ జతురలునైన నలుగురుమంత్రసానులు గోరులఁ దీసి వైచికొని గర్భిణిని కడుజాగరూకతతో నుపచరించుచుండవలయు.

## గర్భిణీప్రసవప్రయత్నము.

సూ. అథాస్యా విశిఖాన్తరమనులోమమనుసుఖమభ్యజ్యాద్బ్రూయాచ్చైనామేకా సుభగే! ప్రవాహస్వేతి న చాప్రాప్తావీ ప్రవాహస్వ. తతో విముక్తే గర్భనాడీప్రబన్ధే సశూలేషు శ్రోణీవఙ్క్షణవస్తిశిరస్సు చ ప్రవాహేథాశ్శనైశ్శనైః తతో గర్భనిర్గమే ప్రగాఢం. తతో గర్భే యోనిముఖం ప్రపన్నే గాఢతరమావిశల్యభావాత్. 7

అనంతరము వారిలో నొకమంత్రసాని గర్భిణికి యోనిముఖమునందు సుఖకరముగ తైలాదుల లేపనముఁజేసి గర్భిణీస్త్రీని జూచి ఓ సౌభాగ్యవంతురాలా! స్వస్థాంతఃకరణయుక్తవై ముక్కుటచేతను గర్భనాడీబంధము శిథిలమై కటిప్రదేశము, గజ్జలు, పొత్తికడుపుయొక్క పైభాగము వీనియందు శూలగలిగియుండునపుడు మెల్లమెల్లఁగ ముక్కుటఁ ముక్కున శ్వాసము బిగించి వాయువు నధోముఖముగఁ జేయుట) చేతను, గర్భస్థశిశువును బయలు వెడలించునటుల యత్నింపుము. గర్భస్థశిశువు గర్భాశయమును వెడలి యొకింత బైలువెడలినయెడల దృఢముగ ముక్కుము, గర్భము యోనిముఖమును జెందినయెడల బైలువెడలువఱకు నతిదృఢముగ ముక్కుచుండుము అని చెప్పవలయును.

## అకాలప్రసవప్రయత్నచికిత్స.

సూ. అకాలప్రవాహణాద్బధిరం మూకం వ్యస్తహనుం మూర్ధాభిఘాతినం కాసశ్వాసశోషోపద్రుతం కుబ్జం వికటం వా జనయతి. తత్ర ప్రతిలోమమనులోమయేత్. 8

ప్రసవవేదన గలుగకుండునపుడు ముక్కినయెడల చెవిటితనము, మూగతనము, వక్రములైన హనుప్రదేశములు, వికృతమైనతల, కాసము, శ్వాసము, శోష, మొదలగునుపద్రవములు, బొక్కిఱొమ్ము, వికృతశరీరముగల శిశువు జనించును. కావున, దోషమును బోగొట్టుటకై యట్టికాలమునందు మూఢగర్భనిదానమునఁ జెప్పఁబడిన చికిత్సలఁ జేయవలయు.

## గర్భనిరోధచికిత్స.

సూ. గర్భసఙ్గే తు యోనిం ధూపయేత్కృష్ణసర్పనిర్మోకేణ పిణ్డీతకేన వా. బధ్నీయాద్ధిరణ్యపుష్పీమూలం హస్తపాదయోర్ధారయేత్సువర్చలాం విశల్యాం వా. 9

గర్భస్థశిశువు బయలువెడలక యోనిద్వారమునందు తగులుకొని యుండినయెడల కృష్ణసర్పముయొక్క కుబుసము చూర్ణమునుగాని, లేక మ్రంగచూర్ణమునుగాని, యోని

ద్వారమునందు ధూపము వేయవలయు. మఱియు హిరణ్యపుష్పీమూలమును హస్తపాదములయందుఁ గట్టవలయు.

## సద్యోజాతశిశూపచారము.

సూ. అథ జాతస్యోల్బమపనీయ ముఖం చ సైన్ధవసర్పిషా విశోధ్య ఘృతాక్తం మూర్ధ్ని పిచుం దద్యాత్. తతో నాభినాడీమష్టాఙ్గులమాయమ్య సూత్రేణ బద్ధ్వా ఛేదయేత్తత్సూత్రైకదేశం చ కుమారస్య గ్రీవాయాం సమ్యగ్బధ్నీయాత్. అథ కుమారం శీతాభిరద్భిరాశ్వాస్య జాతకర్మణి కృతే మధుసర్పిరనన్తాబ్రాహ్మీరసేన సువర్ణచూర్ణమఙ్గుల్యాఽనామికయా లేహయేత్తతో బలాతైలేనాభ్యజ్య క్షీరవృక్షకషాయేణ సర్వగన్ధోదకేన వా రూప్యహేమప్రతప్తేన వా వారిణా స్నాపయేదేనం కపిత్థపత్రకషాయేణ వా కోష్ణేన యథాకాలం యథాదోషం యథావిభవం చ. 10

శిశువు జనించినతోడనే వానిశరీరముపైనుండు జరాయువును (మావి) తీసివేసి సైంధవలవణమును నేతిలోఁగలపి శిశువుయొక్క నోటియందువ్రేలితోరుద్దుటచే కంఠమునందుండు కఫమును దొలఁగించి నేతియందుఁ గర్పూరమును బాగుగ నానబెట్టి దానిలో ప్రత్తిని దడిపి శిశువుయొక్క శిరమునందుంచి పిదప నాభినాళమును బాగుగనీడ్చి యెనిమిదంగుళములకు పైన దారము గట్టి మిగిలిననాళమును ఛేదించి నాళమునందు కట్టఁబడియుండుదారముయొక్క మఱియొకకొనను శిశుకంఠమునందు బాగుగ కట్టవలయు. పిదప శిశువును శీతోదకముచేఁ దుడిచి జాతకర్మముఁ జేయించి తేనె నెయ్యి వీనినేకముఁ జేసి యందు నల్లసుగంధిపాల, మండూకబ్రహ్మి, వీని రసములో బంగారు చూర్ణమును గలిపి దర్భవ్రేలులో నాకించి బలాతైలముచే శిశువున కభ్యంగము చేయించి యుక్తమైన కాలమునందు వాతాదిప్రకోపానుగుణముగ మఱ్ఱిమొదలగు క్షీరవృక్షముల కషాయమునుగాని, సర్వగంధము (లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి, నాగకేసరములు, కర్పూరము, తక్కోలములు, అగరు, కుంకుమపువ్వు, లవంగము)లతో కాచఁబడిన యుదకమునుగాని, బంగారు, వెండి, వీనిలో దేనినైన కాచివేయఁబడిన యుదకమునుగాని, వెలగాకుతో కాచఁబడిన యుదకమునుగాని, సుఖోష్ణముగఁ జల్లార్చి దానిచే విభవానుసారముగ స్నానము జేయించవలయు. మఱియు వాగ్భటమునందు:—జాతకర్మ చేసిన పిదప, పెద్దపాపర, శంఖపుష్పి, వస, వీనికల్కములో తేనె, నెయ్యి వీనిని గలిపి అందు గురిగింజ ప్రమాణమును దీసి కుశముతోడ నభిమంత్రించి సువర్ణచూర్ణమును సర్షపప్రమాణము గలిపి రావియాకుతో శిశువునకు నోటియందు నాకించినను, లేక, మండూ

కట్ఫలము, వస, సువర్ణచూర్ణము, పిల్లిగడ్డలు, అనువానిలో దేనిచూర్ణమునేని తేనె, నెయ్యి, వీనిలోఁ గలపి నాకించినను బుద్ధి, ఆయుష్యము, బలము గలుగునని చెప్పంబడి యున్నది.

## ప్రసవానంతరస్తన్యోత్పత్తికాలము.

శ్లో. ధమనీనాం హృదిస్థానాం వివృతత్వాదనన్తరమ్,
చతూరాత్రాత్త్రిరాత్రాద్వా స్త్రీణాం స్తన్యం ప్రవర్తతే. 11

ప్రసవించిన స్త్రీలకు హృదయమునందలి ధమనీముఖములు వికసించి నాలుగు, లేక మూఁడుదినములకు పిదప స్తనములయందు పాలను గలుగఁజేయును.

## శిశుస్తన్యపానక్రమము.

సూ. తస్మాత్ప్రథమేఽహ్ని మధుసర్పిరనన్తామిశ్రం మన్త్రపూతం త్రికాలం పాయయేద్ద్వితీయే లక్ష్మణాసిద్ధం సర్పిస్తృతీయే చ తతః ప్రాఙ్నివారితస్తన్యం మధుసర్పిస్స్వపాణితలసమ్మితం ద్వికాలం పాయయేత్. 12

కావున మొదటిదినమున తేనె, నెయ్యి వీనిలో నల్లసుగంధిపాలచూర్ణమును మిశ్రముఁజేసి మంత్రముచే నభిమంత్రించి శిశువునకు త్రికాలములయందు నాకించవలయు. ద్వితీయ, తృతీయ దినములందు లక్ష్మణపంజితో కాచఁబడిననెయ్యిని మంత్రముచే నభిమంత్రించి త్రికాలములయందు నాకించి యనంతరము, తొలుతవచ్చునట్టి పాలను పోఁగొట్టి శుద్ధమైనపాలను శిశుపాణితలప్రమాణము గ్రహించి యందు తేనె, నెయ్యి వీనిని గలపి ప్రాతఃకాలమునందును సాయంకాలమునందును త్రాగించవలెను.

## సూతికోపచారము.

సూ. అథ సూతికాం బలాతైలాభ్యక్తాం వాతహరౌషధనిక్వాథేనోపచరేత్సశేషదోషాం తు తదహః పిప్పలీపిప్పలీమూలహస్తిపిప్పలీచిత్రకశృఙ్గబేరచూర్ణం గుడోదకేనోష్ణేన పాయయేత్. ఏవం ద్విరాత్రం త్రిరాత్రం వా కుర్యాదాదుష్టశోణితాత్. విశుద్ధే తతో విదారిగన్ధాదిసిద్ధాం స్నేహయవాగూం క్షీరయవాగూం వా పాయయేత్త్రిరాత్రమ్. తతో యవకోలకులుత్థసిద్ధేన జాఙ్గలరసేన శాల్యోదనం భోజయేద్బలమగ్నిబలం చావేక్ష్య. అనేన విధినాఽధ్యర్ధమాసముపసంస్కృతా విముక్తాహారాచారా విగతసూతికాభిధానా స్యాదూర్ధ్వం పునరార్తవదర్శనాదిత్యేకే. 13

అనంతరము ప్రసవించిన స్త్రీకి బలాతైలముచే నభ్యంగమును జేయించి వాతహరములైన యోషధులతోఁ గాచఁబడిన యుదకముచే స్నానముఁ జేయించవలయు. మఱియు, వాతాదిదోషములు శేషించియున్న యెడల నాదినముననే పిప్పళ్లు, మోడి, గజపిప్పళ్లు, చిత్రమూలము, సొంటి వీనిచూర్ణమును ఉష్ణముగనుండు బెల్లపునీటిలోఁ గలపి రెండుదినములుగాని, మూఁడుదినములుగాని, దుష్టశోణితము నివర్తించువఱకుఁ గాని పానముఁ జేయించవలయు. రక్తము శుద్ధమైనపిదప, విదారిగంధాదిగణము (నేలగుమ్ముడు, ఆముదపువేరు, తేలుమణిచెట్టు, గలిజేరు, దేవదారు, ముద్గపర్ణి, మాషపర్ణి, దురదగొండి, పిల్లిగడ్డలు, పెద్దగుమ్ముడు, పాలకూర, జీవకము, ఋషభకము, ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు, సుగంధిపాల, హంసపాది) కషాయముతో స్నేహయుక్తముగఁగాని, క్షీరయుక్తముగఁగాని, సిద్ధముచేయఁబడిన యవాగువును మూఁడుదినములు పానముఁ జేయించవలయు. పిదప శాల్యన్నమును యవలు, రేగు, ఉలవలు, వీనితో సిద్ధముచేయఁబడిన జాంగలరసముతో శరీరబలము, అగ్నిబలము నెఱింగి ఒకటిన్నరమాసమువఱకు భుజింపఁజేసిన సూతిక యనునామము పోవును. కావున, పిదప పైఁ జెప్పిన యాహారాచారముల వర్జింపఁదగు. మఱికొందఱు, మరల నార్తవదర్శనమగువఱకు సూతికాత్వము గలదనియు, నంతవఱకు నీయాహారాచారాదుల నాచరింపవలయునని యనియెదరు.

## సూతికావిశేషనియమము.

సూ. ధన్వభూమిజాతాం సూతికాం ఘృతతైల యోరన్యతరస్యమాత్రాం పాయయేత్ పిప్పల్యాదికషాయానుపానం స్నేహనిత్యా చ స్యాత్త్రిరాత్రం పఞ్చరాత్రం వా బలవతీమబలాం యవాగూం పాయయేత్త్రిరాత్రం పఞ్చరాత్రం వా. అత ఊర్ధ్వం స్నిగ్ధేనాన్న సంసర్గేణోపచరేత్ ప్రాయశశ్చైనాం ప్రభూతేనోష్ణోదకేన పరిషించేత్. క్రోధాయాసమైథునాదీన్పరిహరేత్. 14

ధన్వ (చౌటి) భూములయందుఁ బ్రసవించినస్త్రీ నెయ్యి, లేక తైలము వీని మాత్రము పానముచేయించుటయే గాక, నైదుదినములు పిప్పల్యాది (పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, అల్లము, మిరియాలు, ఏనుగపిప్పళ్లు, రేణుకలు, ఏలకులు, అజామోదము, కొడిస, విషబొద్ది, జీలకఱ్ఱ, తెల్లఆవాలు, పెద్దవేపవిత్తులు, ఇంగువ, గంటుభారంగి, ద్రాక్ష, అతివిష, వస, వాయువిడంగములు, కటుకరోహిణి అనుద్రవ్యముల) కషాయానుపానముతోడ స్నేహమునుకూడ త్రాగించవలయు. బలవంతురాలగు స్త్రీకి నైనయెడల మూఁడు, లేక నైదుదినములు యవాగూపానమును బలకరమైన యన్నభక్షణమును, తరుచుగ నుష్ణోదకముచేతనే స్నానమును జేయించవలయు. మఱియుఁ, బ్రసవించిన స్త్రీ క్రోధము, ఆయాసకరమైన పనులు, మైథునము మొదలగువానిని వర్జించవలయు.

భవతశ్చాత్ర.—

శ్లో. మిథ్యాచారాత్సూతికాయా యో వ్యాధిరుపజాయతే,
స కృచ్ఛ్రసాధ్యో ఽసాధ్యో వా భవేదత్యపతర్పణాత్.
తస్మాత్తాం దేశకాలౌ చ వ్యాధిసాత్మ్యేన కర్మణా,
పరీక్ష్యోపచరేదేవం నేయమత్యయమాప్నుయాత్. 15

మిథ్యాహారవిహారములవలనఁ బ్రసవించిన స్త్రీకి జనించినరోగము అధికమైన యపతర్పణక్రియవలన కష్టసాధ్యముగాఁ గాని, యసాధ్యముగాఁ గాని యగును. కావున, రోగనివృత్తి కనుగుణమైన ఔషధాహారవిహారాదులవలన దేశకాలానుగుణముగాఁ జికిత్సించిన సుఖము గలుగును.

సూ. అథాపరా పతన్త్యానాహాధ్మానౌ కురుతే తస్మాత్కణ్ఠమస్యాః కేశవేష్టితయాఽఙ్గుళ్యా ప్రమృజేత్. కటుకాలాబుకృతివేధనసర్షపసర్పనిర్మోకైర్వా కటుతైలవిమిశ్రైర్యోనిముఖం ధూపయేత్. లాఙ్గలీమూలకల్కేన వాస్యాః పాణిపాదతలమాలిమ్పేత్. మూర్ధ్ని వాస్యామహావృక్షక్షీరమనుసేచయేత్. కుష్ఠలాఙ్గలీమూలకల్కం వా మద్యమూత్రయోరన్యతరేణ పాయయేత్. శాలిమూలకల్కం వా పిప్పల్యాదిం వా మద్యేన సిద్ధార్థకకుష్ఠలాఙ్గలీమహావృక్షక్షీరమిశ్రేణ సురామణ్డేన వా స్థాపయేత్. ఏతైరేవ సిద్ధేన సిద్ధార్థకతైలేనోత్తరవస్తిం దద్యాత్స్నిగ్ధేన వాక్లృప్తనఖేన హస్తేనాపహరేత్. 16

ప్రసవించిన స్త్రీకి మావి పడకుండిన యెడల ఆనాహము, కడుపుబ్బరము ఇవి గలుగును. కావున ప్రసవించిన స్త్రీయొక్క కంఠమునందు వ్రేళ్లయందు వెండ్రుకలను చుట్టికొని తుడవవలయును. లేక చేదుసొర, చేదుబీర, ఆవాలు, పాముకుబుసము, వీని చూర్ణమును కటుతైలము (సర్షపతైలము) నందుఁ గలపి యోనిద్వారమునందు ధూపము వేయవలయును. లేక, అరకాళ్లు, అరచేతులు, వీనియందు లాంగలీ (పొత్తిదుంప) కల్కమునైనఁ బూయవలయును. లేక, శిరమునందు జెముడుపాలను లేపనముచేయవలయును. లేక, చంగల్వకోష్ఠు పొత్తిదుంప, వీనికల్కమును మద్యములోఁ గాని, మూత్రములోఁ గాని, కలిపి పానముచేయించవలయును. లేక, శాలిమూలము (వరివేరు) కల్కమునేని, పిప్పల్యాదిగణకల్కమునేని మద్యములోఁగలిపిగాని, తెల్లఆవాలు, చంగల్వకోష్ఠు, పొత్తిదుంప, జెముడుపాలు, అను వానికల్కములో సురామండమను మద్యమును గలిపి గాని, నిరూహవస్తిని చేయవలయును. మఱియు, పైఁ జెప్పిన తెల్లఆవాలు మొదలగు ద్రవ్యములతో సిద్ధముచేయఁబడిన సర్షపతైలముచే నుత్తరవస్తిని జేయవలయును. లేక,

నఖములఁ దీసికొని చేతులకు నెయ్యి మొదలగువానిని బూసికొని హస్తముతో లోపల నుండు మావిని వెలుపలఁ దీయవలయు.

## మక్కల్లరోగచికిత్స.

సూ. ప్రజాతాయాశ్చ నార్యా రూక్షశరీరాయాస్తీక్ష్ణైరవిశోధితం రక్తం వాయునా తద్దేశగేనాతిసంరుద్ధం నాభేరధః పార్శ్వయోర్వస్తౌ వస్తిశిరసి వా గ్రన్థిం కరోతి. తతశ్చ నాభివస్త్యుదరశూలాని భవన్తి సూచీభిరివ నిస్తుద్యతే భిద్యతే దీర్యత ఇవచ పక్వాశయః. సమన్తాదాధ్మానముదరే మూత్రసఙ్గశ్చ భవతీతి మక్కల్లలక్షణమ్. తత్ర వీరతర్వాదిసిద్ధం జలమూషకాదిప్రతీవాపం పాయయేత్, యవక్షారచూర్ణం వా సర్పిషా సుఖోదకేన వా, లవణచూర్ణం వా పిప్పల్యాదిక్వాథేన, పిప్పల్యాదిచూర్ణం వా సురామణ్డేన, వరుణాదిక్వాథం వా పఞ్చకోలైలాప్రతీవాపం, పృథక్పర్ణ్యాదిక్వాథం వా భద్రదారుమరిచసంసృష్టం, పురాణగుడం వా త్రికటుకచతుర్జాతకకుస్తుమ్బురుమిశ్రం ఖాదేదచ్ఛం వా పిబేదరిష్టమితి. 17

ప్రసవించినస్త్రీ రూక్షశరీరముగలదిగ నుండినయెడల దానిరక్తమును తీక్ష్ణమైన ద్రవ్యములచే శోధించవలయు. అటుకాదేని నారక్తము రక్తస్థానమునందు వ్యాపించుచుండు వాయువుచే నడ్డగింపఁబడి నాభికి క్రిందిభాగమునఁగాని, యిరుప్రక్కలయందుఁగాని, వస్తియందుఁగాని, వస్తిశిరమునందుఁగాని, గ్రంథిని గలుగఁజేయును. అందువలన నాభి, వస్తి, ఉదరము వీనియందు శూల, పక్వాశయమునందు సూదులచేఁ బొడుచునటుల, భేదించునటుల, చీల్చునటుల వేదన, ఉదరమునం దంతట నుబ్బరము, మూత్రము బంధించుట ఈమొదలగు మక్కల్లరోగలక్షణములు గలుగును. దానియందు, వీరతర్వాది (మద్ది, పచ్చపువ్వులగోరింట, నల్లపువ్వులగోరింట, దర్భ, బడనిక, ప్రేంకణము, నలము, కుశదర్భ, రెల్లు, కొండపిండి, తెక్కలి, చాగ, మూర్వ, తెల్లజిల్లేడు, ఉత్తరేణు, పెద్దమాను, యెఱ్ఱపూవులగోరింట, నల్లకలువ, బ్రాహ్మి, ఏనుగపల్లేరు) అను ద్రవ్యసిద్ధమయిన కషాయములో ఊషకాది (చౌటిమన్ను, సైంధవలవణము, శిలాజితు, వాలుకాకాసీసము, పుష్పకాసీసము, ఇంగువ, మయూరతుత్థము) ద్రవ్యచూర్ణమును వైచి త్రాగించవలయు. యవక్షారచూర్ణమును నేతితోఁగాని వేడినీటితోఁగాని లవణచూర్ణమును పిప్పల్యాది ద్రవ్యకషాయములోఁగాని పిప్పల్యాది చూర్ణమును సురామండముతోఁగాని వరుణాది (ఉలిమిడి, నల్లపూలగోరింట, మునగ, ఎఱ్ఱమునగ,

తక్కిలి, వద్ది, నెమలడుగుమ్రాను, క్రానుగు, చాగ, కూరనెల్లి, పచ్చపూలగోరింట, ఎఱ్ఱపూలగోరింట, దొండ, జిల్లేడు, ఉత్తరేణి, చిత్రమూలము, పిల్లిగడ్డలు, మారేడు, దుష్టపుతీఁగ, దర్భ, వాకుడు, ములక) ద్రవ్యకషాయములో పంచకోలములు (పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, సొంటి) ఏలకులు, వీనిచూర్ణమును గలిపిగాని, పృథక్పర్ణ్యాదిద్రవ్యకషాయములో దేవదారుచెక్క, మిరియాలు, వీనిచూర్ణమును గలిపిగాని, ప్రాతబెల్లముతో, త్రికటుకములు, సొంటి, పిప్పలి, మిరియాలు, చతుర్జాతకములు (లవంగపుపట్ట, ఏలకులు, లవంగపుపత్రి, నాగకేసరములు) ధనియాలు, వీనిచూర్ణమును గలిపిగాని భక్షించవలయు. లేక, నిర్మలమైన యరిష్టమునుగాని పానము చేయించవలయు.

## బాలకోపచారము.

సూ. అథ బాలం క్షౌమపరివృతం క్షౌమవస్త్రాస్తృతాయాం శయ్యాయాం శాయయేత్. పీలుబదరీనిమ్బపరూషకశాఖాభిశ్చైనం వీజయేత్. మూర్ధ్ని చాస్యాహరహస్తైలపిచుమవచారయేత్. ధూపయేచ్చైనం రక్షోఘ్నైర్ధూపైః. రక్షోఘ్నాని చాస్య పాణిపాదశిరోగ్రీవాస్వవసృజేత్. తిలాతసీసర్షపకణాంశ్చాత్ర ప్రకిరేత్. అధిష్ఠానే చాగ్నిం ప్రజ్వాలయేత్. వ్రణితోపాసనీయం చావేక్షేత. 18

పిదప బాలునిపై పట్టువస్త్రమును గప్పి పరుపుపైఁ బట్టువస్త్రమును బఱచి ప్రాక్ఛిరముగ పరుండఁబెట్టి గోగు, రేగు, వేప, చిట్టీత అనువానికొమ్మలతో విసరుచుండుట, చమురులోఁ దడుపఁబడినప్రత్తిని ప్రతిదినము శిరమునం దునుచుట, రక్కసు లాసించకుండునటుల రక్షోనివారకమైన ధూపముల వేయుట, రాక్షసనివారకమైన యోషధులను జేతులు, కాళ్లు, శిరము, కంఠము వీనియందుఁ గట్టుట, సూతికాగృహమునందు నువ్వులు, ఆగసివిత్తులు, ఆవాలు, పిప్పళ్లు వీనిని జల్లుట, సూతికాగృహమునందు అగ్నిని ప్రజ్వలింపఁజేయుట, వ్రణితునికిఁ జేయునుపచారములఁ జేయుట మున్నగువిధుల నాచరించవలయు.

## నామకరణవిధి.

సూ. తతో దశమేఽహని మాతాపితరౌ కృతమఙ్గళకౌతుకౌ స్వస్తివాచనం కృత్వా నామ కుర్యాతాం యదభిప్రేతం నక్షత్రనామ వా.

పదియవదినమున తలిదండ్రులు మంగళస్నానాలంకృతులై స్వస్తివాచనపూర్వకముగ బాలునికి తమకిష్టమైన నామమునేని నక్షత్రనామమునేని నిడవలయు.

### ఉపమాతృ(దాది)లక్షణము.

సూ. తతో యథావర్ణం ధాత్రీముపేయాన్మధ్యమప్రమాణాం మధ్యమవయసమరోగాం శీలవతీమచలామలోలుపామకృశామ స్థూలాం ప్రసన్నక్షీరామలమ్బౌష్ఠీమలమ్బోర్ధ్వస్తనీమవ్యఙ్గామవ్యసనినీం జీవద్వత్సాం దోగ్ధ్రీం వత్సలామక్షుద్రకర్మిణీం కులే జాతామతో భూయిష్ఠైశ్చ గుణైరన్వితాం శ్యామామారోగ్యబలవృద్ధయే బాలస్య. తత్రోర్ధ్వస్తనీ కరాళం కుర్యాత్. లమ్బస్తనీ నాసికాముఖం ఛాదయిత్వా మరణమాపాదయేత్. 20

పిదప మిక్కిలిపొడవు, మిక్కిలిపొట్టియుం గాక మధ్యమప్రమాణము, మధ్యవయసు గలదిగ, రోగములేనిదిగ, మంచినడతగలదిగ, చాపల్యము, ఆశ ఇవి లేకుండునదిగ, మిక్కుటమైనకృశత్వము, స్థౌల్యములేనిదిగ, నెల్లపుడు స్వచ్ఛమైన క్షీరముగలదిగ వ్రేలాడు పెదవులులేనిదిగ, వ్రేలునట్టియు నూర్ధ్వముఖముగనుండునట్టియు స్తనములు లేకుండునదిగ, అంగవైకల్యము, వ్యసనము ఇవిలేనిదిగ, జీవించియుండు శిశువు మిక్కుటమైనపాలుంగలదిగ, ప్రేమతోఁగూడియుండునదిగ, నీచకృత్యములు చేయనిదిగ, సత్కులమందుఁ బుట్టినదిగ, పైఁజెప్పినగుణములకంటె నతిశయమైనగుణములతోఁ గూడియుండునదిగ, యౌవనమధ్యస్థురాలుగ నుండునట్టి యుపమాతను (దాది) శిశువుయొక్క ఆరోగ్యబలవృద్ధులకొఱకు బ్రాహ్మణాదివర్ణోచితముగ నియమించవలయు. దానియొక్క స్తనము లూర్ధ్వముగ నుండినయెడల శిశువునకు వక్రములు, ఉన్నతములునైన దంతములు గలుగు. వ్రేలాడుచుండిన శ్వాసము రాకుండునటుల శిశువుయొక్కముఖమును ముక్కు నడ్డగించును. కావున శిశువునకు మరణము కలుగును. అటుకాదేని శిశువుయొక్క నాసికమునకు వికారమైనఁ గలుగును.

### స్తన్యపాననియమము.

సూ. తతః ప్రశస్తాయాం తిథౌ శిరస్స్నాతామహతవాససముదఙ్ముఖం శిశుముపవేశ్య ధాత్రీం ప్రాఙ్ముఖముపవేశ్య దక్షిణం స్తనం ధౌతమీషత్పరిస్రుతమభిమన్త్ర్య మన్త్రేణానేన పాయయేత్. 21

పిదప పూర్వోక్తలక్షణములు గల యుపమాతకు మంచిదినమునం దభ్యంగస్నానము చేయించి నూతనవస్త్రములఁ గట్టించి దానిని తూర్పుముఖముగఁ గూర్చుండఁ బెట్టి ఒడియం దుత్తరముఖముగ శిశువును గూర్చుండఁబెట్టి దానియొక్క దక్షిణస్తనమును

బాగుగ కడిగి యొకింతపాలను పిండి ఇఁకఁ జెప్పఁబోవు మంత్రముతో నాస్తనము నభిమంత్రించి శిశువునకు స్తన్యపానమును జేయించవలయు.

## స్తనాభిమంత్రణమంత్రము.

శ్లో. చత్వారస్సాగరాస్తుభ్యం స్తనయోః క్షీరవాహిణః,
భవన్తు సుభగే! నిత్యం బాలస్య బలవృద్ధయే.
పయోఽమృతరసం పీత్వా కుమారస్తే శుభాననే!
దీర్ఘమాయురవాప్నోతు దేవాః ప్రాశ్యామృతం యథా. 22

ఈమంత్రముచే స్తనము నభిమంత్రించవలయును.

## నానాస్తన్యపాననిషేధము.

సూ. అతోఽన్యథా నానాస్తన్యోపయోగస్యాసాత్మ్యాద్వ్యాధిజన్మ భవతి. అపరిస్రుతేఽప్యతిస్తబ్ధస్తన్యపూర్ణస్తనపానాదుత్స్నహితస్రోతసశ్శిశోః కాసశ్వాసవమీప్రాదుర్భావః. తస్మాదేవం విధానం స్తన్యం న పాయయేత్. 23

పైఁజెప్పిన నియమము నతిక్రమించి యనేకస్త్రీలస్తన్యమును బానముజేయించుటవలన నసాత్మ్యమువలన శిశువుయొక్క శరీరమునందు పాలు ఇమడక శిశువునకు వ్యాధులు గలుగును. శిశువు స్తన్యముఁ జేయునపుడు స్తన్యముస్రవించక స్తబ్ధముగ నుండినను, అధికముగ స్రవించుచుండినను, నోరుపారబోయి కాసశ్వాసములు, వాంతి గలుగును. కావున, నిట్టివిధమైన స్తన్యపానమును శిశువునకుఁ జేయించఁ జనదు.

## స్తన్యవృద్ధ్యుపచారము.

సూ. క్రోధశోకావాత్సల్యాదిభిశ్చ స్త్రియాస్స్తన్యనాశో భవతి. అథాస్యాః క్షీరజననార్థం సౌమనస్యముత్పాద్య యవగోధూమశాలిషష్టికమాంసరససురాసౌవీరకపిణ్యాక లశునమత్స్యకశేరుకశృఙ్గాటకబిసవిదారికన్దమధూకశతావరీనలికాలాబూ కాలశాకప్రభృతీని విదధ్యాత్. 24

క్రోధము, శోకము, ప్రేమలేకుండుట మొదలగువానివలన స్త్రీలకు క్షీరము నశించును. కావున, పాలు వృద్ధిఁజెందుటకై వస్త్రాభరణాదులచే నాయుపమాతను సంతోషపఱచి యవలు, గోధుమలు, శాలిబియ్యము, అఱువదిదినములకు ఫలించుపరిబియ్యము, మాంసరసము, మద్యము, కలి, తెలికపిండి, వెల్లుల్లి, మత్స్యములు, నెమ్ముటములు, పరికగడ్డ, తామరదుంపలు, నేలగుమ్ముడుదుంప, అతిమధురము, పిల్లిగడ్డలు, రేణుకలు, సొరకాయ, పొలముబచ్చలి మొదలగువానిని పక్వముచేసి భుజింపఁజేయవలయు.

### శుద్ధస్తన్యలక్షణము.

సూ. అథాస్యాః స్తన్యమప్సు పరీక్షేత; తచ్చేచ్ఛీతలమమలం తను శఙ్ఖావ
భాసమప్సు న్యస్తమేకీభావం గచ్ఛత్యఫేనిలమతన్తుమన్నోత్ప్లవతే న
సీదతి వా తచ్ఛుద్ధమితి విద్యాత్తేన కుమారస్యారోగ్యం శరీరోప
చయో బలవృద్ధిశ్చ భవతి. 25

దాదియొక్క స్తన్యము నుదకమునందు వైచినతోడనే చల్లగ, నిర్మలముగ, పలచనగ, శంఖమువలె తెల్లగ, నీటియందేకీభావమును జెంది నురుగులేకుండ తీఁగపాఱక మిక్కిలి తేలక మిక్కిలి మునఁగకయుండినయెడల నట్టిస్తన్యము శుద్ధమైనదని తెలియవలయు. ఇట్టిస్తన్యపానముచే శిశువులకు శరీరమునం దారోగ్యము, బలము గలుగును.

### దుష్టస్తన్యపాననిషేధము.

సూ. న చ క్షుధితశోకార్తశ్రాన్తప్రదుష్టధాతుగర్భిణీజ్వరితాతిక్షీణాతి
స్థూలవిదగ్ధభక్ష్యవిరుద్ధాహారతర్పితాయాః స్తన్యం పాయయేన్నా
జీర్ణౌషధం చ బాలం దోషౌషధాశనానాం తీవ్రవేగోత్పత్తి
భయాత్. 26

ఆఁకలి, శోకము, శ్రమ, ధాతువికారము, గర్భము, జ్వరము, మిక్కిలి కృశత్వము, మిక్కుటముగ స్థౌల్యము, మాడిపోయిన మత్స్యాద్యన్నాహారసేవనము గలిగియుండునట్టి స్త్రీల స్తన్యమును శిశువునకుఁ ద్రాగించఁ జనదు. మఱియుఁ, శిశువునకొసంగియుండునౌషధము జీర్ణముఁ జెందకుండునపుడు స్తన్యపానముఁ జేయించిన, వాతాది దోషములు, ఔషధము, మందుత్రాగిన స్తన్యము (ఆహారము) వీనియందు తీవ్రవేగము గలుగును. కావున, నట్టికాలమునందు స్తన్యపానము జేయించఁజనదు.

భవన్తి చాత్ర.—

శ్లో. ధాత్ర్యాస్తు గురుభిర్భోజ్యైర్విషమైర్దోషలైస్తథా,
దోషా దేహే ప్రకుప్యన్తి తతస్స్తన్యం ప్రదుష్యతి.
మిథ్యాహారవిహారిణ్యా దుష్టా వాతాదయస్స్త్రియాః,
దూషయన్తి పయస్తేన శారీరా వ్యాధయశ్శిశోః.
భవన్తి కుశలస్తాంశ్చ భిషక్సమ్యగ్విభావయేత్. 27

ఉపమాత గురుత్వము, విరుద్ధము, వాతాదిదోషప్రకోపకరములైన యాహారముల భక్షించుటవలన, మిథ్యాహారవిహారములవలన వాతాదులు ప్రకోపించి స్తన్యమును జెఱచి శిశువునకు శరీరమునందు నానావిధరోగములఁ గలుగఁజేయును. కావున, బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు బాగుగఁ బరిశీలించి చికిత్సఁ జేయవలయు.

### శిశుశరీరవ్యాధిచిహ్నము.

శ్లో. అఙ్గప్రత్యఙ్గదేశే తు రుజా యత్రాస్య జాయతే,
ముహుర్ముహుస్స్పృశతి తం స్పృశ్యమానే చ రోదితి.
నిమీలితాక్షో మూర్ధస్థే శిరోరోగేన ధారయేత్,
వస్తిస్థే మూత్రసఙ్గార్తో రుజా తృష్యతి మూర్ఛతి.
విణ్మూత్రసఙ్గవైవర్ణ్యచ్ఛర్ద్యాధ్మానాన్త్రకూజనైః,
కోష్ఠే దోషాన్విజానీయాత్సర్వత్రస్థాంశ్చ రోదనైః. 28

శిశువు అంగప్రత్యంగములయందు, వేదనగలస్థలములయందుఁ బలుమరు స్పృశించుచుండును. ఇతరులాస్థానమును స్పృశించిన నేడ్చును. రోగము శిశువునకు శిరమునందుండినయెడల కన్నుల మూసికొని తల యెత్తకుండును. వస్తియందుండినయెడల మూత్రము వెడలక వేదన, దప్పి, మూర్ఛ ఇవిగలుగును. కోష్ఠమునందుండిన మలమూత్రప్రతిబంధము, శరీరమునందు వైవర్ణ్యము, వమనము, కడుపుబ్బరము, ప్రేగులఅచుట ఇవి గలుఁగును. సర్వశరీరమునందు వేదనగలిగియుండిన మిక్కుటముగ రోదనము సేయుచుండును.

### శిశురోగచికిత్స.

సూ. తేషు చ యథాభిహితం మృద్వచ్ఛేదనీయమౌషధం మాత్రయా క్షీరపస్య క్షీరసర్పిషా ధాత్ర్యాశ్చ విదధ్యాత్, క్షీరాన్నాదస్యాత్మని ధాత్ర్యాశ్చ, అన్నాదస్య కషాయాదీనాత్మన్యేవ న ధాత్ర్యాః. 29

పైఁజెప్పిన బాలవ్యాధులయందు వైద్యుఁడు శాస్త్రమునందుఁ జెప్పఁబడినప్రకారము యవక్షారము, మిరియములు, సొంటి, పిప్పలి, శిలాజితు అనుమృదువైన ఛేదనీయౌషధముల రోగమునకుఁ దగినంత ప్రమాణముగ (తక్కువప్రమాణముగ) పాలలోఁగాని, నేతిలోఁ గాని, కలిపి స్తన్యపానముచేయు శిశువునకు, దాదికి నిప్పించవలయు. పాలు, అన్నము అను నీరెంటిని శిశువు భక్షించుకాలమున నాయుపమాతకు శిశువునకు నౌషధము నిప్పించవలయు. అన్నమును మాత్రము శిశువు భక్షించుకాలమున శిశువునకు మాత్రము ఔషధము, కషాయము మొదలగువాని నిప్పించఁ జెల్లునేగాని, దాదికి మాత్ర మిప్పించం జనదు.

### బాలౌషధప్రమాణము.

సూ. తత్ర మాసాదూర్ధ్వం క్షీరపాయాఙ్గులిపర్వద్వయగ్రహణసమ్మితామౌషధమాత్రాం విదధ్యాత్కోలాస్థిసమ్మితాం కల్కమాత్రాం క్షీరాన్నాదాయ, కోలసమ్మితామన్నాదాయేతి. 30

నడిమివ్రేలును, అనామికవ్రేలును, నొకటిగఁ జేర్చి వానికొన గణుపులదగ్గర బొటనవ్రేలు నుసిచియెత్తిన వానియందు నిలుచునంతమాత్రా ప్రమాణముగల యౌషధము ను తేనె, నెయ్యి, పాలు వీనిలో దేనియందైన గలిపి ఒకమాసము వయసుగలిగి పాలు త్రాగుచుండునట్టి శిశువున కిప్పించవలయు. మఱియుం క్షీరము, అన్నము భుజించు శిశువునకైన యెడలరేగుగింజ ప్రమాణముగల కల్కమాత్రాదులను, అన్నమును మాత్రము భుజించు శిశువునకైనయెడల రేగుపండంతప్రమాణముగల కల్కమాత్రాదుల నిప్పించవలయు. మఱియు గ్రంథాంతరమున:—"ప్రథమే మాసి జాతస్య శిశోర్భేషజ రక్తికా, అవలేహ్యా తు కర్తవ్యా మధుక్షీరసితాఘృతైః. ఏకైకం వర్ధయేత్తావద్యావత్సంవత్సరో భవేత్, తతోర్ధ్వం మాషవృద్ధిస్స్యాద్యావత్షోడశకాబ్దికే". ఒకమాసము వయస్సుగలబాలునికి తేనె, నెయ్యి, పాలు, చక్కెర వీనియం దౌషధమును గలిపి గురిగింజప్రమాణము నాకించవలయు. ఒకసంవత్సరమువఱకు ప్రతిమాసమున నొక్కొక గురిగింజయెత్తుచొప్పున నెచ్చించవలయు. సంవత్సరముమొదలు పదునాఱు సంవత్సరములవఱకు నొక్కొక మాషప్రమాణముచొప్పున నెచ్చించవలయునని చెప్పఁబడి యున్నది. కాని, "మాత్రాయా నాస్త్యవస్థానం దోషమగ్నిం బలం వయః, వ్యాధిం ద్రవ్యం చ కోష్ఠం చ వీక్ష్య మాత్రాం ప్రయోజయేత్" అనుటవలన బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు దోషాదుల బాగుగ నెఱింగి సమయానుగుణముగ మాత్రను గల్పించుకొనవలెనుగాని, మాత్రకు పరిమితిలేదని తెలియుచున్నది.

## బాలజ్వరచికిత్సాక్రమము.

శ్లో. యేషాం గదానాం యే యోగాః ప్రవక్ష్యన్తేఽగదంకరాః,
తేషు తత్కల్కసంలిప్తౌ పాయయేత శిశుం స్తనౌ.
ఏకం ద్వే త్రీణి చాహాని వాతపిత్తకఫజ్వరే,
స్తన్యపాయాహితం సర్పిరితరాభ్యాం యథార్థతః,
న చ తృష్ణాభయాదత్ర పాయయేత శిశుం స్తనౌ,
విరేకవస్తివమనాన్యృతే కుర్యాచ్చ నాత్యయాత్. 31

బాలురకు జనించురోగముల హరింపఁ జేయుటకై శాస్త్రమునందుఁ జెప్పంబడియుండు ఔషధముల కల్కమును దాదియొక్క స్తనములయందు లేపనముచేసి స్తన్యపానమును జేయించవలయు. మఱియు, స్తన్యపానముఁ జేయుచుండు శిశువునకు వాతపిత్తకఫజ్వరములు గలిగినయెడల నాయాజ్వరోక్తములగు నౌషధద్రవ్యముల కల్కమును జేసి వాతజ్వరమైనయెడల నొకదినమును, పిత్తజ్వరమైనయెడల రెండుదినములును, కఫజ్వరమైనయెడల మూఁడుదినములును దాదియొక్క స్తనములయందు లేపనముఁ జేసి స్తన్యపానముఁ జేయించవలయు. పాలు అన్నమును, లేక, కేవలమన్నమును భుజించుశిశువునకు తత్తజ్జ్వరౌషధకల్కమును, ఘృతములోఁ గలిపి ఆయాజ్వరమునకుఁ దగినట్లు 1,

2, 3, దినములు నొసంగవలయు. శిశువునకు, జ్వరాదిరోగములు గలిగియుండునపుడు తృష్ణాభయమువలన స్తన్యపానము జేయించంజనదు. మఱియు, శిశువునకు జ్వరాదిరోగములు ప్రబలియుండునపుడుతప్ప నితరకాలములయం దెపుడును విరేచనము, వస్తి, వమనము వీనిని జేయించంజనదు.

## మస్తులుంగక్షయచికిత్స.

శ్లో. మస్తులుఙ్గక్షయాద్యస్య వాయుస్తాల్వస్థినామయేత్,
తస్య తృడ్దైన్యయుక్తస్య సర్పిర్మధురకైశ్శృతమ్,
పానాభ్యఙ్జనయోర్యోజ్యం శీతామ్బ్వద్వేజనం తథా. 32

శిశువుయొక్క మస్తకమునందుండు మస్తులుంగమను మెదడు కారణాంతరమువలన నశించియుండునపుడు, వాయువు దౌడలయొక్క ఎముకలనీడ్చి మిక్కుటముగ పీడను గలుగఁజేయును. దానివలన దప్పి, దైన్యము ఇవి గలిగియుండుశిశువునకు మధుర ద్రవ్యములతో సిద్ధముచేయంబడిన ఘృతమును, పానము, లేపనము, అభ్యంజనము అను వానిని జేయించుటయే గాక చల్లనీళ్లను నేత్రములు మొదలగువానియందుంచుచు గాలి మొదలగువానిచే నుపచరించవలయు.

## బాలుర గుదపాకాదిరోగోపచారము.

శ్లో. వాతేనాధ్మాపితాం నాభిం సరుజాం తుణ్డిసంజ్ఞితామ్,
మారుతఘ్నైః ప్రశమయేత్స్నేహస్వేదోపనాహనైః.
గుదపాకే తు బాలానాం పిత్తఘ్నం కారయేత్క్రియామ్,
రసాఞ్జనం విశేషేణ పానలేపనయోర్హితమ్. 33

శిశువునకు వాతమువలన నాభియుబ్బి వేదనలతోఁగూడి మిక్కిలి లావుగనుండిన యెడల వాతహరద్రవ్యముల (దేవదారు, చెంగల్వకోష్ఠు, మ్రానిపసుపు, ఉలిమిడి, పద్మి, పిన్నముత్తవపులగము, పెద్దముత్తవపులగము, దురదగొండి, అందుగు, క్రానుగు, వెంపు తురు, పచ్చపువ్వులుగల పెద్దగోరింట, కూరనెల్లి, తిప్పతీఁగె, చిట్టాముట్టి, కొండపిండి, జిల్లేడు, పెద్దనీలి, పిల్లిగడ్డలు, తెల్లగలిజేరు, ఉత్తరేణు, దేవకాంచనము, లేలుమణి, నెనులిజుట్టుచెట్టు, రేగుపండ్లు, యవలు, ఉలవలు మొదలగు విదారిగంధాదిగణద్రవ్యములు, పృథక్పర్ణ్యాది ద్రవ్యములు అనువాని)చే స్నేహకర్మ, స్వేదకర్మ, ఉపనాహము (కట్టు కట్టుట) అను నుపచారములను, బాలునికి గుదపాకము గలిగియుండినయెడల పిత్తహరద్రవ్యముల (చందనము, రక్తచందనము, వట్టివేరు, కురువేరు, మంజిష్ఠ, నేలగుమ్ముడు, పిల్లిగడ్డలు, ప్రేంకణము, నాచు, ఎఱ్ఱకలువ, నల్లకలువ, తెల్లకలువ, అరటి, గఱిక, చాగ మొదలగునవి, కాకోల్యాదిగణద్రవ్యములు, న్యగ్రోధాదిగణద్రవ్యములు, దర్భాది

తృణపంచకములు అనువాని)చే నుపచారములను జేయవలయు. మఱియు, గుదపాకము నందు రసాంజనమును విశేషముగ పానలేపనములందు హితకరంబుగ నుండును.

## శిశువున కారోగ్యాదివృద్ధికరఘృతము.

సూ. క్షీరాహారాయ సర్పిః పాయయేత్సిద్ధార్థకవచామాంసీపయస్యాపామార్గ శతావరీ సారిబా బ్రాహ్మీ పిప్పలీహరిద్రాకుష్ఠసైన్ధవసిద్ధం, క్షీరాన్నాదాయ మధూకవచాపిప్పలీచిత్రకత్రిఫలాసిద్ధమన్నాదాయ ద్విపఞ్చమూలీక్షీరతగరభద్రదారుమరీచ మధువిడఙ్గద్రాక్షాద్విబ్రాహ్మీసిద్ధం. తేనారోగ్యబలమేధాయూంషి శిశోర్భవన్తి. 34

కేవలము స్తన్యపానమును జేయు శిశువునకు తెల్లఆవాలు, వస, జటామాంసి, క్షీరకాకోలి, ఉత్తరేణు, పిల్లిగడ్డలు, సుగంధిపాల, మండూకబ్రహ్మి (సల్లారి), పిప్పళ్లు, పసుపు, చెంగల్వకోష్ఠు, సైంధవలవణము వీనియందు సిద్ధముచేయఁబడిన ఘృతమును పానము జేయించవలయును. పాలు, అన్నము వీనిని భుజించుశిశువునకు అతిమధురము, వస, పిప్పళ్లు, చిత్రమూలము, త్రిఫలములు వీనిచే సిద్ధము చేయఁబడినఘృతమును పానము చేయించవలయు. మఱియు నాఘృతమునే శరీరమునందు లేపనమును జేయవలయు. అన్నమును భక్షించుశిశువునకు దశమూలములు, క్షీరవిదారి, (పాలగుమ్ముడు), గ్రంథితగరము, దేవదారు, మిరియాలు, అతిమధురము, వాయువిడంగములు, ద్రాక్ష, సరస్వతిఆకు, మండూకబ్రహ్మి, వీనిచే సిద్ధము చేయఁబడిన ఘృతమును పానముజేయించవలెను. మఱియు, నాఘృతమునే శరీరమునందు లేపనమును జేయవలయు. ఇట్లు చేసినచో శిశువున కారోగ్యము, బలము, బుద్ధి, ఆయుష్యము ఇవి వృద్ధియగును.

## బాలోపచారప్రకారము.

సూ. బాలం పునర్గాత్రసుఖం గృహ్ణీయాన్న చైనం తర్జయే, త్సహసా న ప్రతిబోధయేద్విత్రాసభయాత్సహసా నాపహరే దుత్క్షిపే ద్వా వాతాదివిఘాతభయాన్నోపవేశయేత్కుబ్జభయాన్నిత్యం చైనమనువర్తేత ప్రియశతైరజిఘాంసుః. ఏవమనభిహతమనాస్త్వభివర్ధతే నిత్యముదగ్రసత్త్వసమ్పన్నో నీరోగ స్సుప్రసన్నమనాశ్చ భవతి. వాతాతపవిద్యుత్ప్రభాపాదపలతాశూన్యాగారనిమ్నస్థానగృహచ్ఛాయాదిభ్యో దుర్గ్రహోపసర్గతశ్చ బాలం రక్షేత్. 35

రీరమునకు బాధగలుగకుండ శిశువును మెల్లగ నెత్తికొనవలయును. శిశువును భయ
నదు. శిశువు నిద్రించునపు డాకస్మికముగ నిదురలేపిన భయపడునుగాన, నటుల
ను. శిశువు నకస్మాత్తుగ నీడ్చిన భయంపడునుగావున నటు జేయంజనదు. శిశువు
న వాతాదులకు వైకల్యముగలుగును కావున, నెగరవేయంజనదు. ఎల్లపుడు
కంబెట్టిన బొక్కిఅొమ్ము కలుగును, కావున నట్లు చేయంజనదు. ఎల్లపుడును
రమైన క్రీడావస్తువుల నిచ్చి శిశువును సంతోషపఱచుచుండవలయును. ఈప్ర
నెల్లపు డుపచారము సేయుచుండిన శిశువున కధికమైనబలము, ఆరోగ్యము,
ందు సంతోషము, ఇవికలిగి బాగుగ వృద్ధిజెందును. మఱియు, గాలి, ఎండ,
వృక్షములు, తీగలు, పాడుపడినయిండ్లు, పల్లమగుప్రదేశము, ఇంటిసీడ,
దుష్టగ్రహములు వీని సంబంధము గలుగకుండునటుల శిశువును రక్షించుచుండ

నాశుచౌ విసృజేద్బాలం నాకాశే విషమే న చ,
నోష్ణమారుతవర్షేషు రజోధూమోదకేషు చ. 36

శుద్ధమైన ప్రదేశము, ఆకాశము (పైన నాచ్ఛాదనలేనిచోట,) మిట్టపల్లము
డుస్థలము, ఎండ, గాలి, వర్షము, దుమ్ము, పొగ, ఉదకము వీనియందు శిశువును
నదు.

## శిశుక్షీరపానక్రమము.

క్షీరసాత్మ్యతయా క్షీరమాజం గవ్యమథాపి వా,
దద్యా దాస్తన్యపర్యాప్తేర్బాలానాం వీక్ష్య మాత్రయా. 37

ల్లిపాలులేకుండుశిశువునకు తృప్తి గలుగువఱకు శరీరానుగుణముగ పాలు సాత్మ్య
న మేకపాలనుగాని, ఆవుపాలనుగాని, ప్రమాణము నెఱింగి పానము జేయించ
.

## శిశువున కన్నదానక్రమము.

ణ్మాసాచ్చైనమన్నం ప్రాశయే ల్లఘుహితం చ. నిత్య మవ
ధరతశ్చస్యా త్కృతరక్షశ్చోపసర్గభయాత్. ప్రయత్నత శ్చ
హోపసర్గేభ్యో రక్ష్యా బాలా భవన్తి. 38

ఆఱవమాసమునందు లఘువుగ, హితకరముగనుండునట్టి యన్నమును శిశువున
గృహములోపలనే యునిచికొని శాకిన్యాదిబాలగ్రహములు సోకకుండునటులం
యత్నపూర్వకముగ రక్షించుచుండవలయును.

## బాలగ్రహోపసర్గలక్షణము.

అథ కుమార ఉద్విజతే త్రస్యతి రోదితి నష్టసంజ్ఞో భవతి నఖ

దశనైర్ధాత్రీమాత్మానం చ పరిణుదతి దన్తాన్ఖాదతి కూజతిజృమ్భతే
భ్రువౌ విక్షిపత్యూర్ధ్వం నిరీక్షతే ఫేనముద్వమతిసందష్టోష్ఠః క్రూరో
భిన్నామవర్చా దీనార్తస్వరో నిశి జాగర్తి దుర్బలో మ్లానాఙ్గో
మత్స్యచుచున్దరీమత్కుణగన్ధోయథా పురా ధాత్ర్యాః స్తన్య మభి
లషతి తథా నాభిలషతీతి సామాన్యేన గ్రహోపసృష్టలక్షణ ముక్తం,
విస్తరేణోత్తరే వక్ష్యామః. 39

బాలురకు గ్రహములు సోకుటచే ప్రతిక్షణమునందు నులికిపడుట, భయము, రోదనము, మూర్ఛ నఖదంతములచేఁ దనశరీరమును దాదిశరీరమును గీచుట, కొఱుకుట, పండ్లుకొఱుకుట, వికారముగ నఱచుట, ఆవలించుట, కనుబొమలవిఱుచుట, పైనఁజూచుట, నోటిలో నురుగుకారుట, పెదవికొఱుకుట, వికారముగ గనుపించుట, అపక్వముగ మలము వెడలుట, హీనస్వరము, రాత్రులయందు నిద్రపోకుండుట, దౌర్బల్యము, శరీరము వాడియుండుట, శరీరమునందు మత్స్యములు, చుంచెలుక, నల్లులు, వీనిగంధమువంటి గంధము గలుగుట, మునుపటివలె దాదియొక్క స్తన్యము నిచ్ఛయించకుండుట, యిట్టి లక్షణములు సామాన్యముగఁ గలుగును. ఈలక్షణములు విశేషముగ నుత్తరతంత్రమునఁ జెప్పంబడును.

### విద్యాభ్యాసక్రమము.

సూ. శక్తిమన్తం చైనం జ్ఞాత్వా యథావర్ణం విద్యాం గ్రాహయేత్. 40

బాలునకు విద్యాగ్రహణాదిశక్తి గలిగినదని తెలిసికొని బ్రహ్మక్షత్రియ, వైశ్య శూద్రవర్ణోచితముగ వేదము, దండనీతి, వార్త, శుశ్రూషఅనువిద్యల నభ్యసింపంజేయవలయు.

### వివాహవిధి.

సూ. అథాస్మై పఞ్చవింశతివర్షాయ ద్వాదశవర్షాం పత్నీమావహేత్
పిత్ర్యధర్మార్థకామప్రజాః ప్రాప్స్యతీతి. 41

విద్యాసంపన్నుఁడై యిరువదియైదుసంవత్సరముల వయసుగలవానికి పండ్రెండు సంవత్సరముల వయస్సుగలకన్య నొసఁగి వివాహమును జేయవలయు. అందువలన పైతృకశ్రాద్ధాదికర్మలు, శ్రుతివిహిత యాగాది కర్మములు, అర్థము, కామము, పుత్రపౌత్రాది సంతానము అను నీపురుషార్థములఁ జెందును.

### అకాలగర్భాధాననిషేధము.

శ్లో. ఊనషోడశవర్షాయామప్రాప్తః పఞ్చవింశతిమ్,
యద్యాధత్తే పుమాన్గర్భం కుక్షిస్థస్స విపద్యతే.

జాతో వా న చిరం జీవే జ్జీవే ద్వా దుర్బలేన్ద్రియః,
తస్మా దత్యన్త బాలాయాం గర్భాధానం న కారయేత్. 42

పదునాఱు సంవత్సరములకు లోబడిన స్త్రీయందు ఇరువదియైదుసంవత్సరముల వయస్సుకు లోబడిన పురుషునివలనఁ గలుగఁజేయఁబడినగర్భము, స్రావముచేఁగాని గర్భపతనరూపముగఁగాని నశించును. అటుగాక జీవముతోజనించినను చిరకాలము జీవించకుండును. ఒకానొకప్పుడు జీవించినను దుర్బలమైన యింద్రియములు గలవాఁడుగ నుండును. కావున నధికబాల్యముతోఁగూడియుండు స్త్రీయందు గర్భాధానముఁ జేయంజనదు. అటులనే యిరువదియైదుసంవత్సరముల వయస్సునకు లోబడినపురుషునికి గర్భాధానమునం దధికారములేదు.

## వృద్ధస్త్రీగర్భాధాననిషేధము.

సూ. అతివృద్ధాయాం దీర్ఘరోగిణ్యామన్యేన వా వికారేణోపసృష్టాయాం గర్భాధానం నైవ కుర్వీత. పురుషస్యాప్యేవంవిధస్యత ఏవ దోషా స్సమ్భవన్తి. 43

మిక్కిలివృద్ధురాలు, దీర్ఘకాలమునుండి రోగముగలది, ఇతర వికారములు ఇవి గల స్త్రీయందు గర్భాధానముచేయంజనదు. ఇటులనే పురుషుఁడుకూడ నతివృద్ధుఁడుగ, దీర్ఘరోగిగ, నితరవికారములుగలవాఁడుగ నుండునపుడు గర్భాధానముఁ జేయంజనదు. అయిన నట్టిసమయమున పురుషుఁడు గర్భాధానము జేసినయెడల గర్భస్రావము, అంగవైకల్యము మొదలగు దోషములు గలుగును.

## గర్భపాతమునం దుపచారము.

సూ. తత్ర పూర్వోక్తైః కారణైః పతిష్యతి గర్భే గర్భాశయకటీవఙ్క్షణవస్తిశూలాని రక్తదర్శనం చ. తత్ర శీతైః పరిషేకావగాహప్రదేహాదిభి రుపచరేజ్జీవనీయశృతక్షీరపానైశ్చ. 44

పైఁజెప్పిన గర్భావక్రాంత్యధ్యాయమున గర్భిణికి నిషేధింపఁబడిన ఆయాసము మైథునము మొదలగు కారణములవలన గర్భపాతము గలుగునెడల గర్భాశయము, కటిప్రదేశము, గజ్జలు, వస్తి వీనియందు శూల, యోనిముఖమునుండి రక్తస్రావము ఇవి గలుగును. అట్టి సమయమునందు చల్లనీళ్లుచల్లుట, తటాకాదులయందు మునుఁగుట, యీ మొదలగు శీతోపచారములఁ జేయుటయెగాక, జీవనీయ గణద్రవ్య సిద్ధమగుక్షీరము పానము జేయించవలయును.

## గర్భస్ఫురణచికిత్స.

సూ. గర్భస్ఫురణే మధూకపుష్ప స్తత్సన్ధారణార్థం క్షీరముత్పలాదిసిద్ధం పాయయేత్. 45

గర్భము పలుమరు స్ఫురించుచుండినచో తత్సంధారణార్థమై ఉత్పలాదిగణ (నల్లకలువ, ఎఱ్ఱతామర, తెల్లకలువ, చెంగలువ, తెల్లతామర, అతిమధురము) ద్రవ్యసిద్ధమగు పాలను త్రాగించవలెను.

## గర్భస్రావాదులయందు చికిత్స.

సూ. ప్రస్రంసమానే సదాహ పార్శ్వపృష్ఠ శూలాసృగ్దరానాహ మూత్రసఙ్గాః, స్థానాత్స్థానం చోపక్రామతి గర్భే కోష్ఠేసంరమ్భః; తత్ర స్నిగ్ధశీతాః క్రియాః వేదనాయాం మహాసహాక్షుద్రసహామధుకశ్వదంష్ట్రాకణ్టకారికాసిద్ధం పయశ్శర్కరాక్షౌద్రమిశ్రం పాయయేత్; మూత్రసఙ్గే దర్భాదిసిద్ధం; ఆనాహే హిఙ్గుసౌవర్చలలశునవచాసిద్ధం; అత్యర్థం స్రవతి రక్తే కోష్ఠాగారికాగారమృత్పిణ్డసమఙ్గాధాతకీకుసుమనవమాలికాగైరికసర్జరసరసాఞ్జన చూర్ణం మధునాఽవలిహ్యా ద్యథాలాభం. న్యగ్రోధాదిత్వక్ప్రవాళకల్కం వా పయసా పాయయేత్, ఉత్పలాదికల్కం వా కశేరుశృఙ్గాటకశాలూకకల్కం వా శృతేన పయసా, ఉదుమ్బరఫలాదకకన్దక్వాథేన వా శర్కరామధుమధురేణ శాలిపిష్టం న్యగ్రోధాదిస్వరసపరిపీతం వా వస్త్రావయవం యోన్యాం ధారయేత్. 46

గర్భము తనచోటనుండి కొంచెము జారగనే తాపము, పార్శ్వము, పృష్ఠము వీనియందు శూల, రక్తముస్రవించుట, ఆనాహము, మూత్రము బంధించుట, అనునీయుపద్రవములు గలుగును. మఱియు, గర్భముస్థానాంతరము కేగునపుడు కోష్ఠమునందు ఆటోపము గలుగును. తచ్ఛమనార్థమై స్నిగ్ధముగ,శీతలముగనుండు ఉపచారముల సేయవలయు. వేదన మిక్కుటమైనయెడల కాఱుమినుములు, అడవిపెసలు, అతిమధురము, పల్లేరు,వాకుడు, వీనియందు సిద్ధము చేయఁబడినపాలలో చక్కెర,తేనె వీనిని గలపి పానము జేయించవలయు. మూత్రము బిగించి వెడలకుండినయెడల దర్భాదితృణపంచమూల (కుశదర్భ, కుదుజెల్లు, కిక్కసగడ్డి, అశ్వలాశయన దర్భ, ముంజగడ్డి) సిద్ధమగు పాలను త్రాగించవలయును. ఆనాహము కలిగియుండినయెడల ఇంగువ, సౌవర్చలవణము, వెల్లుల్లి, వస వీనిచే సిద్ధమగు పాలను త్రాగించవలయు. యోనినుండి రక్తమధికముగ స్రవించుచుండిన చెంగల్వకోష్ఠు, కరిధూపము, కందిరీగలు మొదలగువానిచేఁ గట్టఁబడిన మట్టిగూటియొక్క మన్ను, ముత్తవపులగము, ఆరెపువ్వు, విరజాజి, కావిరాయి, సర్జరసము, రసాంజనము, వీనిచూర్ణమును తేనెతోఁ గలిపి నాకించవలయు. లేక,న్యగ్రోధాది గణద్రవ్యములయొక్క

పట్టలనుగాని, లేక, చిగుళ్లనుగాని, దొరకినంతవఱకు సంగ్రహించి కల్కముచేసి పాలలోఁ గలిపిగాని, లేక, ఉత్పలాది సిద్ధమగు పాలనుగాని, లేక నెమ్ముటములు, పరికగడ్డ, జాజి కాయ వీనిచే సిద్ధమగుపాలనుగాని త్రాగించవలయు. అత్తిపండు, ఔదకకందము వీని కషాయములో పంచదార, తేనె గలిపి తేరనిచ్చి యందు వరిపేలపిండిని కలపి యుంటఁ జేసి వస్త్రములోఁ జుట్టి కాని, లేక వరిపేలపిండిని న్యగ్రోధాదికముల స్వరసములో నుంటఁజేసి వస్త్రములో చుట్టిగాని యోనియందు ధరించవలయు.

## రక్తస్రావమునందు చికిత్స.

సూ. అథాదృష్టశోణిత వేదనాయాం మధూక దేవదారుపయస్యాసిద్ధం పయః పాయయే త్తదేవాశ్మన్తకశతావరీపయస్యాసిద్ధం విదారిగంధా దిసిద్ధం వా బృహతీద్వయోత్పలశతావరీశారిబాపయస్యామధుకసిద్ధం వైవం క్షిప్ర ముపక్రాన్తాయా ఉపావర్తన్తే రుజోగర్భశ్చాప్యా యతే. 47

యోనివలన రక్తము బాగుగ స్రవింపక వేదనగలిగి యుండినయెడల అతిమధు రము, దేవదారు, క్షీరకాకోలి వీనిచే సిద్ధమగుపాలనుగాని, అశ్మంతకము, పిల్లిగడ్డలు, క్షీరకాకోలి వీనిచే సిద్ధమగు పాలనుగాని, పెద్దములక, చిన్నములక, నల్లకలువ, పిల్లిగడ్డలు, సుగంధిపాల, క్షీరకాకోలి, అతిమధురము వీనిచే సిద్ధమగు పాలనుగాని, త్రాగించిన గర్భ పాతసంబంధమగు ఉపద్రవములు శాంతిఁజెంది గర్భము వృద్ధిఁజెందును.

## గర్భవృద్ధ్యుపచారము.

సూ. వ్యవస్థితే చ గర్భే గవ్యేనోదుమ్బరశలాటుసిద్ధేన పయసా భోజ యేత్. అతీతే లవణస్నేహవర్జ్యాభి ర్యవాగూభి రుద్దాలకాదీనాం పాచనీయోపసంస్కృతాభిరుపక్రమేత యావన్తో మాసా గర్భస్య తావ న్త్యహాని 48

గర్భాశయమునందు గర్భము స్థిరముగనుండినయెడల అత్తికాయలతో సిద్ధము చేయఁబడిన ఆవుపాలతో భుజింపఁ జేయవలయు. గర్భపాతము కలిగినయెడల ఆగర్భము ఎన్నిమాసములు గలదైయుండునో అన్ని దినములవఱకు ఉద్దాలకాదిగణద్రవ్యములతో డను, పాచనీయద్రవ్యములతోడను పక్వముచేయఁబడిన యవాగువును లవణస్నేహవర్జిత ముగ త్రాగించవలయు.

## వస్తిశూలాది చికిత్స.

సూ. వస్త్యుదరశూలేషు పురాణగుడం దీపనీయసంయుక్తం పాయయే దరిష్టం వా. 49

వస్తి, ఉదరము వీనియందు శూల గలిగినయెడల ప్రాతబెల్లమును దీపనీయద్రవ్యములతో భక్షింపంజేయవలయు. లేక, అరిష్టమునుగాని పానము చేయించవలయు.

## లీనగర్భోపచారము.

సూ. వాతోపద్రవగృహీతత్వాత్స్రోతసాం లీయతే గర్భః; సోఽతికాల మవతిష్ఠమానో వ్యాపద్యతే, తాం మృదునా స్నేహాదిక్రమేణోపచరేత్. ఉత్క్రోశరససంసిద్ధామనల్పస్నేహాం యవాగూం పాయయేత్. మాషతిలబిల్వశలాటుసిద్ధాన్వా కుల్మాషాన్భక్షయేన్మధుమాద్వీకం చానుపిబే త్సప్తరాత్రమ్. 50

ఆర్తవవహసిరోతస్సులు వాతముచే శోషాద్యుపద్రవములుగలవై గర్భమును సంకోచముచెందునటులఁ జేయును. అందుచే లీనగర్భముగనుండి చాలకాలమువఱకు బయలువెడలక విపత్తును జెందును. కావున దానిని మృదువైన స్నేహాద్యుపచారముల వలనఁ జికిత్సింపవలయు. లేక, ఉత్క్రోశపక్షి (నలుపు ఎఱుపు రంగుగల ముక్కుకాళ్లుగల హంస) యొక్క మాంసరససిద్ధమై అధికమైన ఘృతాదిస్నేహయుక్తముగ నుండు యవాగువునుగాని త్రాగించవలయు. లేక, మినుములు, నువ్వులు, మారేడు పిందెలు, వీనితో సిద్ధముచేయఁబడిన ఉలవలను భక్షణార్థం బిప్పించి ఇప్పపూలతో సిద్ధముచేయఁబడిన మద్యము నేడుదినములు పానముఁ జేయించవలయు.

## గర్భచలనాభావమునం దుపచారము.

సూ. యస్యాః పునర్గర్భః ప్రసుప్తత్వా న్న స్పన్దతే తాం శ్యేనగవ్యశిఖితామ్రచూడతిత్తిరీణామన్యతమస్య సర్పిష్మతా రసేన యూషేణ ప్రభూతసర్పిషా వా భోజయేత్. 51

గర్భిణియొక్క గర్భము వాతోపద్రవమువలన నిద్రించుచు జీవించకుండినయెడల డేగ, ఆవు, నెమలి, కోడి, తిత్తిరిపక్షి వీనిలో దేనిమాంసరసమునందైనను, లేక, వాని కషాయమునందైనను మిక్కుటముగ నెయ్యిని గలిపి పానముచేయించవలయు.

## ప్రసవకాలాతిక్రమమునం దుపచారము.

సూ. కాలాతీతస్థాయిని గర్భే విశేషత స్సధాన్యములూఖలం ముసలేనాభిహన్యాద్విషమే వా యానాసనే సేవేత. 52

గర్భము ప్రసవకాలము నతిక్రమించియు బైలు వెడలకుండిన ఱోటిలో ధాన్యమునుబోసి గర్భిణీస్త్రీచే దంపించవలయు. లేక, యానము, గుఱ్ఱము మొదలగువానిపై నెక్కించి సంచరింపంజేయవలయు. లేక, మిట్టపల్లములుగ నుండుస్థలములయందు ఎచ్చుతక్కువగఁ గూర్చుండఁబెట్టవలయు.

### గర్భశోషణమునం దుపచారము.

సూ. వాతాభిపన్న ఏవ శుష్యతి గర్భః. స మాతుః కుక్షిం న పూర యతి మన్దం స్పన్దతే చ, తం బృంహణీయైః పయోభిర్మాంసరసై శ్చోపచరేత్. 53

గర్భిణికి శోకము, ఉపవాసము మొదలగువానిచే వాతము ప్రకోపించుటచే గర్భము వాతపీడితమై కృశించి లీనగర్భమువలెనే మార్గము నడ్డగింపక తల్లియుదరమును పూరింపం జేయక మెల్లమెల్లగ కదలుచుండినయెడల బృంహణీయద్రవ్యములచే కాచంబడిన పాలు, మాంసరసము వీనిని త్రాగించవలయు. ఈవిషయమున వృద్ధకాశ్యపుండు—"గర్భ నాడ్యాహ్యావహానాదల్పత్వాద్వా రసస్యచ, చిరేణాశ్యాయతే గర్భస్తథైవాకాలభోజ నాత్. అకుక్షిపూరణం గర్భోమన్దం స్పందతేవిచ" అని నుడివెను.

### వాతపీడిత గర్భోపచారము.

సూ. శుక్రశోణితం వాయునాభిప్రపన్నమవక్రాన్తజీవమాధ్మాపయత్యు దరం. తత్కదాచిద్యదృచ్ఛయోపశాన్తం నైగమేషాపహృతమితి భాషన్తే. తదేవ కదాచిత్ప్రలీయమానం నాగోదరమిత్యాహు స్త త్రాపి లీనవత్ప్రతీకారః. 54

శుక్రశోణితములు గర్భనిరోధకమైన వాతముచే దుష్టంబై జీవములేక గర్భా శయమునందుండినయెడల గర్భిణివలె నుదరము నుబ్బునటులం జేయును. అట్టిశుక్రశోణిత ములు ఒకానొకప్పుడు దైవవశముచే లీనము జెందినయెడల గర్భము బాలగ్రహముల వలన నపహరింపంబడినదని కొందఱు వచించెదరు. అట్టి దుష్టశుక్రశోణితములు శాంతిం జెందక నుదరమున నొక పార్శ్వము నాశ్రయించి లీనమైయుండినయెడల నాగోదర మని కొందఱు వచించెదరు. ఈ రెంటియందును లీనగర్భవిషయమై చెప్పియుండు గర్భ వృద్ధికరచికిత్సలం జేయవలయు.

సూ. అత ఊర్ధ్వం మాసానుమాసికం వక్ష్యామః. 55

ఇంక ప్రతిమాసమునందును గర్భమునకుం జేయందగిన యుపచారముల వచిం చెదము.

### ప్రథమమాసాది గర్భోపచారము.

శ్లో. మధుకం శాకబీజం చ పయస్యా సురదారు చ,
అశ్మన్తక స్తిలాః కృష్ణా స్తామ్రవల్లీ శతావరీ.
వృక్షాదనీ పయస్యా చ లతా చోత్పలశారిబా,
అనన్తా శారిబా రాస్నా పద్మా మధుకమేవ చ.
బృహత్యౌ కాశ్మరీ చాపి క్షీరిశుఙ్గా స్త్వచో ఘృతమ్,

పృశ్నిపర్ణీ బలా శిగ్రు శ్శ్వదంష్ట్రా మధుపర్ణికా.
శృఙ్గాటకం బిసం ద్రాక్షా కశేరు ర్మధుకం సితా,
వత్సైతే సప్తయోగా స్స్యు రర్ధశ్లోకసమాపనాః,
యథాసఙ్ఖ్యం ప్రయోక్తవ్యా గర్భస్రావే పయోయుతాః. 56

ప్రథమమాసమునందు గర్భస్రావము కలిగినయెడల నతిమధురము, టేకువిత్తులు, క్షీరకాకోలి, దేవదారు అనువాని చూర్ణమును, రెండవమాసమునందైనయెడల నశ్మంతకము, నల్లనువ్వులు, మంజిష్ఠి, పిల్లిగడ్డలు అనువానిచూర్ణమును, మూఁడవమాసమునందైనయెడల బదనిక, క్షీరకాకోలి, నల్లసుగంధిపాలతీఁగ అనువానిచూర్ణమును, నాలవమాసమునందైనయెడల ననంత, సుగంధిపాల, సన్నరాస్నము, ముణుగుదామర, అతిమధురము అనువానిచూర్ణమును, ఐదవమాసమునందైనయెడల ములక, వాకుడు, గుమ్ముడు, వటాదిక్షీరవృక్షములయొక్క అగ్రముల చిగురుమొగ్గలు (ఈనెలు) పట్టలు వీనిచూర్ణమును, ఘృతమును, ఆఱవమాసమునందైనయెడల కోలపొన్న, చిట్టాముట్టి, మునగ, పల్లేరు, గుమ్ముడు అనువానిచూర్ణమును, ఏడవమాసమునందైనయెడల పరికగెడ్డ, తామరతూండ్లు, ద్రాక్ష, నెమ్ముటములు, అతిమధురము, పంచదార, అనువాని చూర్ణమును పాలలోఁగలిపి క్రమముగ పానముఁ జేయించవలయు.

## అష్టమమాసాదిగర్భోపచారము.

శ్లో. కపిత్థబృహతీ బిల్వపటోలేక్షునిదిగ్ధికాః,
మూలాని క్షీరసిద్ధాని పాయయే ద్భిషగష్టమే.
నవమే మధుకానన్తా పయస్యాశారిబాః పిబేత్,
క్షీరం శుణ్ఠీపయస్యాభ్యాం సిద్ధం స్యా ద్దశమే హితమ్.
సక్షీరా వా హితా శుంఠీ మధుకం సురదారు చ,
ఏవమాప్యాయ్యతే గర్భ స్తీవ్రా రుక్చోపశామ్యతి. 57

ఎనిమిదవమాసమునందు గర్భమునకు విపత్తు గలిగెనేని వెలగ, ములక, మారేడు, పొట్ల, వాకుడు వీనివ్రేళ్లను చితుకగొట్టి పాలలోవైచి కాచి పానముఁ జేయించవలయు. తొమ్మిదవమాసమునం దతిమధురము, అనంత, క్షీరకాకోలి, సుగంధిపాల వీని పాలలో నుడికించి పాలను త్రాగించవలయు. పదియవమాసమునందు సొంటి, క్షీరకాకోలి వీనితో బాగుగఁ గాచఁ బడినపాలను పానముఁ జేయించవలయు. లేక, సొంటి, అతిమధురము, దేవదారు వీనిచూర్ణమును పాలలోఁగలిపి త్రాగించవలయు. ఈప్రకారము చేసినయెడల గర్భమునకు స్రావాదులు గలుగక గర్భము వృద్ధిఁజెందుటయే గాక తీవ్రమైన యుపద్రవములుకూడ శమించును.

సూ. నివృత్తప్రసవాయా స్తు పున ష్షడ్భ్యో వర్షేభ్య ఊర్ధ్వం ప్రసవమానాయా నార్యాః కుమారో ఽల్పాయు ర్భవతి. 58

స్త్రీ ప్రసవించిన ఆఱుసంవత్సరములకుపైన మరల ప్రసవించినయెడల జనించు శిశువు అల్పాయుష్యము గలిగియుండును.

## గర్భిణీవమనాదిక్రమము.

సూ. అథ గర్భిణీం వ్యాధ్యుత్పత్తావత్యయేచ్ఛర్దయేన్మధురామ్లేనాన్నే పహితే నానులోమయేచ్చ, సంశమనీయం చ మృదువిదధ్యాదన్న పానయోరశ్నీయాచ్చ మృదువీర్యం మధురప్రాయం గర్భావిరుద్ధం చ, గర్భావిరుద్ధాశ్చ క్రియా యథాయోగం విదధీత మృదుప్రాయాః. 59

గర్భిణికి ప్రాణనాశరోగములు జనించినయెడల మాత్రము వమనమును జేయించవలయు. మఱియు, మధురరసము (పైఁజెప్పినకాకోల్యాదిగణద్రవ్యములరసము) ఆమ్లరసము (దాడిమ, ఉసిరిక, మాదీఫలము, అంబాళము, వెలగ, ఓక, అరవెల్లి, చింత' తుమ్మెదమామిడి, కోలితుమికి, పేముపండ్లు, కమ్మరేగు, పుల్లప్రబ్బలి, నిమ్మ, పెరుగు' మజ్జిగ, కల్లు, పులికడుగు, కాంజికము మొదలగునవి) వీని నన్నముతోఁ జేర్చి యొసంగుటచే అనులోమక్రియను అన్నపానయుక్తముగ, సంశమనక్రియను మృదువుగఁ జేయవలయు. మధురమై గర్భమునకు విరుద్ధముకాకుండునట్టి మృదువైన వీర్యముగలపదార్థముల భుజింపఁ జేయవలయు. గర్భవిరుద్ధముకాక అతిమృదువుగనుండు క్రియలను యథోక్తముగ చేయవలయు.

## బాలవృద్ధ్యుపచారము.

భవన్తిచాత్ర.—

శ్లో. సౌవర్ణం శౌక్తికం చూర్ణం కుష్ఠం మధుఘృతం వచా,
మత్స్యాక్షక శ్శఙ్ఖపుష్పీ మధు సర్పిశ్చ కాఞ్చనమ్.
అర్కపుష్పీ మధుఘృతం చూర్ణితం కనకం వచా,
హేమచూర్ణాని కైడర్య శ్శ్వేతదూర్వా ఘృతం మధు.
చత్వారోఽభిహితాః ప్రాశ్యాః శ్లోకార్ధేషు చతుర్ష్వపి,
కుమారాణాం వపుర్మేధాబలబుద్ధివివర్ధనాః. 60

ఇతి శ్రీ సుశ్రుతాచార్యవిరచితే ఆయుర్వేదశాస్త్రే సుశ్రుతే
తృతీయే శారీరస్థానే దశమోఽధ్యాయః.
సమాప్తమ్.

సువర్ణము, ముత్యపుచిప్ప, చెంగల్వకోష్టు, అతిమధురము, వస, వీనిచూర్ణ ఘృతములోఁ గలిపి గాని, పొన్నగంటి, శంఖపుష్పి, దేవకాంచనము వీనిచూర్ణ తేనె, నెయ్యి వీనిలోఁ గలిపిగాని కోలపాల (అర్కపుష్పి), స్వర్ణము, వస వీని మును తేనె, నెయ్యి వీనిలోఁ గలిపిగాని, సువర్ణము, వేప, తెల్లగఱిక వీనిచూర్ణ తేనె, నెయ్యి వీనిలోఁ గలిపిగాని నాకించవలయు. "విడంగఫలమాత్రం తు జాతస్య భేషజం, ఏతేనైవ ప్రమాణేన మాసిమాసి వివర్ధితః. కోలాస్థిమాత్రం క్షీరద్యాద్భేషజకోవిదః" శిశువు జనించినతోడనే పైఁజెప్పిన యౌషధముల వాయువి ప్రమాణము నొకమాసమువఱకు నిప్పించవలయు. పిదప రెండవమాసము మొదల మాసములవఱకు ప్రతిమాసమునందు నొక్కొకవాయువిడంగప్రమాణము చొ క్రమముగ నెచ్చించవలయు. క్షీరపానముఁ జేయుచుండువఱకు రేగువిత్తంత ప్ర ముగ నౌషధము నిప్పించవలయు. అన్నమును భుజించుచుండునపుడు అత్తిపం ప్రమాణముగ నౌషధము నియ్యవలెను. ఈప్రకారము నుపచరించుచుండిన శిశుఁ శరీరము, మేధ, బలము, బుద్ధి ఇవి వృద్ధిఁజెందును.

సుశ్రుతశారీరస్థానము

సంపూర్ణము.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1941.